


# అఖిలవంగమహిళామహాసభ

మేమాసము ఒకటి, రెండు, మూడు తారీఖులయందు కలకత్తానగరములో పురమందిరమున అఖిలవంగమహిళామహాసభ సమావేశమైనది. శ్రీమతి మోహినీదేవిగారు ఆహ్వానసంఘాధ్యక్షురాలు; శ్రీమతి సరళాదేవిచౌదురాణిగారు సభాధ్యక్షురాలు. ప్రథమదినము ఆహ్వానసంఘాధ్యక్షురాలియు, సభాధ్యక్షురాలియు ప్రారంభోపన్యాసములతో తుదముట్టినది.

రెండవదినమున తీర్మానములమీద చర్చప్రారంభమైనది. మొదటిరెండు తీర్మానములు అధ్యక్షురాలిచే ప్రతిపాదింపబడినవి. మొదటితీర్మానము లవణసత్యాగ్రహోద్యమమునందు స్త్రీలొనర్చినసేవను కొనియాడుచు, ప్రభుత్వమువారి దౌర్జన్యమునకు అందు ముఖ్యముగ బోర్సదు, మిడ్నపూరు మొదలగు తావులయందు స్త్రీలుచూపినకష్టసహనబుద్ధిని ప్రశంసించునది. మాతృదాస్యవిమోచనముకొఱకు సత్యాగ్రహసమరమున ప్రాణములర్పించిన మహనీయులఆత్మకు శాంతినిగోరు తీర్మానము రెండవది. మూడవతీర్మానము గాంధి-ఇర్విను సంధిపత్రమును సమర్థించుచు అన్నికక్షలరాజకీయనిర్బంధితులను విడుదలచేయవలయుననియు, రాజకీయ నేరములకై మరణశిక్షవిధింపబడినవారిశిక్ష రద్దుచేయవలయుననియు ప్రభుత్వమువారిని కోరుచున్నది. వోటింగుహక్కు, ఎన్నికలహక్కు పురుషులతోబాటు స్త్రీలకుగూడ ప్రసాదింపబడవలయునని నాలగవతీర్మానము. జాయింటుఎన్నికలపద్ధతి జాతీయతను పెంపొందించునుగావున ఆపద్ధతినేఅవలంబింపవలయునని ఐదవతీర్మానము హెచ్చరించుచున్నది. జాతీయోద్యమమునందు పాల్గొని పేరుప్రతిష్ఠలు సంపాదించుటకు వంగదేశపుస్త్రీలకు పురుషులుఅడ్డుతగులుచుండిరిగావున స్త్రీలకు ప్రత్యేకసంఘముండవలయుననియు, అది కాంగ్రెసుఆదేశములను పురుషసహాయములేకనే నిర్వహింపవలయుననియు ఆఱవతీర్మానము. ఈతీర్మానమును శ్రీమతి శాంతిదాసుకన్య కొనివచ్చినది; ఏకగ్రీవ

ముగ ఆమోదింపబడినది. ఈ ఆఱవతీర్మానమును సభలో ఏకగ్రీవముగ ఆమోదింపజేసిన ప్రజ్ఞావతియే తదుపరి తీర్మానమునుగూడ ప్రతిపాదించినది. ఆతీర్మానమిట్లుండెను: 'సాంఘిక వైషమ్యములు దేశమునుండి పారద్రోలుటకుగాను (1) అస్పృశ్యతతొలగిపోవలయును (2) వర్ణవ్యవస్థ అంతమొందవలయును (3) శాఖాంతరవర్ణాంతరవివాహములు పెంపొందవలయును (4) వర్ణాంతరభోజనప్రతిభోజనములు ఏర్పడవలయును.' సుప్రసిద్ధగ్రంథకర్త్రియగు శ్రీమతి అనురూపాదేవి ఈతీర్మానమునందలి 'శాఖాంతరవర్ణాంతరవివాహములు పెంపొందవలయు'ననుభాగము తొలగింపవలయునని సవరణ ప్రతిపాదించెను. వాదప్రతివాదములు చెలరేగినవి. ఉపన్యాసములమీద ఉపన్యాసములు వర్షించినవి. తుదకు ఓట్లు గైకొనగా అసలుతీర్మానమునకు నలుబదియైదును సవరింపబడినతీర్మానమునకు ఏబదియు వచ్చినవి. ఇందుతో సభ పూర్వాచారమునకే మొగ్గియున్నట్లు విస్పష్టమయ్యెను. అంతతో రెండవదినసమావేశము సమాప్తమయ్యెను.

మూడవదినసమావేశమునందు నడియానగరప్రతినిధురాలు శ్రీమతి ప్రతిమాదేవి '(1) బాల్యవివాహదురాచారనిర్మూలనమునకు శారదాచట్టమును వెంటనే అమలులోపెట్టవలయును. (2) బహుభార్యాస్వీకరణవిధానము శాసనఖడ్గముచే తుండింపవలయును. (3) వితంతువివాహములు ప్రోత్సహింపబడవలయును. (4) వరశుల్కము, ఘోషామొదలగు దురాచారభంజనమునకు ప్రజాప్రబోధము గావింపవలయును. (5) అవసరమగుచో మగనికి విడాకునిచ్చుహక్కు హిందూస్త్రీలకు ప్రసాదింపబడవలయును. (6) సంఘనీతి నతిక్రమించు స్త్రీపురుషులకు సమానశిక్షవిధింపవలయును.' అను క్లాజులుగల తీర్మానమును ప్రతిపాదించెను. విడాకులహక్కు వలయునను క్లాజు తొలగింపవలయునని శ్రీమతి అనురూపాదేవి ఈ తీర్మానమునకు సవరణగొనివచ్చెను. శ్రీమతులు తారాదేవి, చారుసుశీలాదేవిగార్లు ఈమెకు బాసటయైనిలచిరి. పూర్వాచారప్రియులకు నవీనాచారప్రియులకు పోరాటఘటిల్లెను. తుదకు శ్రీమతి అనురూపాదేవి సవరణకే పలువురు తమసమ్మతులనొసగిరి.

రామమోహనుడు, కేశవచంద్రసేనుడు, విద్యాసాగరుడు మొదలగు మహాసంఘసంస్కర్తలను భారతదేశమునకు ప్రసాదించిన వంగరాష్ట్రమునకు చెందినస్త్రీలు— హూణవిద్యాప్రబోధముగల భారతస్త్రీలలో అగ్రగణ్యులగువారు—స్త్రీ శిశుహత్యానిరోధము, సహగమనదురాచారభంజనము, వి తం తు వి వా హా చా ర స్వీకరణముమొదలగు ఉత్తమసంస్కరణములకు జనిస్థానమగు కలకత్తానగరమున సమావేశమై విడాకుల తీర్మానమును త్రోసిపుచ్చిరి. పాశ్చాత్యముద్రవారిపై హిందూదేశమున మఱియేజాతిస్త్రీలపై కంటె నెక్కువగ పడియుండుటచేత విడాకులవిషయమై వంగనారీమణులు ఉత్సాహముచూపుదురని భావింపబడినది. కాని భావింపబడినట్లుజరుగలేదు. కూడనున్న ఆంధ్రమహిళాసభవారు ఈవిషయమై ఏమని తీర్మానింతురో?

# నాయకురాలు

శ్రీమతి మదమంచి అనంతమ్మగారు

దిద్దితీర్చినపేరు తీరుతీయముదెల్పు నాగులేటిప్రక్క నాపరాళ్లు
వాసించుకీర్తి వెల్వడినత్రోవలుసూపు కోరిందపొదచుట్టు కోటబురుజు
లళియరాజులవేగులాలించి నేటికి "సాహో"యనిధ్వనించు చంద్రవంక
తగరుదూకిన చట్టువగిలి బావురుగోల్పు గొంతిజలపసగు త్రికొండబెళము

రత్నభాండారముల వెల్తిరానినాడు
మొనసిముత్యాలకోవలమూల్గునాడు
వీరనాయకురాలితో వీఁగిపోయె
మచ్చుకైనను లేరీమెమాత్రమిపుడు.

రవిదిరుగలేనంతరాజ్యాన సత్కీర్తిఁగేలఁ గీలించినగేస్తురాలు
పలనాటిపసిఁడికోటల "గావు"లెత్తించి సారె భూపులకంపు ధీరురాలు
నాయనిప్రక్కలో నాగుబామైనాఁడు మంత్రిగానెగడిన మాన్యురాలు
కనులజేవురు నిప్పుకలురాల్చి కనుమలవలసబంపిన బలవంతురాలు

పేరువాడిన గుఱిజాలకోరులందుఁ
జంటిబిడ్డైన బ్రాల్దారివజంకుచుండు
నాయనా, * "బోరవరాం" బలనాటిబిడ్డ
గుండెగాలమనలఁగఁ దాదంకువిడిసి
తలఁచితాఁచలేదు దనుచేఁగఁదెచ్చుక
సొంతకార్యమటులఁ జొచ్చిచేయుఁ
గాని వీనివింతఁగనుచున్న వినుచున్న
అగ్నిఁబోరలినట్లు లనుచుఁగసలి.

పాట్నాగులాబిపావడక్రిందఁజెలువారు బిల్లాణినటునిటుఁ బెట్టుకొనుచు
జిలుఁగురత్నాలపోసీలు ముంజెయిమీఁద మాటికిముంగోట మఱలుపుకొనుచు
తొంగిముంగురులోలిదూగాడ మోముపై తిన్నఁగావ్రేలితో దిద్దికొనుచు
గిలుగుపావలఁ బాదతలముంచి వేమారు చివ్వునలేచియానీసయగుచు

చికిలిబాకును డాకేలఁజెరివికొనుచుఁ
గనుగొనలుజేవురింప దిగ్గనులేచి

*బోరవరామనగా వాడుపులి అకాలమునకీ బిడ్డలపేరుఁజెప్పి బెదరుఁబుట్టింతురు

అధరపుటములునల్లల నాడుచుండ
ఓరి! మోరోజీవంతు! నిన్నొగిఁదెమల్తు.

వీరాంగనల రక్తధారాళవృష్టిచే ప్లావితంబైన దీభాగ్యధాత్రి
పరమపావనపతివ్రతలచరిత్రచే విన్నాణమొందె నీవిపులధాత్రి
వ్రేలుచూపింపని విదుషీమణులచేత పొంగిపోయినది యీపుణ్యభూమి
లసదసూర్యంపశ్యలకు నాటపట్టౌచు సిరులుచిందినది యీభారతభూమి
చెఱఁగిపోలేదు మావారిచరితలందు
పచ్చిరక్తమ్ము విరజిమ్ముపసిఁడివ్రాలు
క్రూరుఁడా! నన్ను జేపట్టికూటమెల్ల
వ్రేలిపై ద్రిప్పఁజూచితే వేంగివరకు.

కాలరిపౌజులీకనుమ కాల్నడరేవులు దాటవచ్చు ను
త్తాలగభీరవారిభరితంబుగఁబారెడు చంద్రవంక నే
లీలఁదరింతువో తెలియలే దళియాధిపుదండుదిన్నఁగా
బాలునిజేరవచ్చునఁట పంతుమతేమిదలంచె ద్రోహివై.

నాయఁడు నాగులేటి వెలనాములఁగన్నమనీఁడు గొల్వఁదా
డాయుటలెన్న సేవలమొడాటముపై పఁగరానిదయ్యెఁ గ
ట్టాయితమై బొరింపోరి తమంతటఁదారొగి మూఁగలేరు నా
కాయము వెంపరెత్తె నలగాముఁడు మత్తిలినిద్రఁజెందెడిన్.

రాపిడివానికావలసరాజ్యములెల్లను గొల్లఁగొట్టు చీ
దోపిడిగాండ్రు మోకరిలితో మతివత్తుమటన్న వేఁగుమా
కాపులు రెడ్డివీరులును గమ్మజగామొనగాండ్రుచేరి యీ
మాపులువిన్నవించిరి సుమారిఁక నెంతటి పాళెమున్నదా?

మగవాఁడౌనఁటదాను పౌరుషగుణప్రాప్తంబుఁట ప్రాభవం
బిఁగనానెత్తురు జిమ్మలాచు నెగఁబ్రాకెన్నాళగోళంబులనే
బగరొక్కొమ్మడి మూఁగివచ్చిరని సంభావించిచింతించుటా
ప్పగునే ప్రాజ్ఞులు దైవమంచుఁ గలలోనైనన్వితర్కింతురే.

బల్లున తెల్లవారినది పయ్యెరలోలినటించుచున్నవీ
తెల్లని రేకలొక్కొకటి తియ్యనివేళలఁదమ్మిరేకుల
న్నిల్లుచునావులించినవి కిన్నరవ్రామోసెడుఁ గూఁతవేటులో
నల్లనవేగుగీతము లహార్నిశ లర్థముగాక వ్రేఁచెడిన్.

తురగము బిచ్చలింప రవదుమ్ముదుమారము మింటబర్వ నం
బరమున బాలచంద్రుఁడు ప్రభాతముమేరకు నాగులేటికా
దరి విడియంగలాఁడలేఁడు దట్టపుఁగో ల్పలఁజిమ్ములాడి చి
చ్చరపిడుగట్టు లార్చుటనిజం బిరువాగులునాశ మొందెడిన్.

ఇంతలోననలుత వింత వెన్నెలగాయు
సంకుపేరులోలి సర్దుకొనుచు
వీణలోనమేళవించి గీతించుచుఁ
గలికిమ్రోలనిల్చి కెలనఁజూచి
విప్పపూసూసకముముందు విసరివైచి
చారపప్పునుదోసిట జారవిడచి
కానిమరువకుమని బిగ్గఁగౌగిలించి
చెంగుచెంగునదాటు నాచెంచుమెలఁత
చెదిరినపూవులఁ బొదిగిచూచినది
విరులకత్తిరింపు వరుసఁజదివినది
ఔఁడుగఱచివెల్లనై ముందుమ్రొగ్గి
తలయూచిమంచిదే తప్పిపోయితివి
కానినాయకురాలి కనుమలోనిన్ను
పంగలరావిపై బారుటీకెలను
గ్రుమ్మిపోటుగంట్ల గ్రొన్నెత్తురొలుక
బలివెట్టుదును భూతపాళియత్రాడ
రణభేరిమ్రోగింప రంకుసైనికులు
కత్తళంబులజీరి గ్గై సేయుడిపుడె
తూరుపురేకలు దొరలకమున్నె
మాప్టీలగమిఁగూడి మన్నెభూములను
వెలినాములకుఁదూర్పు విడియఁగావలయు
పూజాడలనుబట్టి పోనున్నవారు
వేగులవారితో వెనుకవచ్చెదరు
పోయినమొగమునఁ బాలికలనులోన
అవలదారులముందు హతమార్చవలయు
నాదుకత్తిచాయ నడుచురాణువల
చేసంజ్ఞచేమొనల్ జీల్చినవుపుడిక
పగతురు వెన్నిచ్చు పట్టులందెల్ల
పంపులచే లగ్గపట్టగావలయు
కంఠకీకసములు గాలించినఱకి
జొబ్బిల్లునెత్తురుఁ జూరాడవలయు
బ్రహ్మనాయని నాళవంక్తిఁ జెండాడి
కత్తినాగులేటఁ గడిగితీరెదను
జయలక్ష్మిమనవైపు సాగునందాక
రక్తధ్వజము విప్పరాదుమీరెవరు
చచ్చినమనకెల్ల స్వారాజ్యసుఖము
చాకనిల్వ స్వరాజ్యసౌఖ్యమ్ముగలుగు
శత్రులుగెల్వతత్సౌధాంగణముల
వాలవాయజములు వర్థిల్లుగాక
జయశాంకరీయంచు జయభేరిమ్రోగ
నాములుదాటి యానాయకురాలు
దాచెపల్లిపొంత దండువిడిసినది.
స్వర్ణయుగమునాఁటి స్వచ్ఛందజీవులు
బ్రతికిచెడ్డ మంచిప్రాభవమ్ము
దాచుకొన్నయట్టి మాచెర్లచెన్నుని
బాలుఁడపుడుమ్రొక్కి బయలుదేరె
కంటిచూపుమేరఁగనుపట్టుడేరాలు
ఇసుకఁజల్లినట్టులెసఁగుబంట్లు
శక్తిపూజావిధుల్ రక్తధ్వజంబులు
గాంచి పగఱసేనగా నెఱింగె
పరభుల నక్కలాతఱియందుఁగూసె
కావిరిపట్టవగలె నిండెదెసల
కొఱగాములెన్నియో విరివిగాఁదోఁచె
బాలునిచైతన్య పాథోధిగలగె

రణభేరిమ్రోసె బూరాబాహాటముగ
హెచ్చరింపఁబడియె నిరువాగులెల్ల
నాయకురాలి వెన్నాడెపాళెములు
బాలుఁడుతిగరుపైఁ బల్లటీఁగొట్టి
చట్టుపెదూకించె జలపైకినుబ్బ
మూరై నయరచట్ట ముప్పలడాలు
ఎగుభుజంబులనుండి దిగువారుదోనలు
వంకజంబోరసిన వాలుజవ్వాడ
కాలరిపౌజులఁ గనుముఘట్టించి
నుగ్గునూచగఁదలల్నురుమాడినరికి
త్రుంచితూటాడుచు చించిచెండాడి
వీరవిహారము వింతగానలిపి
బాలుండుదెగటార్చు పాళెంబుదెసకు
రప్పురప్పునచుక్క రాలినభాతి
పాముగామై ముంగిపైఁబడ్డరీతి
తురగముతో వ్రాలి దోర్బలంబెసఁగ
బాలునిడీకొన బాళెంబులార్వ
సాయకత్తులఁ బోరునల్పెబాలుండు
రవ్వంతనాయకురాలు తగ్గమికి
ఆశ్చర్యచకితుఁడై యనినిల్చె విసిఁగి:
నాయకురాలంతనగి యిట్టులనియె:
"వెల్తిరాదోయి? మీవీరలోకముకు
రోసమా? మూతిపై మీసమా? మీకు,
పడఁతిచెల్లుబడిని పచరించునాట
నిలువమనసెటులాడె నెలమబాబులకు?
గాజులుగల్లన్నఁ గర్ణముల్ మూయు
మగవారికీతలెకే మగువతో రణమ,
పోరిలోవిసివి పొంపారిపోవువెలమ
తనతగవారిచేఁ దనువుందొలంగు
జన్నివిడిచిపోవ జననీజనకులు
తేరగాఁబెఱిగిన దిట్టవబ్బాయి,
నలగామునకు మీకుఁగలచుట్టఱికము
హాక్కుగలిగించనే యనికిరానేఁడు
సానివబ్బాయింటఁ జతురంగమాన
ఉగ్గుఁబాలుగాదు యుద్ధంబుగాని
మమ్మేమొచేయఁ బల్మారురోషించి
కారాలుమిర్యాలు గనునూరినూరి
కోడిపందెములోనఁ గోల్పోయిపరువు
పంటభూములు మంచిపరగణాల్విడిచి
వలసబోయినట్టి వారిబిడ్డఁడవు
కనుగూర్చనే నలగామభూభుజుఁడు
పొంగిపోనేల నీముష్టిభాగ్యమునకు?
అలచేతఁబండ్లొచ్చెనని గర్వమేల?
పాలకై పొదుగును బడఁగోఁతురయ్య,
పాల్పోసిపెంచిన పాముకై వడిగ
కాకికిబింబంబు గట్టించురీతి
ముగుదాఁడు దెంచిన పొగరుకెద్దువలె
కరుణించిమానలగామరాణ్మణియె
పూలమాలనిమెడ వ్యాళముధరించె
అడుది సింహాసనాసీనయైన
కనుగట్టెనే నిన్నుగన్నబాబునకు?
సర్వేశ్వరునిసృష్టిజాలంబులోన
స్వాతంత్ర్యమనునది సర్వులకొకటె
పశుపక్షులైనను బారతంత్ర్యాన
మధురజీవనాప్తి మనియుండఁగలవె?"
ఈలోననాయకురాలి పాళెములు
బాలునిసేనలు పలపలవిరిగ
చంద్రవంకదాటి సాహాయ్యమొనరింప
అల్లియరాజుసేన యూనకట్ట
నగముదాటి కట్టఁదెగఁగొట్టఁగానందు
లీనమయ్యె నెంతలేసిపనులు;
పంగలరావిపైఁ బంతుజీద్రెళ్లెను

చంద్రవంకకో బార్లసాగెనుబికి
కట్ట! సేనకంఠగత జీవనరబయి
కూయివెట్ట బ్రహ్మనాయఁడపుడు
పారుదలకునాల్గు పగ్గాలదూరాన
సాగె నామెపై స్యసాగరంబు
వీనిసందుఁదప్ప వీలులేదతనికి
బాలుఁజేరు వన్యమార్గమచట
తలియఁజొచ్చె పతియదరులుజీల్చుకొంచు
పల్కెనప్పుడామె పౌరుషమున
వైష్ణవంబు ముదరవచ్చినయ్యలుమీారు
పరువె నాయకురాలిపంగదూర
చురియఁదీసిన నెత్తురుచుక్కలేదు
చుట్టుప్రక్కలనిప్పులు సురియఁజూచి
చెన్నుఁడాయని వెన్కకుఁజేరఁబడియె
మొనలబాలుఁడు నీమెళ్లో మోహరించె
ఒంటికంబమునందు నొరఁగిప్రార్థించి
నాగులేటియందుఁ బ్రేపులుగడిగి
రుధిరాంత్రకీకసమధుగంధములను
చెల్లింతుననిశకిఁ జెన్నునిదలఁచి
నాయకురాలిమన్నారు పైనురికె
ఫుల్లశైవాలకుసుమవిభూషయగుచు
పవనసంచలదళికేశపాశయగుచు
జలవిహంగరటత్పదజ్ఞాతయగుచు
చంద్రవంక సువాళించి చలనమాపె.

కాలమా! మాదునాయకురాలివంటి
బిడ్డ నేదేశమందైన బెంచినావె?
భరతఖండమ్ము జేసిన భాగ్యమేమి
కన్న దిటువంటివారి లెక్కకును మించ.

# పడవపాట

పెన్మరాజు రాజగోపాలముగారు బి.ఏ. (సారస్వతసమాజము)

౧

ఈలోకమునువీడి
ఆలోకమున కేగి
ఆనందభువనాల స్వప్నాలసౌధాలకై
ఈనెలవంక నావలో
నీలాల జలదాల గగనాలజలధిలో
హాయిగా తేలిపోదమా? ఓసఖి!

౨

ఈవెన్నెలలకాంతిలో
అశ్రువులమాలతో
జీవనపుభారాలు
భావయుతగీతాల
ఆశామహితరాగాల
నాలాపనముసల్పి
హాయిగా తేలిపోదమా? ఓసఖి!

౩

ఏవిషాదము వచ్చిపడునో
ఎట్టికంటక మెడదనాటునో
ఈమధురక్షణికము లిట్టెచనునో
యౌవనాశాహృదయమ్మేగతిమారునో
తరుణకుసుమము విరియపూచిన
యీశుభోదయకాలమందునె
వ్యోమతలమున జ్యోత్స్నలోనే
హాయిగా తేలిపోదమా? ఓసఖి!

# గొప్పనక్షత్రము

శ్రీమతి కంకిపాటి రుక్మిణమ్మగారు

౧

చుక్కయొక్కటి పొడిచెఁదూర్పున
మిక్కుటంబగుకాంతి మెఱయుచు
తక్కుచుక్కలుగాంచి సిగ్గునఁ
దెల్లఁబోవుచుఁ జూడఁగా.

౨

చుక్కపొడిచెను నింగియెల్లను
పట్టపగలటు కాంతివెలసెను
మట్టమధ్యాహ్నంపు సూర్యుని
మాడ్కిఁజెలువొందెన్.

౩

నీలికాంతుల నింగివీథిని
మేలిబంగరుచుక్క వెలిగెను
మిన్నుకన్నియ మోమునందున
మెఱయు కుంకుమబొట్టుగన్.

౪

కోటిసూర్యుల కాంతిమెఱయుచు
మేటిచుక్కయు మెఱయునింగిని
ఒడలెఱుఁగని గాఢనిద్రను
మెఱసెలోకంబున్.

౫

చూడరై రా చుక్కసొంపును
చూడరై రా శోభయెల్లను
అడవిఁగాసిన వెన్నెలట్టుల
అమరెఁదత్కాంతుల్.

౬

అరుణకాంతులు ఆకసంబున
అల్లుకొనియెడు సంతమున్నె
మెఱుపుపోలెను మెఱయుచుక్కయు
రాలిపడెనింగిన్.

౭

చుక్కరాలెను; కాంతులెల్లను
ఒక్కపెట్టున మాయమయ్యెను
చొక్కిలోకంబెల్ల నయ్యెడ
సుస్తి నిదురించెన్.

౮

ప్రొద్దుపొడిచెను; తెల్లవారెను
మేలుకొలుపులు కోడికూసెను
కలకలంబుల బులుగుమూకలు
తెలిపె రాతిరివృత్తమున్.

౯

చూచియున్న యదృష్టవంతులు
చుక్కసొంపును శోభపెంపును
వేయినోళులమెచ్చుచుండఁగ
వినిజనము లెల్లన్.

౧౦

తెల్లఁబోయిరి యొకరినెమ్మొగ
మొకరుచూచు కొనంగడంగిరి
చుక్కశోభను జూడఁజాలమి
దుఃఖపడిరంతన్.

౧౧

ఎక్కడై తెఁ చుక్క వెలిఁగెనొ
అక్కడొక్కటి కాంతివెలసెను
అబ్బులెత్తిజనంబులెల్లను
అద్భుతంబున జూడగన్.

౧౨

నిండుఆమని యిచటలేదని
నీరసంబునరోసి చెవులకుఁ
బంపువొనరుచుచున్న కోయిల
పాఱిపోయెనుగా.

# పూలసజ్జ

కాశూరి వేంకటరామారావుగారు

## తొలిపుష్పము: తోటమాలి జగ్గయ్య

జగ్గయ్య చిన్నతనములోనే ధర్మవరదుర్గమున తోటమాలిగా ప్రవేశించినాడు. వ్యవహారసందర్భముల యందు ముక్కుసూటిగా పోవు స్వభావముగల మనిషి. అతనిసుగుణపుంజములును, స్వామిభక్తియును, అన్నిటికంటె మిన్నగ నతని నిత్యప్రసన్నవదనమును అతడు సేవించుచున్న జమీందారులదృష్టి నాకర్షించినవి. రాజకుటుంబములోనివారందరికిని జగ్గయ్య ప్రాణసమానుడు. విద్యాభ్యాసమును ముగించి, అనుభవము కొరకు ధర్మవరజమీందారు విదేశయాత్ర సలిపినప్పుడు జగ్గయ్యనుగూడ తనపరివారములో నొకనిగా నిర్ణయించినాడు. విదేశయాత్రావసరమున జగ్గయ్యప్రవర్తన ప్రభువునకు పూర్ణసంతృప్తిని కలిగించినది. "జగ్గయ్య స్వామిభక్తికిని, సేవాపరాయణతకును తగినరీతిని బహూకరించుటయెట్లు"ను ఆలోచన జమీందారునకు కలిగినది. ధర్మవరదుర్గమున కనతిదూరముననే జమీందారునకొక గొప్పతోటయుండెను. అందొక విశాలమగు దివ్యభవనమున్నది. తోటలో నివసించి యచ్చటి హర్మ్యమును జాగ్రతగచూచుబాధ్యత జగ్గయ్య కప్పగించబడినది. జనసంకీర్ణములగు నగరములయెడ విముఖుడైన జగ్గయ్య సరిగా అట్టిప్రశాంతప్రదేశమునే కోరియుండెను. ఏవిధమగు శిస్తునుగాని చెల్లించనవసరములేకుండ నాతోటస్థలమంతటిని జగ్గయ్య జీవితకాలమంతయును అనుభవించుటకు ఉదారహృదయుడగు జమీందారు నిర్ణయించెను. అతని కుటుంబమునకు సరిపడుధాన్యమును దయచేయుటకుగూడ ప్రభువు వాగ్దానమొనర్చెను.

జగ్గయ్య అల్పసంతోషి. తనఆస్తిని చూచుకొని కనకాభిషేకమును పొందినట్టుగా సంతసించినాడు. ధర్మవరకాపురస్థుడగు నొకసంపన్నకాపుగృహస్థుని కుమార్తెను వివాహముచేసుకున్నాడు. ఐహికసౌఖ్యములకు సంబంధించినంతవరకును అతనికేలోపమును లేకుండచేసుకున్నాడు. జగ్గయ్య జీవితమిప్పుడు శాంతియుతముగ గడచిపోవుచున్నది. సూర్యోదయాత్పూర్వము లేచి చీకటిపడువరకును అతడు కష్టపడి పనిచేసుకొనుచుండెను. తోటలోసగమువంతుభూమిలో మాత్రమే ఫలవృక్షములుండెను. మిగిలిన సగభాగమును కాయకూరలకొరకు విడిచిపెట్టబడినది. సుగుణవతియును, అనుకూలవతియును అగుభార్యతో జగ్గయ్య చిరకాలము సుఖజీవితమును గడిపినాడు. ఇంతలో మృత్యుదేవత ఆమెను కబళించివేసినది. సహచారిణిని గోలుపోయి జగ్గయ్య దుఃఖసముద్రమున క్రుంగిపోయెను. వృద్ధాప్యమును, పత్నీవియోగమును ఒక్కసారిగానే దాపరించుటచేత జగ్గయ్య మరింతలొంగిపోయినాడు. కలిగినసంతాన మందరికిని ఒక్కకుమార్తెమాత్రమతనికి మిగిలినది. తల్లిచనిపోవుసరి కామెకైదుసంవత్సరములవయస్సు కలదు. తల్లిపేరు కలిసివచ్చేటట్లామెకు "సూర్యకాంతం!" అని జగ్గయ్య నామకరణముచేసినాడు. కాని "కాంతం" అనియు, "కాంతమ్మ" అనియు నతడు మామూలుగా పిలుచుచుండెను. కాంతమ్మ మూడుమూర్తులను తల్లిపోలిక. చిన్నపిల్లప్పుడే కాంతమ్మ చూడతగిన అందముగలిగియుండెను. క్రమముగా సంవత్సరములు పైబడినకొద్ది దైవభక్తియు, అమాయకత్వమును, దయార్ద్రహృదయమును ఆమెసౌందర్యమునకు వింతవన్నె సమకూర్చినవి. పదునైదుయేండ్లయినను నిండకపూర్వమే కాంతమ్మ గృహకృత్యములను సర్దుకొనుట ప్రారంభించినది. జగ్గయ్యయిల్లు పరిశుభ్రతకునిలయమై, చుట్టుప్రక్కల గృహములన్నిటికంటె చూడతగి ఉండెడిది. ఇంటిపనులలో మాత్రమేకాక ఆమెతరుచుగా తోటపనిలోగూడ తండ్రికి సహాయపడుచుండెడిది. ఈరీతిగా జనకునితో గడిపినగడియలే ఆమె జీవితమున సౌఖ్యతమమైనవిగానుండెడివి. జ్ఞానవివేకములచేత జగ్గయ్యమనస్సు పరిణతినిపొందినది. అందుచేత అతని సంభావణ

లాకర్షణీయములై, జ్ఞానదాయకములై పనియందలి భారమును తోచనీయకుండెను. తోటలోని పూలమధ్యనే కాంతమ్మ పెరిగినదని చెప్పవచ్చును. పూలతోట వేసుకొనుటకు తోటలో కొంతభూమిని కుమార్తెకు జగ్గయ్య ప్రత్యేకముగా యిచ్చివేసినాడు. ప్రతిసంవత్సరమును క్రొత్తక్రొత్తరకముల పూలచెట్లను ఆమెకొరకు తెచ్చి పెట్టెడివాడు. వాటిని వాటి బహుప్రేమతో ఆమె పెంచుకొనుచుండెడిది. తీరుబాటుగానున్న ప్రతి నిముషమును ఆమె తోటలోనే గడుపుచుండెను. ఆమెకు తోటపనియే అన్నిటికంటెను ఎక్కువ అహ్లాదకరముగా తోచినది.

పుష్పములయందు కుమార్తెకుగల గాఢానురాగమునకు జగ్గయ్య మిక్కిలి సంతసించినాడు. ఆ ఉత్సాహమును సమున్నతాదర్శములవంకకు మరల్చుటయెట్లో అతనికి తెలుసు. కుసుమముల ప్రవిమలసౌందర్యమునందును, సహజాకర్షణశక్తియందును సర్వేశ్వరుని సౌజన్యతను, ధీవిలాసమును గమనించవలెనని అతడామెకు బోధించుచుండెను. కరుణామయుడగు సర్వేశ్వరుని ధ్యానించుటకు దినమంతటిలోను అర్ధఘంట, యొకపావుగంటయైనను వినియోగించలేనిజీవనము నిరర్థకమని అతనితలంపు. ప్రేమపూరితహృదయుడును, జ్ఞానియునైన జనకుని సంరక్షణలో, మనోహరపుష్పసమూహములమధ్య కాంతమ్మ దినదినప్రవర్థమానయగుచుండెను. విరియబూచిన వృక్షమునందువలె ఆమెయందభివృద్ధిసూచనలు కనిపించుచుండెను.

## రెండవ పుష్పము : జన్మదినోత్సవము

జగ్గయ్యయింటికి సమీపముననే ఒకచిన్నఅడవియుండెను. ఒకనాటిఉదయము కాంతం ఆఅడివిలోనికి పోయినది. తోటలోపనిలేని తీరికసమయములందు జగ్గయ్య అడవితీగలతో పూలసజ్జలనల్లుచుండును. తండ్రికొరకు తీగలనుకోసితెచ్చుటకై ఆమె అప్పుడప్పుడు అడివిలోనికివెళ్లుమామూలుకలదు. పోయిపోయి కాంతం ఒకలోయలోనికివెళ్లినది. ఆలోయ అనేకరకముల అడవిపువ్వులతోనిండి మనోహరమైయుండెను. చిన్నచిన్నకొండవాగులులెక్కలేనన్ని వానికిదోహదమొసంగుచుండెను. ఆపువ్వులనుచూచి ఉత్సాహపూరితురాలైనది కాంతం. ఇన్నిపువ్వులుకోసి తనకొకటియును, తండ్రికొకటియును రెండుదండలు తయారుచేసినది. అడివిలోపనిపూర్తిచేసుకుని ఆమె యింటిదారిపట్టినది. జమీందారులకోట వెనుకభాగమునుసమీపించుసరికి జమీందారిణియును ఆమెకుమార్తెయును అచ్చటి ఉద్యానవనవిహారమొనర్చుచు నామెకుకనబడిరి. శ్రీమంతులగువారలను చూచినవెంటనే కాంతం వినయపూర్వకముగ నమస్కరించినిలుచుండెను. ఆమెచేతులోనున్న పూలదండలను వారిద్దరునుచూచిరి. “ఎంతఅందంగావున్నాయి పువ్వులు! ఇవన్నీఅడివిలోనివేనా?” అని జమీందారుగారికుమార్తె అడిగింది. తక్షణమేనమ్రతతో కాంతం వారిద్దరికిని చెరియొకదండను సమర్పించినది. వారాదండలను సంతోషపూర్వకముగనందుకొనిరి. బంగారుజరీపట్టుసంచినుండి కొంతధనమునుతీసి జమీందారిణి కాంతమ్మ కియ్యబోయినది.

“అమ్మా! ఆపువ్వులకోసం నేను తమవద్దడబ్బుపుచ్చుకోనా? ఎంతమాట! తమవల్ల అనేకమహోపకారాలనుపొందిన జగ్గయ్యకుమార్తెను నేను. తమ ఉప్పుతిన్నందుకీదండలను ఏప్రతిఫలమూకోరకుండానే తమకుసమర్పించడానికి ఈపేదపిల్లకవకాశమియ్యవలెనని ప్రార్థిస్తున్నాను” అని కాంతం వినయముట్టిపడునట్లుగా చెప్పినది.

ఆమె సౌజన్యతకుజమీందారిణి సంతోషితురాలైనది. సస్నేహముగా నామె “అలాగా! జగ్గయ్యకూతురవా నువ్వు? నీకుతీరుబాటుసమయాల్లో యిలాంటిదండలుకట్టి అప్పుడప్పుడు తీసుకొస్తావుండు. మా అమ్మాయికియిలాంటివంటే చాలాసరదా” అన్నది.

కాంతం అంగీకారమును సూచించినది. అదిమొదలామె తరుచుగాపూలదండలుకట్టి కోటలోనికితీసుకొనివెళ్లుచుండెను. ఆకారణమున జమీందారువారి కుమార్తెయగు "అమలాంబ"తో కాంతమ్మకు బాగాపరిచయముకలిగినది. అమలాంబముద్దుపేరే "అమ్మాజీ". అమ్మాజీకి కాంతంపైనిగలప్రేమ దినదినాభివృద్ధినిపొందినది. ఆడంబరరహితమగు నామె నడవడికనుచూచి అమ్మాజీమెచ్చుకున్నది. తరుచుగా కోటలోనికితనవద్దకు వచ్చుచుండవలెనని ఆమె కాంతమ్మనుకోరినది. ఇంతలో అమ్మాజీ జన్మదినోత్సవముసమీపించినది. ఆసందర్భమున ఆమెకేదైనను కానుకగాతీసుకొనివెళ్లుట భావ్యమని కాంతమ్మనిశ్చయించుకున్నది.

పూలసజ్జలల్లుటయందు జగ్గయ్యబోలు నేర్పరిలేడని చెప్పవచ్చును. కుమార్తెకోసమని అతడు తనపనితనమంతయు వినియోగించి ఒకచక్కనిసజ్జనుఅల్లెను. తోటలోని ప్రశస్తములైనపువ్వులతో నాసజ్జనునింపి దానిని జన్మదినోత్సవసమయమున బహుమానముగా అమ్మాజీకియియ్యవలెనని కాంతం అభిప్రాయము. కుమార్తె ఆలోచనకు జగ్గయ్యసమ్మతించినాడు. ఇంకొకగంట తీరుబడిచేసుకుని సజ్జకువన్నెచిన్నెల నేర్పరించిరెట్టింపు అందముతోకనబడునట్లుచేసినాడు. ఎర్రరంగుతీగలతో సజ్జపైని "అమ్మాజీ" నామాక్షరములను గూడ అల్లినాడు. జన్మదినమాసన్నమైనది. ఉదయముననేలేచి తోటఅంతటనువెతికి అన్నిజాతులపుష్పములను ఏంచి ఏంచి కాంతం కోసుకొనివచ్చినది. రంగురంగుల ఆకులుకలరెమ్మలనుగూడ విరుచుకున్నది. అపరిమితకళాకౌశలముతో నామె పూవులను రెమ్మలను సజ్జలోనమర్చినది. సజ్జచుట్టును పసుపుపచ్చని చేమంతిపూలదండనుచుట్టినది. "అమలాదేవి" అనుపేరు గులాబీలతో అల్లబడినలతలమధ్య స్పష్టముగకనబడుచుండెను. కుమార్తెకళాకౌశల్యమునకు జగ్గయ్య ఆశ్చర్యభరితుడైనాడు. మందహాసముతో "కాంతం! ఒక్కనిముషం ఆసజ్జని అలాగే వుంచు. మరికొంచెంసేపు చూడాలనివుంది. ఎంతచూసినా తనివితీరడంలేదు"అని సంతృప్తిని వెల్లడించినాడు.

తరవాత సజ్జనుపట్టుకుని కాంతం కోటలోనికిపోయినది. హృదయపూర్వకాభినందములతో సజ్జను అమ్మాజీకి సమర్పించినది. ఆసమయమున అమ్మాజీ ముస్తాబు అగుచుండెను. దాసియగుపున్న ఆమెకుజడవేయుచుండెను. అపరిమితానందముతో అమ్మాజీ బహుమానమును గ్రహించినది. ఆమనోహరకళాకౌశల్యమును శ్లాఘించుటకామెకు భాషాసామర్థ్యముచాలకపోయినది. ఆమెయిట్లన్నది: "కాంతం! నామీదనీకెంత ప్రేమ? నాకీయమూల్యబహుమానమును చెయ్యడానికి తోటలోని మంచిపూవులన్నీకోసేశావనుకొంటాను. ఈసజ్జయెంతఅందంగావుంది! ఇలాటిది నేనిదివరకెన్నడూచూడలేదుసుమా! దా! మాఅమ్మకి చూపిద్దాం."

సస్నేహముగా కాంతమ్మచేయిపట్టుకుని అమ్మాజీమేడమీదికి తీసుకొనివెళ్లినది. తల్లిగదిలోనికివెళ్లినవెమ్మట "అమ్మా! కాంతం నాకోసమెంతచక్కని బహుమతితెచ్చిందోచూడు. ఈసజ్జలాటిదాన్నినువ్వెన్నడైనా చూశావా? పువ్వులెంత అందంగాఉన్నాయో!" అన్నాది.

సజ్జనుచూచి జమీందారిణిగూడ సంతసించినది. "కాంతం! యిప్పుడేకోసిన యీపువ్వులెంతసొగసుగావున్నాయి! ఈపువ్వులఅమరిక నీకళాభిరుచిని వేనోళ్ల చాటుతున్నాయి. అన్నిటికంటే ఎక్కువగా ఈబహుమానము నీసౌహార్దమును తెలుపుతుంది. కాంతం! ఒక్కనిముషమీగదిలోనేఆగు. యిప్పుడేవస్తాను." అనిచెప్పి ఆమె అమ్మాజీని తనతోప్రక్కగదిలోనికిరమ్మని సౌజ్ఞచేసినది. వేరొకగదిలోనికి పోయినతరువాత జమీందారిణి కుమార్తెనుచూచి "అమ్మాజీ! తగినప్రతిఫలంలేకుండా మనం కాంతాన్నిపంపకూడదు. మనమేమిస్తేబాగుంటుందని నీఅభిప్రాయం?" అనిఅడిగినది.

అమ్మాజీ ఒక్కనిముషమాలోచించి "నాచీరలలోది ఒక్కటిస్తేబాగుంటుందనుకుంటాను. మనంవెనుక కొన్న జరీపువ్వుల సిల్కుచీరయిమ్మంటావా? నేనుదాన్ని ఒకటిరెండుసార్లుమాత్రంకట్టుకున్నాను. ఇంకా కొత్తరంగుమాయనేలేదు. ఆచీర కాంతం వొంటిమీదబాగుంటుంది. నీకిష్టమైతేసరి. యిచ్చేస్తాను."అన్నది.

"సరే! అలాగే చెయ్యి. ఏవస్తువు చీరవాళ్ల కిచ్చినా ఉపయోగకరమైనదే యివ్వాలి. నువ్వు చెప్పిన చీర యిచ్చేయ్యి. బాగా నేవుంది."

వారిద్దరూ తిరిగీ కాంతం నిలుచున్న గదిలో ప్రవేశించినారు. అప్పుడు జమీందారిణి "అమ్మాజీ! ఇక వెళ్లండి. పువ్వులు బహుభద్రమునుమండీ. వాడిపోతాయి జాగ్రత్త! దాన్ని హాలులో మేజామీద పెట్టించు. అతిథులంతా చూసి ఆనందిస్తారు. కాంతం! నువ్వు అమ్మాజీతో కూడా వెళ్లు" అన్నది.

అమ్మాజీ కాంతమ్మను తనగదిలోనికి తీసుకొనిపోయి దాసినిపిలిచి చీరను తెమ్మని చెప్పినది. పున్న ఆమె వేపు నిలకడగా చూచుచు నిలబడి "ఇప్పుడ దెందుకమ్మా! మీరా చీర కట్టుకుంటారేమిటి యీ వేళ?" అని అడిగినది.

"అగోడవంతా నీ కెందుకు? తీసుకురా! దాన్ని కాంతానికి బహుమానం చెయ్యదలచుకున్నాను."

"ఆ—! ఆ చీరే యిచ్చేయడం? అమ్మగారెరుగుదురా యీ సంగతి?"

"అదంతా నీ కెందుకూ? ముందు తీసుకురా! ఏం? వెళ్లవేం?"

పున్న ముఖంచిట్లించుకుని వెళ్లిపోయినది. పెద్దచప్పుడుతో బీరువా తలుపులాగి చీరను దీసినది. కోపము చేత ఆమె శరీరము మండుకొనిపోవుచుండెను. "న్యాయరీత్యా యీ చీర నాకు రావలసినది. నా ప్రాణానికి యిదెక్కడదాపరించినది? దీనిగుడ్లుతీసెయ్యా! ముందొచ్చిన చెవులకంటె వెనకొచ్చిన కొమ్ములకు వాడియెక్కువట! కానీ! చూద్దాం. దీనిపనిపట్టేస్తాను. సమయం రాకపోతుందా?" అని యీర్ష్యాపరవశురాలగు పున్న అనుకున్నాది.

లేనినవ్వు తెచ్చుకుని పున్న చీరతో కూడా గదిలో ప్రవేశించినది. అమ్మాజీ చీరను పట్టుకొని "కాంతం! ఈరోజున ఎన్నో బహుమతులొచ్చేయి. కాని నీ విచ్చిన సజ్జ కలిగించిన ఆనందము యింకొకటి కలిగించలేకపోయినది. ఈ చీరమీదనున్న బంగారుజరీ పువ్వులు కూడా నీ సజ్జలో పువ్వులంత అందంగా లేవు. అయినా నాయందుగల ప్రేమచేత ఈ చీరను నీవు అంగీకరిస్తావనే నమ్ముతాను. నువ్వు దీన్ని కట్టుకోగా చూడాలనివుంది. నా క్షేమపూర్వకాభినందనములను జగ్గయ్యకి తెలియపరుచు" అని అమ్మాజీ చీరనూ వేరొకరవికనూ కాంతమ్మకిచ్చివేసినది.

కాంతం వానినందుకుని అమ్మాజీ హస్తాన్ని ముద్దుపెట్టుకుని నిండారు సంతసముతో నింటికిపోయినది.

పున్నకు అసూయాదుఃఖములు రెండును పొర్లిపోయినవి. ఎంత ప్రయత్నించినను ఆమె కోపమును అణుచుకొనలేకపోయినది.

"ఏం పున్నా? అంత కోపంగా వున్నావీ వేళ?" అని అమ్మాజీ అడిగినది.

"అమ్మా! తమరు ధర్మకార్యాలు చేసేటప్పుడు నాకు కోపం యెందుకూ?"

"బాగా చెప్పేవు. నీకలాటి భావాలు వుండడం మంచిదని నా అభిప్రాయం".

అమ్మాజీ జన్మదినోత్సవ సందర్భమున కోటలో గొప్పవిందు జరిగినది. బంధుమిత్ర సామంతులందరును ఆహ్వానింపబడిరి. బ్రహ్మాండమైన ప్రయత్నములు జరిగినవి. అతిథులందరును వచ్చి అక్కడి వినోదములలో పాల్గొనుచుండిరి.

జనకునితో తన అదృష్టమును గురించి చెప్పడానికి కాంతం తొందరగా తోటలోనికి వచ్చినది. కాని దూరదృష్టిగల జగ్గయ్య అంత విలువగల బహుమానము చూసి ఆనందించు పద్ధతిలో మనిషి కాడు. నెరిసిన తలను పంకించుచు అతడు కుమార్తెతో "కాంతం! బాగా ఆలోచించగా నువ్వా సజ్జను కోటలోనికి తీసుకెళ్లడమే నా మట్టుకు సమ్మతం కాలేదు. కాని యిప్పుడేం చెయ్యగలం? మించిపోయిన దానికి విచారమెందుకూ? ప్రభు

వులు మనకీబహుమతిని దయచెయ్యడం మనంధన్యులమే. కాని యిందుమూలాన్ని మనపైనియితరులు అకారణంగా అసూయాగ్రస్తులపడానికి అవకాశము కలుగుతుందేమోనని నాభయం. నీహృదయంలో గర్వానికి తావుదొరుకుతుందేమోనని మరింతభీతిల్లుతున్నాను. అమ్మా! ఏదియెలాగున్నా గర్వానికిమాత్రం నీలో తావియ్యకూడదు. సత్ప్రవర్తనమే స్త్రీలకాభరణము. చీనిచీనాంబరములును, రత్నభూషణములును సత్ప్రవర్తనముందు కానుకుకొరగావు. ప్రశాంతజీవనమునకదియే ఆధారము. సర్వేశ్వరునిదృష్టియందు దానికేవిలువ అధికము" అని ముచ్చటించినాడు.

## మూడవపుష్పము : ఉంగరము

కాంతం చీరకట్టుకునిచూచినది. వెంటనే మరలవిప్పివేసి జాగ్రత్తగామడతపెట్టి పెట్టెలోపెట్టినది. అంతలోనే అమ్మాజీ అతిఆయాసముతో వగర్చుకొనుచుపరుగెత్తుకుని అక్కడకువచ్చినది. ఆమెముఖము వెలవెలబోవుచు భయమును సూచించుచుండెను. ఆమె ఆపాదమస్తకమును ప్రకంపితయైపోవుచుండెను.

జమీందారునిముద్దుబిడ్డ అంతహడావుడిగా వచ్చుటకు కారణమును కాంతమ్మ ఊహించలేకపోయినది. ఇంకాకాంతం మాట్లాడకముందే ఆత్రముతో అమ్మాజీయిట్లనెను: "కాంతం! ఎంతపనిచేశావు! మా అమ్మవజ్రపుటుంగరం కనబడలేదు. ఆసమయాన్ని అమ్మగదిలో నీవుగాకవేరొకరులేరు. అయ్యో! నాచేతికి వెంటనే యిచ్చెయ్యి. లేకపోతే గొప్పప్రమాదంరావడానికి సిద్ధంగావున్నది. వుంగరం నాచేతికిచ్చెయ్యి. ఏంఫరవావుండదు".

ఈమాటలువినుసరికి కాంతం నిలువునునీరువిడిచిపోయినది. ఆమెమాటలయందు వణుకుపుట్టినది. "అమ్మా! ఇదేమిటో నాకుబోధపడలేదు. నేనేవుంగరమూయెరగను. నేనుగదిలో వుంగరాన్నిచూడనైనా చూడలేదు. నిలబడ్డచోటునుంచి ఒక్కఅడుగైనముకదల్లేదు." అని చెప్పినది.

కాని అమ్మాజీకి ఆమాటలుచెవికెక్కలేదు. ఆమె మరలచెప్పుటకు ప్రారంభించినది. "కాంతం! నేను నీకోసమనేయింత నొక్కినొక్కిచెబుతున్నాను. ఆవుంగరం యెంతవిలువకలదో నీకుతెలియదు. అధమపక్షం పదివేలరూపాయలకు తక్కువవుండదు. నీకాసంగతితెలుస్తేఅల్లాతీసివుండవని నాఅభిప్రాయం. ఏదో తక్కువఖరీదుకలవస్తువకదా అని తీసివుంటావు. తక్షణం దాన్నినాకిచ్చివేయమని మరీమరీకోరుతున్నాను. నీకేబాధారాకుండా చూసేపూచీనాది. అందుకేగదా నేనుస్వయంగా పరుగెత్తుకొచ్చాను!".

కాంతమ్మకి దుఃఖముఆగలేదు. "అయ్యో! నాకు ఆవుంగరం సంగతియేమీ తెలియదు. ఇతరులవస్తువు నెన్నడూముట్టుకునైనాయెరగను. దొంగిలించి అసలేయెరగను. అల్లాంటినీచపుపని చెయ్యడానికి నామనసెన్నడూ వొప్పుకోలేదు." అన్నది.

ఆసమయమున జగ్గయ్య లోపలప్రవేశించినాడు. అమ్మాజీ తొందరగా లోపలకుప్రవేశించునపుడు అతడు తోటపనిచేసుకొనుచుండెను. కారణమేదియోకనుగొనవలెనని అతడు లోపలకువచ్చినాడు. కాని సంగతంతా తెలిసినతరువాత నిలబడలేకపోయినాడు. అతనితల గిర్రున తిరిగిపోయినది. మెల్లగ గోడనుబట్టుకొని నేలను కూలబడిపోయినాడు. ఇంచుక శక్తితెచ్చుకొని జగ్గయ్య యిట్లుపలికెను. "అమ్మా! కాంతం! ఇంతవిలువగలవస్తువను దొంగిలించినందు కీరోజుల్లో బహుకఠినశిక్ష విధిస్తారు. అయినా వ్యవహారం యింకా మనచెయ్యిదాటిపోలేదు. ఈపనివల్ల ఒక్కనరులకేగాక సర్వసాక్షియగు భగవంతునికికూడా జవాబు చెప్పవలసినదానవవుతావు."

—మిగిలియున్నది.

## ఆడుబిడ్డలు

"ఒక సోదరి"

గతవత్సరపు గృహలక్ష్మి దసరాసంచికయందు ఆడుబిడ్డలు అనుపేరుగల ఒకవ్యాసమును శ్రీమతి మానినియను పేరుగల సోదరీమణి యొకరు వ్రాసిరి. ఆవ్యాసము చదివిన పిమ్మట నాకొకసంశయముగల్గి, దానిపై కించిత్ జ్ఞానినగు నేనును ఒకవ్యాసమును వ్రాయ గడంగితి. లోకమున్న ఆడుబిడ్డలును, అత్తగార్లును చాల చెడ్డవారనియు, వారు కోడండ్రను చాలకష్టములపాల్సేయుచుందురనియు శ్రీ మానినిగారు వ్రాసిరి. ఆమాట నిజమే. ఆడుబిడ్డలు అన్నదమ్ములభార్యలను పెట్టెడిబాధలకు పరిమితియుండదు. కొన్నిస్థలములలో ఈబాధలు పడలేక ఆఅనాథయువతులు బలవన్మరణముపొందుటయు లోకమునగలదు. కాని ఈబాధలు లోకసహజమైనను, దీనికి వ్యతిరేకముగ ఈవిశాలప్రపంచమున అనేకవిధములగు బాధలు అత్తగార్లకును, ఆడుబిడ్డలకును గల్గుచున్నవి. గృహమునకు నిన్నగాక మొన్న కాపురమునకువచ్చిన కోడండ్రుకొందరు అత్తలను, ఆడుబిడ్డలను పెట్టుబాధలు వర్ణనాతీతములు. తనపుట్టినింట తనతలిదండ్రులు, తనఅన్నదమ్ములు, వదిన, మరదండ్రుమొదలగుబంధుజనము తనను ముద్దుగ అతిగారాబముగజూచి యాదరించి పరిచర్యసేయవలె. తనకు బిడ్డలున్నచో తన సోదరులబిడ్డలకన్న తనబిడ్డలే అధికులుగ పరిగణింపవలెనని తలతురు. తాము అపుట్టినింట చలాయించిన ఆడుబిడ్డతనమంతయు అత్తింటికిరాగనే మరచి అత్తగారును, ఆడుబిడ్డయును తనఆజ్ఞకు బద్ధులుగనుండవలెననియు, తానే గృహయజమానియనియుతలంచి ఆవిధముగ ప్రవర్తించెడికోడండ్రును లోకమున చాలస్థలములలోగలరు. వత్సరమునకొకసారిపుట్టినింటికివచ్చిన ఆడుబిడ్డను, దానిబిడ్డలనుచూచిన ఓర్వలేక దుఃఖించుట, తనభర్త వానిచెల్లెలినిగాని, చెల్లెలిబిడ్డలనుగాని ఆదరించిమాటాడిన మండిపడుట, వారికొక పసపుకొమ్ముగాని ఇచ్చినచో తనముల్లెపోయినట్లేడ్చి చిచ్చుపెట్టి భర్తను సాధించుట. ఇవియే ఆఅన్నదమ్ముల భార్యలు ఆడుబిడ్డలకుజేసెడి గౌరవము. తాను తనపుట్టినింట ఎంతయోసుఖమనుభవించితిననుమాట మరచి, అత్తింటికి తానుతరలినపుడు తనకు యిచ్చిన సారెచీరెలనుమరచి తన భర్తృసోదరిని అట్టిగౌరవముచేయుటకు మారు వారినిచూచి ఓర్వలేకపోవుట ఏలనో తెలియదు.

ఇదిగాక కొన్నిస్థలముల అన్నదమ్ములే తమభార్యలపక్షమై తనసోదరిని అనరాని మాటలనుచుందురు. తలిదండ్రులున్నను ఆడుబిడ్డలకు పుట్టినింట ఈషన్మాత్రమైన అధికారములేదు. ఇట్టిసమయములలో సోదరియందును, భార్యయెడలను సమానప్రేమగలపురుషుడు తనసోదరినిగాని, భార్యనుగాని ఏమియునేరపర్చలేకపడెడిమనఃక్లేశమునకు పరిమితిలేదు.

భర్తయుండి సుఖింపుచు అత్తింటనుండు ఆడుబిడ్డ వత్సరమునకొకసారి పుట్టినింట సుఖింతమనివచ్చిననే ఇంతసౌహార్ద్రిముగనున్నదిగదా! అట్టియెడ బాల్యముననే భర్తగతించి

ఆజన్మమును అన్నదమ్ములయొద్దనే కాలముగడుపవలసిన ఆడుబిడ్డలగతి. ఏమగునోతలచిన భయమగుచున్నది.

అయ్యో! అట్టిదీనురాండ్రగు ఆడుబిడ్డలనుచూచిన వదినగార్లు అనెడి మాటలు, పెట్టెడికష్టములు కొన్ని స్థలములలో వర్ణనాతీతము. అనాథయగు విధవసోదరిని, తనభర్త కొంచెమాదరించిమ్నాటాడినచో ఇంక ఈఇల్లాలికి అరికాలిమంటనెత్తికెక్కునుగదా! ఆవిధవ యగు ఆడుబిడ్డ వంటపూటింటకన్న ఎక్కువగ నింటగలఅన్ని పనులనుచేసి సోదరునికి, సోదరుని భార్యకు ఎన్ని విధములనోపరిచర్యజేసి ప్రేమించుచు ఇన్ని విధములఅణగియున్న ఆడుబిడ్డను చూచినను వదినగారికి ఆడుబిడ్డయెడగల అసూయతపోజాలదు. ఇట్టిసందర్భముననే నేముందు వ్రాసినట్లు ఆఇంటగలపురుషులు చాల వ్యథనొందుచుందురు.

ఇట్లువ్రాసితినని లోకమునగల వదినమరదండ్రందరును చెడ్డవారనిగాని లేక శ్రీమతి మానినిగారు వ్రాసినట్లు ఆడుబిడ్డలందరునుక్రూరులనిగాని నాయుద్దేశముగాదు. రెండువైపు లను నూటికితొంబదిమంది చెడ్డవారేగలరు. అయినను మంచివారును ఉభయత్రకలరుగాని లేకపోలేదు.

శ్రీమతి మానినిగారు ఆడుబిడ్డలకును, అన్నదమ్ములభార్యలకును స్నేహప్రేమలు ఎచటనులేవని వ్రాసిరి. ఆవాక్యమును నేనెంతమాత్రమంగీకరింపను. ఏలయన ఆడుబిడ్డయన ప్రాణసమానముగజూచి యాదరించిప్రేమించు వదినగార్లును, తనసోదరులభార్యలను గౌర వించి తల్లివలెచూచెడి ఆడుబిడ్డలును, ఇంటికివచ్చినకోడండ్రను కుమార్తెలకన్న మిన్నగ చూచి యాదరించెడి అత్తగార్లును లోకమున చాలమందికలరు.

శ్రీమతి మానినిగారు వ్రాసినట్లు ఇన్నిఇక్కట్లకును కారణము స్త్రీలకు విద్యా లోపమే. విద్యరాని ఆడుబిడ్డ విద్యావతియైన వదినగారిని హేళనసేయుచుండును. లేక విద్యావతియైన ఆడుబిడ్డనుజూచి విద్యాహీనయగు వదినగారు ఆమెవద్ద తానునేర్చుటమాని ఆమెను అవమానించి అసూయజెందును.

ఈవిశాలప్రపంచమున ఎన్నియోవిధగుణములుగల మనుజులుందురు. సాధారణముగ లోకమున తలిదండ్రులకంటె ఆప్తబంధువు లెవ్వరులేరుగదా! అట్టితల్లియే ఒక్కొక్కచోట తనబిడ్డలను వేపుకొనితినుచుండును. బిడ్డలమేలుగోరు తండ్రియే కొన్నిస్థలములలో కుమా రులయొక్కయు, కుమార్తెలయొక్కయు సంపదనుజూచి ఓర్వజాలక కటకటపడుచుండును. అన్నివిధములగు సుగుణములునుగల మనుజులరుదు. దుర్గుణములుగలమనుజులును అరుదే. కాన శ్రీమతి మానినిగారువ్రాసినట్లు ఆడుబిడ్డలే క్రూరురాండ్రనియు, రాక్షసులనియు వ్రాయుటెంతమాత్రమును న్యాయముగకన్పించుటలేదు. చెడ్డవారగు ఆడుబిడ్డలునుగలరు. క్రూరురాండ్రగు వదినమరదండ్రునుగలరు. ఉభయత్ర మంచివారునుగలరు. ఉభయత్ర చెడ్డ వారునుగలరు. కాన;

ఆడుబిడ్డలనుమాత్రము నిందించుట భావ్యముగాదు. శ్రీమతి మానినిగారు వ్రాసినది నిజమేగాని వదినగార్లలోనహా చాలచెడ్డవారుగలరని ఆమె మరచిరికాబోలును. అత్తయాడుబిడ్డలుపెట్టెడి బాధలనోర్వజాలక వదినగార్లు క్రూరులగుదురని ఆమెవ్రాసిరి. అది యెంతమాత్రమును నమ్మదగియుండదు. తనది మంచిస్వభావమైనచో వారిబాధలకోర్వలేక తానును చెడ్డస్వభావగలదగునా? తాను చెడ్డస్వభావమునలవఱచుకొనినను వదినమరదండ్రు తమబుద్ధిని పారద్రోలుదురా?

వినికిడిచేనేమి, లోకమునచూచినందుచేనేమి, స్వానుభవముచేనేమి ఈవ్యాసము వ్రాయుటకు నామానసము నన్నుప్రేరేపించినది. తప్పులున్న మన్నించి శ్రీమతి మానినిగారును, . నాసోదరసోదరీమణులును నీరమునువదలి క్షీరమునుగ్రహించు హంసముపగిది నాయీవ్యాసమునగల మంచిని గ్రహింతురుగాక! ఇంతట విరమించెదను. ఇట్లువ్రాసితినని వదినగార్లెవ్వరును నాపై నాగ్రహింపకుందురుగాక!

## ప్రబోధము

శ్రీమతి కల్యాల పార్వతీ దేవిగారు

ఉ. ఓవనితాశిరోమణి! మహోదయమయ్యె ధరిత్రి నూత్నతే
జోవిలసన్నవోద్భవము నూనె నుమీయిది, యాలవాలమే
దోవిధి నిర్వహించి యటులోయములాదిగ పోసిసాకి సం
సేవలొనర్ప తత్ఫలముచెందెదవంతట నిత్యతోషివై.

ఉ. ఎన్నిదినంబులుండగల వీవబలాహ్వయధారివౌచు? నా
సన్నము కాలచక్రము నిజప్రభలన్ సబలాత్వమూని వి
ద్వన్నుతమార్గచారిణిగ వర్తిలుమంత నితాంతతేజ సం
పన్నవరేఖలన్ జెలగుమా తరుణీ! భువినూత్నసంస్క్రియన్.

గీ. గ్రామసంఘ మనాచారకలితమగుచుఁ
దమకుఁగర్తవ్యమెఱుఁగక తల్లడిల్లు
చుందురవని వారలెలమినొంద దివ్య
సత్ప్రబోధంబులొసఁగుమ సాధ్వినీవు.

గీ. శాంతియుతచిత్తవగుదువు సరసిజాక్షి!
దానవహనంబుగల్గె నీదైనజన్మ
మునకు సహానప్రపూర్ణబోధనములొసఁగి
సత్పథాత్ములఁజేయుము సాధ్వి! వాఁ.

# ఇంటరంటే ఏంటి? శ్రీమతి ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మగారు

సంపూర్ణ స్వాతంత్ర్య మహాసంగ్రామంలో విజయమంది ఒకసారిగా విచ్చేసిన సత్యాగ్రహ సోదరసోదరీ వీరుల నాహ్వానించడానికి మార్చినెల 15 తేదిరాత్రి గం 2-50 ని॥ లకు ఏలూరునుండి ప్యాసెంజరుబండిలో బెజవాడకు బయల్దేరాము నేను, మా అబ్బాయి. ఏలూరులో అవిచ్ఛిన్నంగా సాగుతున్నాయి కాంగ్రెసు కార్యక్రమాలు. 16 తేదిని గోదావరిమండల సత్యాగ్రహవీరుల సన్మానోత్సవ సంరంభాలతో మా ఏలూరేకాదు, జిల్లా అంతా ఘళ్లుమంటోంది. కాస్త చెయ్యి, కాలు కూడదీసుకోడానికి నాలుగురోజులు విశ్రాంతి వచ్చిందంటేనే ఇట్లావుందే మావాళ్ల అట్టహాసం? ఓః! సంపూర్ణ స్వరాజ్యమే వస్తే ఇంకెట్లాగుంటుందో అనుకున్నాను.

స్టేషన్లోకి వెళ్లాం. రాత్రికావడంచేత స్టేషనుదాకకూడా మా క్షత్రియసోదరుడు వచ్చేడు సహాయం. ఆయన క్షత్రియుడు జన్మచే; ఆచరణలో బ్రాహ్మణుడు: అంటే మహాత్ముని అహింసాతత్వం ఆస్థిగతంగా జీర్ణంచేసుకున్న సిద్ధాంతి అవడంచేత! కాని బానిసత్వం, దాస్యం, మాతృశృంఖలం, అస్వతంత్రత ఇత్యాది వాక్యాలువిన్నాడో? చూడండి: పౌరుషం, క్షాత్రం పెల్లుబుకుతుంది. ప్రవహించడానికి మార్గంలేక బొమముడిలో కూడిన భృకుటీభంగాల్లో అదృశ్యమవుతుంది అప్పటికి. జాజ్వల్యమానములైన కన్నుల్లోనించి వెలువడ్డ తేజస్ఫులింగాలు దారిలేక ఫాలనేత్రునిమరుగు జొచ్చుతాయి. వైరివీరుల శౌర్యపౌరుషాల్ని పటాపంచలు చేసే హుంకారం నిర్వేదంతో కూడిన నిట్టూర్పుతో, దేశస్వాతంత్ర్యంకోసం రక్తమోడ్చిన వీరమూర్తుల శరణు జేరుతుంది. ఇది ఆయన్లో మనం చూసే పరిణామస్థితి. ఆయన మనలో మామూలుగా నేఉండి వలంటీరుగా అన్ని పనులు చేస్తుంటాడు విసుగు విరామం లేకుండా.

ఇహా కథకివస్తా. అయ్యా! రాజుగారూ! బెజవాడకి ఒకటిన్నర ఇంటరు టిక్కెట్లు తెచ్చిపెట్టండన్నాను. సంకోచంతో బయల్దేరేడు. నాకర్థంకాలే. నేను సందిగ్ధావస్థలో పడ్డాను. ఎందుకా రాజుగారు సందేహించారుఅని. దేశంలో 33 కోట్లభారతీయులు అస్వతంత్రత, దాస్యశృంఖలాల్లో; తెంపుకోలేని పరాధీనావస్థలో కుమ్మిల్లించిపోతూంటే ఈయమ్మకు - సత్యాగ్రహీ అని పేరుపెట్టుకున్న ఈయమ్మకు - ఇంటరుక్లాసు టిక్కెట్టా? అనా ఆయన సందేహం? 7 కోట్ల సోదరీసోదరులు మూడునాళ్లకైనా కూడుగుడ్డలేక మాడిపోతూంటే ఈ మూడణాలు వాళ్లకూడుగుడ్డలకు వెచ్చించక, ఈపాడుసుఖాల్ని వీడలేకపోతున్నారే, ఇంకా మన కాంగ్రెసువారైనా అనా? ఆయన సందేహం?...... ఈ సందేహాల్లో నేనూగిసలాడుతోంటేవచ్చేరు రాజుగారు టిక్కెట్లు తీసుకుని: 'బెజవాడకు ఒకటిన్నర ఇంటరు టిక్కెట్లు' అని నేనన్న పదహారక్షరాలు తూచా తప్పకుండా పాఠం అప్పగించేరుకాబోలు? ఇవ్వగానే పరిహాసాన్నో, విషాదాన్నో సూచించే ముఖంతో వచ్చి టిక్కెట్లు చేతికిచ్చేరు.

బండివచ్చింది. టైములేదు. 5 నిమిషాలే ఆగుతుంది. స్టేషన్లోను, బండిలోను జనంనిండారున్నారు. 'ఎక్కడికి' అన్నారు రాజుగారు. "అయ్యా! ఇంటరుక్లాసు కంపార్టుమెంటు ఎక్కడో చూడండి" అన్నాను. "నేనెప్పుడు ఇంటరు చూడలేదండి" అన్నాడు. ఆయన హృదయస్థితి నాకు తెలియలేదు. కాని నాకామాట శూలాఘాతమైంది. ఈశ్వరవాణి ధిక్కారంగా, నిర్లక్ష్యంగా, ఉపాలంభిస్తూన్నట్లయింది. నామస్తకం పరాభవాఘాతమైనట్లు అవనతమైపోయింది. "సరే, రండి!" అని శంకిస్తూ ముందుకు నడుస్తున్నా. ఇంటరుపెట్టె కనపడింది. నేను మా అబ్బాయి ఎక్కేం. ఏమో రెండుమాటలు చెప్పాలనుకున్నా: రాలేదు. కంఠము రుద్ధమైపోయింది.

ఇంతలో ఎవరో నేనున్న పెట్టెలోకి ఎక్కడానికి వచ్చేడు. "నాయనా! ఇది ఇంటరు. ఎక్కకూడదు. అవతలి పెట్టిలోకి వెళ్లు" అన్నాను. "ఇంటరా? ఇంటరంటే ఏంటి?" అన్నాడు ఆసోదరుడు ప్రక్క పెట్టెలోకి వెళ్తూ. నాకు పిడుగుపడ్డట్టయింది. గుండెల్లో పొడిచినట్టయింది. చలిస్తూన్న హృదయం విచ్చిపోయింది. మెరుపు మెరసినట్లొక క్షణంలో వెయ్యి ఊహలు మనోవీథిని పరుగులెత్తేయి.

ఈ వాక్కో అపరేషక మా మెంటొచ్చింతర్వాత ఈ 10 సం॥రాల్లో నేనింటరెక్కడానికి ఇది మూడో సారో నాలుగు సారో. అంతే: ఏస్థితిలో నున్నా, ధర్డుక్లాసుబండే ఎక్కాలిగాని ఇంకో పెట్టెలో ఎక్కాలనే సుఖాన్ని ఆశించకూడదనే స్థిరపరుచుకున్నా: ఎన్నిమార్లో శరీరస్వాస్థ్యంలేనప్పుడు ఇంటరుకు ప్రయత్నించి సంకోచించేదాన్ని. ఆనాడు మరీ అస్వాస్థ్యంగా ఉంది. అప్పటికి రెండు నెల్లనుండి జ్వరం వస్తూంది. చాల నీరసంగా ఉంది. మర్నాడు కథ చాల ఉంది. రాత్రి ప్రయాణం. బొత్తిగా లేవలేనే మోననే ఉద్దేశ్యంలో ఇంటరుకు సాహసించా. అసలు సంగతిది.

"ఇంటరంటే ఏంటి?" అపదాత్మరి మార్మ్రోగింది దశదిశల. 100 ప్రశ్నలు, 100 సమాధానాలు మనస్సులో ఆక్షణంలో! ఒకటీ సంపూర్ణంగా తృప్తికాలే;......రైలుబండ్లల్లో ఇంటరుక్లాసు పెట్టెలుంటాయని ఎందరికి తెలియదు? ఫస్టుక్లాసు, సెకండుక్లాసు బండ్లుంటాయని ఎందరికి తెలుసు మనలోకంలో? నాల్గణాలు రైలుటిక్కట్టుకొనుక్కోలేక నాలుగ్గంటలు చల్లపాటువేళ నడచిపోతే ఈ నాలుగు డబ్బులు నాపిల్లల గంజికే ఉంటాయి అనే అమాయిక బీదసోదరు లెందరున్నారు దేశంలో?—నాల్గణాలు ఎంత తేలిక? నాలుగుత్తరాలు వ్రాసినంత: ఒకపూట నాగరికులు నాల్గోసంతు కాఫీఫలహారం చేసినంత; ఇంతే! ఎంతో కాదు. ఇంతే: కాని ఈ ఇంతే ఎంతో అనుకునే నావాళ్లెందరున్నారు? కాఫీఫలహారాలు విన్నైనావినని నావాళ్లెందరున్నారు? నాలుగు అణాలు నాలుగు వందలుగా భావించే నావాళ్లెందరున్నారు? ఆ 'నా' శబ్దం నిశ్చయంగా నిర్మలంగా మననం చేసుకుంటే నాకీ "ఇంటరంటే ఏంటి?" అర్థమౌతుంది. 'ఇంటరంటే' ఏంటో తెలీని నాసోదరీసోదరులవిడిచి నాకీ ఇంటరెక్కడానికి అర్హత ఉన్నదా?

అంతలో నాకో చిన్న విషయం నాల్గునెలల క్రితమే జరిగింది జ్ఞాపకం వచ్చింది. 1930 సం॥ సెప్టెంబరు 7 తేది సాయంత్రం 6 గంటలబండిలో శ్రీ మీరాబాయిగారితో ఏలూరునుండి రాజమండ్రికి ప్రయాణం చేస్తున్నాం. త్రికరణశుద్ధిగా మహాత్మునిశిష్యురాలయిన శ్రీ మీరాబాయిగారి పావనచరిత్ర ఆంధ్రులకు తెలిసినదే. ఆమె మేమెన్నివిధాల కోరినా అంగీకరించక మూడోక్లాసు పెట్టెలోనే ఎక్కింది. తాడేపల్లిగూడెం స్టేషనుకు వచ్చింది. బండి ఆగింది. అక్కడ కలకత్తా మెయిలుబండి వచ్చి కలుసుకుంటుంది. శ్రీ మీరాబాయి కన్య ప్లాటుఫారంమీద చేరిన ప్రజాసమూహానికి చిన్న ఉపన్యాసం చేసి అప్పుడే బండి ఎక్కింది. ఇంతలో మెయిలు వచ్చి ఆగింది. మాకు సరిగా ఎదురుగా మెయిలు ఒకటోక్లాసు కంపార్టుమెంటు (రెస్టారెంటుకారు) ఉంది. విలాసమందిరంలా ఉంది అది. అందులో ఒక యూరోపియను, ఇద్దరు హిందువులు ఉన్నారు. మహావిలాసంగా ఒయ్యారంగా ఫలహారాలు చేస్తూ కాఫీలు త్రాగుతున్నారు. అవి కాఫీఫలహారాలు కావు; కడుపుకు తిండి, కట్టుకోడానికి గుడ్డ లేక అల్లాడిపోతున్న దరిద్రభారతుల రక్తమాంసాలు అనుకుందికాబోలు ఆమీరాదేవి. విషాదంతో నిండిన రెండు వేడికన్నీటిచుక్కలు పైటకొంగుపై జాలువారి మానై పుమాచింది. ఆతల్లి సన్నేహము, సౌహార్ద్రము, సాదరమునైన ఆవీక్షణములనైశిల్యమునకు మాలో ఎందరు తాళగలిగినారో! "రాజమందిరాలు, ఒకటవక్లాసు రైలుబండ్లు, మహాభోగాలు, ధనరాసులూ" ఇంతకన్న వేఱుగా ప్రపంచమున్నదని (వ్రేలుపెట్టిచూపుచు) ఈ విలాసపురుషులకు తెలియునా? ఎప్పుడైనా వారిభావాల్లో అస్మరణకలుగునా?

అంది గద్గదికతో. ఆమాటవిని నవ్వేరు మాలో కొందరు. అంటేవారు సామాన్యంగా ఇంటరులోను, అప్పుడప్పుడు 1, 2 క్లాసుల్లోను ప్రయాణంచేస్తుంటారు. అంచేతో, ఎంచేతోనవ్వేరు. కాని అవి నవ్వాలిసిన మాటలుకావు. మంత్రోపదేశాలు. ఆయమకళ్లుమూసుకుంది. ఆతీక్ష్ణనేత్రాంతర్గతములై వెలువడిన కాంతికణములు, ఎందరిహృదయాచ్ఛాదితమలినపటముల భస్మముచేసినవో గ్రహించగలిగినవారు చాలకొద్దిమందే యుంటారు. ఆమర్నాడు కాకినాడచేరేము. అక్కడ స్వాగతాలు, సన్మానాలు, సంరంభాలు, సభలూఅయ్యేక సామర్లకోటదాక సాగనంపడానికివచ్చేము. అక్కడ కలకత్తావఱకు రెండోక్లాసు టిక్కెట్టుకొంటామని, ఎవరయినా కూడావస్తామని ఆసాధ్వీమిరాబాయిని చాలబ్రతిమాలేము. ఆయమ చిరునవ్వుతో మనోహరంగా ఇట్లుచెప్పింది: "వద్దు. అదినాకుచాలకష్టం. ఎంతమాత్రం ఇష్టంలేదు. నాఆరోగ్యంబాగాలేదని మద్రాసునుండి ఏలూరువఱకు సెకండుక్లాసుబండిలోవచ్చేను. విదేశీగుడ్డల పరుపులపైపండుకొనుటచేతనో, అన్నార్తులై తోటిసోదరులు దరిద్రదశలో దుఃఖించుచుండగా ఈనాసుఖలాలసతో నాకు ఆరాత్రిఅంతా నిద్రపట్టలేదు. చాలవేదనకలిగింది. ఎంతమాత్రంమనశ్శాంతికాలేదు. కాబట్టి నాకు అందరితోపాటు మూడోక్లాసుబండే బాగుంటుంది" అన్నది. ఆపావనవాక్యాన్ని అర్థంచేసుకోగలిగినంతమంది అర్థంచేసుకున్నారు.

ఇదంతానాకు 5 నిమిషాల్లోజ్ఞాపకంవచ్చింది. ఇట్లాంటిసంఘటన లింకాకొన్ని జ్ఞాపకంవచ్చేయి. "మహాత్ముడు ఎప్పుడూమూడోక్లాసుబండిలోనే ప్రయాణంచేస్తాడు" అనేమాటలు అస్పష్టంగా, అప్రయత్నంగా నానోట్లోంచి వెలువడ్డాయి.

ఇంతలోబండికదలింది. "అమ్మా! నమస్కారం"అన్నాడు రాజాగారు నిర్మలహృదయంతో మధురంగా. ప్రతినమస్కారంచేశా చేతులు కదుపలేక నేజోడించి. 'నమస్కారమండీ రాజాగారు!' అన్నా శుష్కహృదయంతో, రుద్ధకంఠంతో. నాతలతిరిగిపోయింది. కళ్లుచీకట్లుకమ్మేయి. అవశంగా కూలబడ్డా ఆఇంటరుక్లాసులోఉన్న మూడోరకం పరుపులమీద. బండికదలిపోయింది.

నాకు తెలివివచ్చేప్పటికి విద్యుద్దీపాలకాంతులచే పట్టపగల్లాఉన్న బెజవాడస్టేషన్లోఉందిబండి. మా పెట్టిలోనే ఢిల్లీకిపోతున్న ప్రయాణీకులు 4, 5 మార్లులేపేరుట, బెజవాడవచ్చామని!

ఓంకారప్రణవనాదమువలె ఆ "ఇంటరంటే ఏంటి?" నాచెవుల్లో గింగురుమంటోంది.

## పశ్చాత్తాపము

కందుకూరి రామభద్ర రావు గారు

"నాథుడేనాడొ గృహపావంబుసేయు
నాసమయమున కొనరింతునాత్మసదన
మమలగుణరత్నసందీప్తమై వెలుంగ"
అనెడితలపుననే కాలమరుగుచుండె.
ఎన్నడో, ఏతరుణమందొ, హృదయనాథు
డింతస్వాగతచిహ్నయేనెచటలేక
మూయబడియున్న ద్వారముముందునిలిచి
మరలిపోయెనొ విఫలుడై యొఱుకపడదు.

విగతకల్మషభవనాన విమలరత్న
మణివిభూషల శృంగారమునుఘటించి
భక్తిదూతిక బిలువంగబంపెదనని
వేచియున్నాడొ ప్రియుడింతవేళదాక.
"ఎంతకాలమువేచిన నేమఱిన త
దీయస్వాంతమునకు నింకతివురనేల?"
అనుతలంపున నస్వీడియరిగెనేమొ
నిరతసందర్శనోత్సాహపరులకొఱకు.

## వివాహము

న్యాపతి కృష్ణారావుగారు బి.యె. బి.యల్.

మానవసంస్థలయన్నిటిలో వివాహ మపూర్వమైనవిషయము. దానివలన కొందఱిజీవితము విచిత్రముగ మార్పుచెందును. వివాహమువలనకలుగు కష్టములను ప్రథమమున ఎవ్వరునెంచరు. అట్లుండుటయే మేలు. లేకున్నచో భూతలమున వివాహములు క్రమముగ క్షీణించును. వివాహము కష్టమనియెంచు దంపతులు చిరకాలము జీవింపనేరరు. వివాహమెంతటి యద్భుతమైన అనాదినుండియు వచ్చెడిసంస్థయైనను ప్రస్తుతసాంఘికపరిణామమునకుగూడ ననుగుణ్యముగనున్నది. వివాహము బానిసత్వమనియు, నిష్ప్రయోజనమనియు, విషాదాంతమనియు, నరకమనియు అవలోకించువారితో నాకు సానుభూతిలేదు. అయ్యవి కొందఱవ్యక్తుల స్వానుభవములై యుండనోపు. కొలదిమందికిమాత్రమె యిష్టములేదని ఎట్టి సంస్థను త్రోసిపుచ్చరాదు. "వివాహమువలన నీవు పరితపించుచుంటివా" యని నూరు మందిని ప్రశ్నింపుము. పదిమందికూడ "అవు" నని ప్రత్యుత్తరమిచ్చెద రనెడిమాట సందేహము.

ప్రథమమున వధూవరులిర్వురును ఒక్కమారుగ మిక్కుటమగుపరిచయముబూనుట యించుక అసాధ్యము. పూర్వపుటనుభవములేనందున వారికాపరిచయసమస్య మఱింత కష్టమగును. దంపతులు ఔపోసనానంతరమున బహుజాగరూకతతో వర్తింపవలసియున్నది. నూతనదంపతులకు ప్రతివిషయమునూతనమే. వంటయిల్లుమొదలు పడకగదివఱకును వారు క్రొత్తయలవాటులకు లోబడవలసివచ్చును. గృహోపయంత్రమును నడపుటకు నిర్వురును సిద్ధులై యుండవలెను. దానిని నడపుటకు వారిబుద్ధినంతయు ఉపయోగింపనిచో శాంతియుతమగు గృహము నెరవేరదు. గృహమందువర్తించుటనుబట్టి ఒండొరులకు పరిచయము వృద్ధి యగుటయు క్షీణించుటయు కలదు. క్రొత్తకాపురమందు ముఖ్యముకానివిషయములులేవు. అన్నియు ముఖ్యములే. ఆరంభమున నిర్వురకును రహస్యమునకును, ఆత్మగోప్యమునకును నెలవులేదు. "చూడుము నేను కొంతతడవు ఏకాంతముగనుండెద"ననుట నూతనదాంపత్యమునకు చలనముకలిగించును. ఇర్వురును పరస్పరానురాగముతో తులతూగుచున్నను వారలకు గుప్తభావప్రకరణమెక్కువై వివిక్తప్రదేశముల "ఆమె నన్ను మిగులప్రేమించును. నేనును ఆమెనుప్రేమింతును. కాని ధర్మశాస్త్రరీతిని నేనెహెచ్చు. ఆమె నామాట వినునటులచేయవలె"నని భర్తయును, అటులనే భర్తనుగూర్చి భార్యయునుతలచుట యుక్తము కాదు. అట్టిది పరస్పరానురాగసౌఖ్యమునకు భంగముకలిగించును. కారణము ప్రేమ ప్రసరించునదె కాని రాజ్యమేలునదికాదు.

ఇటీవల నొకయువకుడు తావివాహమాడిన కన్యనుగూర్చిచెప్పుచు "ఆపిల్లవంటిపిల్ల ప్రపంచములో మఱి లేద"ని పొగడెను. అపుడు నేనతనితో కాదని వాదించలేదు.





# సుమాఞ్జలిః




౧.
నిస్తులభూషాశస్తా,
రమణీయాకారనిత్యస్పృహణీయా,
దివ్యద్గుణసంవలితా,
గృహలక్ష్మీర్భాతి పత్త్రికాయోషా.
ఆంధ్రీయువతీజనతా
ఆనందంప్రాప్య చైవ చామందం,
వీరా, సతీ, సుగృహిణీ,
ధర్మానసయా మహత్తరాన్విందేత్.
సీతాసదృశసతీత్వమ్,
గార్గీ, ఖనాదిదివ్యవైదుష్యమ్,
సత్యా, విమలా, వీర్యమ్,
పునరపిదేయాచ్ఛనేత్రసౌభాగ్యమ్.
ఆంధ్రానితా స్తముదితాః;
ప్రసృతం సౌశీల్యకుసుమసౌరభ్యమ్;
లక్ష్యంప్రత్యక్ష మిదమ్
స్త్రీణాం; భావత్క మధురసంబోధాత్.
భారతధర్మాదర్శమ్,
రమణీరమణీయసభ్యతాపాది,
విజ్ఞాన, రాగ, పాత్రమ్,
పత్త్రం లోకేశ! వర్ధతాంలోకే.

—ఇతివేఙ్కటేశ్వరశాస్త్రిణః







ఈభువిలో భర్తలందఱు తమభార్యలగురించి అటులనేవాక్రుత్తురని నానిశ్చితాభిప్రాయము. ఆపిల్లకూడ తనభర్తను అటులనేవర్ణించెను—ఇట్టిభ్రమలు సాధారణముగ క్రొత్తకాపురము లందు కలుగుచుండును. అటువంటిభ్రమలుకల్గుట మంచిదనియే మదభిప్రాయము. కాని అది మెల్లకాలము వర్ధిల్లదు. అన్యోన్యత ప్రేమజన్యంబగుభ్రమవలననేపుట్టును. దానప్రేమ యున్నంతకాలము భ్రమవర్ధిల్లును. ప్రేమ చిరకాలముండునదికాదు. మొదటకలిగినవైవాహికప్రేమ తమోగుణప్రేమగ మార్పుచెందును. అంత నిర్లక్ష్యముగానికి మరలును. అందుండి అసహ్యము మొలకెత్తును. అసహ్యముకలిగినచో ఇక అన్యోన్యప్రేమ అడుగంటును. ఈమార్పులన్నియు కర్ణకఠోరములైనను నిర్వివాదాంశములు.

ఏదియెట్లున్నను క్రమముగ మొదటనున్నభావములన్నియు సమసిపోవును. దైవాంశసంభూతులని యొండొరులనితలచెడి భావము తారుమారగును. నాటినుండియు విచక్షణయుక్తమైనపరీక్ష బయల్వెడలును. భ్రమక్షీణించినకొలదియు ఒకరిసత్యము నొకరుగుర్తింపకల్గుదురు. చిట్టచివరకు వివాహము తామనుకొనినంత సౌఖ్యముకాదనియు, తదితరవ్యవహారములబోలె యిందనేకకష్టములును, బాధ్యతలునుకలవని అరసికొనెదరు. నీతివిషయముగు బాధ్యతలు దాంపత్యమునందెక్కువకలవని దంపతులు లోలోన దుఃఖమునుగూడ పొందెదరు.

తనసతిగాని, పతిగాని మేలిగుణములప్రోవనియెంచియు, పౌరాణికేతిహాసనాయికానాయకులనుమించుననియు యెంచి తాము వివాహమాడిరి. ఇపుడన్ననో తమయాదర్శములకు దగినమూర్తి లభించక భిన్నహృదయులై దంపతులు పరితపింతురు. తాముకోరిన గుణములు ఒండొరులందుకానరావు. ముఖ్యాదర్శకములందు ఒండొరులుకొరవడిరి. అందరివలెకాక తాము ఆదర్శకప్రాయులన్నభావము భిన్నములైపోయెను. ఇటులఅభిప్రాయముల భేదముకలిగి వివాహము నిష్ఫలమయ్యెనని దంపతులు పలవింతురు.

—ఆర్నాల్డు బెన్నెట్టునుండి అనువాదము.

# శకుంతలనంపువేళ

అధికార్ల సూర్యనారాయణరావుగారు బి.యల్.

వనమాలికలు లేతపల్లవములిచ్చె
హరిచందనావళుల్ విరులనందిచ్చె
వనతరులెల్ల చల్లనినీడలిచ్చె
చెలువుచెంతకు శకుంతల నంపువేళ.
కమ్మతెమ్మెరలు సుగంధముల్ దెచ్చె
ఆకసముబంగారు రేకలందాల్చె

వృక్షశాఖలనుండి పికముసెలవిచ్చె
చెలువుచెంతకు శకుంతలనంపువేళ.
హరిణకుమారి వెన్నాడగాజొచ్చె
కాంతాసమూహంబు కన్నీరురాల్చె
హాయియౌనని జనకుడాశీర్వదించె
చెలువుచెంతకు శకుంతలనంపువేళ.

# "మీకళ్లు నాభార్యమీద పడ్డాయంటే..."

తార్కికుడు

నాలుగ్గంట లయింది. శాలువు పైకి తియ్యాలన్నంత చలి ప్రారంభించిందప్పుడే.

వూళ్లో కల్లా అది వొక్కటే మేడ. వీధిలో వూడలు తన్ని వున్న మఱ్ఱిచెట్టు దాని ప్రాచీనతకి మౌతుబరీసాక్షిగా వుంది. చాలా కాలం నుంచి సంస్కారం యెరక్కపోవడంచేత అక్కడక్కడ శైథిల్యం పొందుతూ వుందది.

గుమ్మం యెక్కేటప్పటికి కవులుపిట్టల కోలాహలం వినపడింది. లోపల అడుగు పెట్టేటప్పటికి ముఖపరిచయం వున్న పెద్దకాపా "దొరగారు కాఫీ పుచ్చుకుంటున్నా"రని చెబుతూ కండా వేసి చక్కాపోయాడు.

హాలునిండా కుర్చీలున్నాయి కనకనూ, నుంచుంటే "కూచో" మని కాని, కూచుంటే "లే"మని కాని అనే వా రెవరూ లేకపోవడంచేతనూ నాకు నేనే సాహసించి వొక కుర్చీలో కూచున్నాను.

పూర్తిగా వొక్క గంట గడిచింది. వచ్చిన పని అయితే—అథవా, దర్శనమేనా అయితే నేను మళ్లీ రెండు మైళ్లు వెళ్లాలి.

ఇంతలో పెద్ద కాపా మళ్లీవచ్చి "దొరగారు వస్తున్నా"రన్నాడు. "నేను వచ్చినట్లు చెప్పేవా?" అంటే "లేద"న్నాడు." ఏమంటే "మీరు చెప్ప మన్నారా?" అన్నాడు.

నెపం నామీదే పడింది. అయినా నే నాశ్చర్యపడలేదు. ఏమీ కూడా పడలేదు.

దొరగారు కిందికి వచ్చేరు. కూడా అయిదారుగురు మిత్రు లున్నారు. మామూలు మర్యాదలు జరిగేయి. అంతా తలో కుర్చీలోనూ కూచున్నాం.

అదివరకే జరుగుతోంది కాబోలు గోషాని గురించి చర్చ. కింద కూడా మళ్లీ మొదలయింది.

"మీరు బ్రహ్మసామాజికులు. మీ మతమే వేరూ. కనక మీరు మమ్మల్ని విమర్శించడం మంచిది కాదు. శాస్త్రులుగారి నడగండేమంటారో?" అన్నారు దొరగారు వొక్క పెద్దమనిషికి చూపిస్తూనూ.

"దీనికి మతంతో సమ్మంధం లేదు. స్త్రీలకి వుండే సాధారణాధికారా (హక్కు) లన్నీ అన్ని మతాలలోనూ వొక్క విధంగానే వుంటాయి. మతం సంగతి యెత్తుకున్నా మీ మతంలో అయినా అన్ని వర్ణాల వారికీ వుందా యీ ఆచారం?" అన్నారు బ్రహ్మసామాజికమిత్రులు.

"మా మహమ్మదీయుల్లో—"అని మొదలుపెట్టే డొక పెద్దమనిషి. అంతవరకూ ఆయన మహమ్మదీయు డని నాకు తోచలేదు. రూపురేఖల్లో ఆలక్షణాలు ఏమీలేవు.

"మామహమ్మదీయుల్లో యిది యెక్కువేనూవుంది. మా మతంలో స్త్రీలు తమ శరీరాన్ని తాముకూడా చూసుకోగూడదని నిషేధం వుంది" అన్నారు మహమ్మదీయమిత్రులు.

"శరీరాన్ని చూడడం కాదిక్కడ విషయం. అవసర మైనప్పుడు యే ఆచ్ఛాదనమూ—అంటే బురకాలూ, మేలిముసుగులూ—ఇలాంటి వేవీ లేకుండా స్త్రీ వీధిలోకి—నలుగురిలోకీ రావడంవల్ల అభిజాత్యానికి గాని, మర్యాదకి గాని, శీలానికి గాని భంగం కలగదు. గోషా లేకపోవడంవల్ల యితరస్త్రీలు చెడిపోతున్నారా?" అని టోకాయించి అడిగేరు బ్రాహ్మలు.

"గోషాలేకపోవడంవల్ల ఇతరస్త్రీలు చెడిపోతున్నారా? అంటే దానికి జవాబు చెప్పవలసిన పూచీ నాకు లేదు; గాని స్త్రీల శీలరక్షణకి గోషా అవసరం. ఈసిద్ధాంతాని కిక తిరుగు లేదు"అని దొరగారు ఝాడించి చెప్పేరు.

"స్త్రీని పురుషు డిలా అనుమానించడంలో నీతిలేదు. స్త్రీని గురించి పురుషు డెంత వాక్సంయమం వహిస్తే అంత మంచిది" అన్నాను నేను.

ఎవరూ ఏమీ మాట్లాడలేదు. నామాటలికి వ్యాఖ్యానం అవసర మని తోచింది నాకు.

"అసలీ చర్చలోనే స్వారస్యం లేదు. గోషాస్త్రీలకి చెందిన పురుషులు అది మాకులాచారం అని పూరుకుంటే తగవు తెగ్గిపోతుంది. వివరాలు తవ్వడం మంచిది కాదు. ఏమంటే? స్త్రీ వీధిలోకి వస్తే వే—"

"అసలు శీలవైశిష్ట్యం అంటే యేమిటో మీకు బోధపడలే దన్నమాట"

"బోధపరచండి"

"నాభార్య వీధిలో వెడుతూ వుంటుంది. మీ రామె కేసి చూస్తారు. మీ చూపుల్లో దురుద్దేశం వుండకపోవచ్చు. ఏభావమూ కూడా లేకపోవచ్చు. అయినా మీ కళ్లు నా భార్యమీద పడ్డాయంటే నా మానాభిమానాలు గంగలో కలిశా యన్నమాటే"

ఇదీ సంగతి. పరపురుషుని కళ్లబడితే స్త్రీ చ్యుతశీల అయిపోతుంది.

పురుషుని హృదయదౌర్బల్యాని కింతకంటే నిదర్శనం అక్కర లేదు. స్త్రీని గురించి పురుషుని కుండే నికృష్టాభిప్రాయాల కిది మేరువుపూస.

పురుషుని శీలంకంటే స్త్రీశీలం చాలా నిశితం అయింది. వెనకటికి మనవాళ్లు స్త్రీల శీలాన్ని గురించి అతి జాగ్రత్తగా రక్షణోపాయా లేర్పరిచా రంటే అది సంఘంలో స్త్రీకిగల ప్రాముఖ్యానికి నిదర్శనం; గాని యిదేమిటి? ఇది నడమంతరం. ఇది స్త్రీయొక్క ఔత్కృష్ట్యాన్ని—అథవా, వైశిష్ట్యాన్ని గుర్తించిన సిద్ధాంతం కాదు.

వొక అబద్ధాన్ని కప్పుకోవా లంటే నూరు అబద్ధా లాడాలి. అలాగే స్త్రీజాతికి—సంఘసభ్యతకి వేరుపురు గైన గోషాని సమర్థించా లంటే యిలాంటి అసభ్యసిద్ధాంతా లెన్నైనా చూపించాలి.

ఇంతకీ స్త్రీ తన శీలాన్ని కాపాడుకోవా లంటే అది ఆమె యిచ్ఛలోనే వుంది. పురుషుని వక్రోపాయాలలో లేదు.

మానవతి కాని స్త్రీ గోషాలో బంధింపబడివుండినీ్న అక్రమసుఖాలు పొందగలదు. గోషాస్త్రీలలో కొందరు శీలాన్ని చెరుచుకున్నందుకు కోర్టురికార్డులో మంచి నిదర్శనా లున్నాయి.

గోషా శాస్త్రీయం కాదు. మతాచారం కాదు. సార్వజనికం కాదు. ధారావాహికం కాదు. కొద్ది తరాలనుంచి మాత్రమే కొన్ని కులాల్లో మాత్రమేవుంది.

గోషా, స్త్రీల పరపురుషేచ్ఛకి ప్రతిబంధకం కాలేకపోవడం అలా వుండగా ఆకులాల పురుషులలో కొందరికి కాంతావ్యామోహం ఉత్తరంగితం కావడానికి బాగా వుపకరిస్తోంది.

పురుషునికి కంటే స్త్రీలకి కామం తొమ్మిది రెట్లెక్కు వంటే వొప్పుకుంటాను; గాని సంయమం పదహారు రెట్లెక్కువ.

పశుకృత్యంలో పురుషునికి కంటే స్త్రీకి చొరవతక్కువ. వలపుపిశాచం పురుషుని మొగంమీద చిందులుతొక్కినంతతొరగా స్త్రీ ముఖంమీద అంకితం కాదు.

నీతినియమాలకి స్త్రీ కట్టుబడి వున్నంత దృఢంగా పురుషుడు కట్టుబడి వుండలేదు.

పురుషుడు సంఘానికి జడుస్తూ, నీతికి జంకుతూ, నియమానికి లొంగుతూ, ధర్మానికి వెరుస్తూ, సభ్యతకి ద్రోహీ, లజ్జకి దూరమూ కాకుండా వుంటే స్త్రీ దేవిగా వుంటుంది.

శరీరం అమ్మకునే వేశ్యగూడా "ఏ మమ్మా" అంటే "ఏం నాయనా?" అంటుంది.

ఈశతాబ్దిలో గూడా మనలో ఈ ఆచారం కలవారిలో మార్పేమీ కలిగినట్లు లేదు. ఇంగ్లీషు కూడా వారి కళ్లకి వెలుగు కలిగించలేకపోయింది.

ఇప్పుడు మనలో స్త్రీలను గురించి ధర్మానుగత మైన అభిమానంకంటే ప్రలోభబహుళ మైన నటన ఎక్కువగా వుంది.

ఇది పోవాలి. ఇది వున్నంత కాలమూ మనకి సభ్యతలేదు.

## మల్లిక

యడవిల్లి రామమూర్తిగారు

ప్రణయవికసితహృదయమార్గమ్మునందు
నిరుపమవినూత్న భావచంద్రికలువిరియ
దళముదళమున నగవుసొంపులునటింప
విమలముఖసీమ మోదబాష్పములుపొడమ
నలరుమల్లిక మత్ప్రియురాలుపోలె.
బాష్పముల భావసంపదచెలంగు
తలపు తెరలోనఁ బ్రణయసుందరినటించు
బండువెన్నెల తెరలోనఁ బ్రకృతితోఁచు
లేఁజివురుకావి తెరను మల్లికహసించు.
తరళరదనాలఁదూగు కొందళ్కుతోడ
బెదవిదులకించు చిరునవ్వు వెలుఁగుతోడ
ప్రణయినీముఖకాంతిసౌభాగ్యమట్లు
బాష్పములలోని మౌక్తికప్రభలతోడ
వెలఁదివెన్నెలఁ దోలకాడు వెలుఁగుతోడ
మల్లికాశుభ్ర కాంతులు మల్లడించె.
కోమలములైన చిరువ్రేలికొనలమీటి
చిందువిరహిణి కన్నీటిచినుకులచటఁ
గరముపెంపొందు పల్లవాగ్రములుమీటి
చిందుమల్లిక క్రొమ్మంచుచినుకులిచట.
పిల్ల తెమ్మెరఁగదలి యీమల్లెపూవు
తడవతడవకుఁ గమ్మనెత్తావిఁజిల్కు
ప్రణయతాపాన వడవడవడకియడరి
వేడియూర్పులుపుచ్చెడు వెలదిపోలె.
అగ్గలమ్మగువిరహమ్ము నాపలేక
సిగ్గుచే మోము పయ్యెదచెఱఁగులోన
డాఁచికన్నీరువిడచు మిటారిపోలె
కావిచివురాకులోన మొగమ్ముడాఁచి
మంచుబొట్టులురాల్చు నీమల్లెపూవు.

* * *

మధురహృదయమ్ము రెంటసామ్యమ్ముగాదె?
వెఱ్ఱిమల్లియ తనయంత విరిసిమురిసి
కడలఁగ్రొవ్వాఁడి వలపులఁగడలుకొలిపి
మృదులహృదయము ప్రియునకర్పించురీతి
మోమువిరియంగఁ దనయంతముద్దరాలు
కడకక్రొవ్వాఁడి వలపుచక్కఁగరచించి
మృదులహృదయము ప్రియునకర్పించుగాదె.
తీర్చిదిద్దని నాదుహృత్సీమఁజొచ్చి
యచటనేమూలనో కేగి యడఁగిపోవు
ప్రేయసీప్రేమసందేశవీచులట్లు
గాటముగనల్లికొన్న యీకాననమున
నెచటనోవీచితృటిలోన నిగిరిపోవు
మల్లికావాసనల మందమారుతములు.

# శుభదర్శనము

శ్రీమతి ఎస్. సీతామణిగారు

కాంతిచంద్రుఁ డిరువదియయిదువత్సరముల యువకుఁడు. ప్రథమభార్య మరణించిన వెనుక నాతఁడెవరికిని తనహృదయమునందు తావీయక, మృగములను, పక్షులను వేటాడుట యందు కాలము గడుపుచుండెను. ఆతఁడు చూచుటకు చాలనందగాఁడు. పొడవుగపలుచగా నుండి యాతనిమూర్తి యాకర్షణీయముగానుండును. ఆతనిదృష్టి కడుతీక్ష్ణమయినది. అతఁడు తనవెంటఁ గొందరుచెలికాండ్రనుగయికొని తరచువేటకు వెడలుచుండును.

ఆతఁడొకపర్యాయముచెలికాండ్రతో నదీతీరముననున్న యరణ్యమునకు వేటకు వెడలినాఁడు. కాంతిచంద్రుని పరివారమంతయు పడవలలోనుండిరి. స్నానఘట్టములకేతెంచు యువతులు వీరలనుగాంచి స్నానమాడుట యసంభవమనియెంచి వెడలిపోవుచుండిరి. ఆదినమంతయు భూమియు నదియుకూడ తుపాకిధ్వనులచే కంపించిపోయెను.

ఒకనాటియుదయమున కాంతిచంద్రుఁడు తనతుపాకి సరిచేసికొనుచు తనపడవయందాసీనుఁడై అడవిబాతుయొక్క అరుపువిని తలయెత్తిచూచినాఁడు. గ్రామబాలికయొకతె రెండుబాతుపిల్లలను పట్టుకొని నదీతీరమునకు వచ్చుచుండు టాతనికగపడినది. ఆబాలిక జలసమీపమునకువచ్చి రెండుబాతులను నీటియందిడి, దాపుననున్న వేటగాండ్రభయముచే నత్యాతురతచే వానిని వీక్షింపుచుండెను.

ఆబాలిక విశ్వకర్మశిల్పాగారమునుండి యప్పుడేయేతెంచిన ట్లతిమనోహరముగా నుండెను. ఆయమ వయస్సింతయని నిర్ణయించుట చాలకష్టము. ఆమె యాకృతిలో యువతి వలె నుండినను, వదనము బాల్యతను వ్యక్తపరచుచుండెను. ఆమె యౌవనమున నిప్పుడిప్పుడే యడుగిడినట్లుండెను.

కాంతిచంద్రునిపని యొకక్షణకాలమట్లే నిలిచిపోయెను. అతఁ డాబాలికామణినిగాంచి సమ్మోహితుఁడయ్యెను. ఆస్థలమునం దంతటిసౌందర్యవతిని చూడఁగలనని యాతఁడనుకొన లేదు. ఆమెసౌందర్యము రాజభవనమునకుతగియున్నను, ఆప్రదేశమే యామె కత్యంతరామణీయకతఁగూర్చెను. హేమకలశమందుండు పుష్పముకన్న, కొమ్మనుండెడి పుష్పమే యతి మనోహరముగనుండునుగదా? శరత్కాలపు మంచుబిందువులతో నిండియున్న రెల్లుపూవులు, యెండలో మెరయుచున్న యాదినమున యాబాలికావదనమండల మాతనిహృదయమున స్థాపిత మైనది. ఆతఁడట్లు రెప్పవేయకుండచూచుచుండగనే యాబాలిక యస్పష్టసీత్కారమునుగావించి, రెండుబాతులనుచేర్చిపట్టుకొని నదీతీరమునువిడచి వెదురుపొదలలోదూరి యదృశ్యయయ్యెను. కాంతిచంద్రుఁడు వెనుకకుఁదిరిగిచూడఁగా తనసహచరుఁడొకఁడు తుపాకినొకదానిని, ఆబాతుల వైపు గురిపెట్టియుండుటనుగాంచెను. కాంతి వానివద్దకేగి తుపాకిని మలిపిపట్టుకొని యాయపూర్వపరిహాసకుని చెంపపై నొకబలమగు కరాఘాతమును బ్రసాదించెను.

ఆబాలిక యెవరో కనుగొనవలయునను తలంపుతో నాతఁడాబాలిక నిష్క్రమించిన వెదురుపొదలవద్దకు వెడలెను. అతఁ డాపొదలనొత్తిగించుకొని వెళ్లగా ఒకగృహస్థుని దొడ్డి యాతనికిఁ గన్పించినది. ఆదొడ్డిలో నొకవైపున పూరిఁగొకప్పిన ధాన్యపురాసులపంక్తియు, రెండవవైపున శుభ్రమైన యంకపశువుల శాలయుఁగలవు. పశువులశాల కానియున్న రేఁగుపొదవద్ద ఉదయమున తానుగాంచిన బాలిక యాసీనయై విచారముతో గాయపడిన బాతుయొక్క పచ్చనిముక్కునందు కొంతజలమునుబోయుటకు ప్రయత్నించుచుండెను. ఒక గోధుమవర్ణపుపిల్లి యామెయొడిలో పాదములుంచి, పక్షిపై నతిక్రోధముగఁ జూచుచు ముందుకు జరుగుచుండెను. ఆబాలిక మార్జాలచక్రవర్తితలపై ఆదరపూర్వకముగా చఱిచి దానిని యథాస్థలమునందుంచుచుండెను.

శాంతియుతముగనున్న అమధ్యాహ్నమునం దాగృహమేధి యావరణములోని యాదృశ్యము కాంతిచంద్రుని సున్నితహృదయమున బాగుగాహత్తుకొనెను. రేగుఆకుల మఱుగుననుండి సూర్యుఁడామెను మెల్లగా తొంగిచూచుచుండెను. కొంతదూరమునందొక యావు సుఖముగా నెమరువేయుచు, నిరంకుశముగా తనపై నధికారముచేయు యీగలను తోకతోఁ బరామర్శించుచుండెను. తూర్పుగాలి వెదురుపొదలఁ దోసికొని యతిమృదువుగా వీచుచుండెను. ఉదయమున నదీతీరమున వనదేవతవలె నగపడిన ఆబాలిక యానిశ్శబ్ద మధ్యాహ్నమున పవిత్రమైన గృహిణివలెనుండెను. కాంతిచంద్రుఁడు తనతుపాకితో నామె యెదుటికి వచ్చెను. బాతును గాయబఱిచినవాఁడను నేనుగావని యాతఁడు చెప్పనలఁచెను. అతఁడెట్లుచ్ఛరింపవలయునా యని యాలోచించుచుండగా లోపలినుండి "సుధా"యను పిలుపువినవచ్చెను. ఆబాలిక యెగిరినిలచెను. మఱల యాపిలుపేప తెంచినది "సుధా"యని. ఆమె తనబాతులను తీసుకొని పరుగెత్తివెళ్లిపోయినది. "సుధా". ఆహా! అన్వర్థనామధేయ గదా యీబాలిక అని కాంతిచంద్రుఁడనుకొనినాఁడు.

కాంతిచంద్రుఁడు తననావదగ్గరకువెళ్లి తుపాకినిపడవలోనివారికందిచ్చి, ఆయింటిసింహ ద్వారముదరికివెళ్లినాఁడు. అచ్చట మధ్యవయస్కుఁడగు సద్బ్రాహ్మణుండొకఁడు బల్లపై నాసీనుఁడై భక్తిరసప్రధానమగునొకగ్రంథమును జదువుచుండెను. ఆలోచనాపరుఁడగునాబ్రాహ్మణునివదనమున ఆబాలిక మొగమునందలి కోమలత్వముండుట కాంతిచంద్రుఁడుగాంచెను.

కాంతిచంద్రుఁ డాతనికి నమస్కారముగావించి "అయ్యా! కొంచెము మంచినీటికై మిమ్ముప్రార్థింపవచ్చునా?" అన్నాఁడు. అప్రౌఢబ్రాహ్మణుఁ డాతనినత్యాదరముతో బల్లపై నాసీనునిజేసి లోనికిఁజని యొకయిత్తడిపళ్లెములో కొన్ని భక్ష్యములును, కంచుకలశమున మంచితీర్థమును దెచ్చియిచ్చినాఁడు.

కాంతిచంద్రుఁడు భక్ష్యములనుతిని, మంచినీటిని త్రాగినవెనుక యాబ్రాహ్మణుఁడాతఁ డెవరైనది తెలుపుమనివేడినాఁడు. కాంతిచంద్రుఁడు తననామము, తనతండ్రిపేరు, విలా

నము కూడచెప్పి "నాకేదియైన పనిచెప్పినచో నేను చాల ధన్యుడనని భావించెదను" అని మామూలుగా పెద్దవాండనేగౌరవముతో నడిగినాండు.

"కుమారా! నీకు చెప్పవలసిన పనియేమియులేదు. కాని, యొక విషయమై నేనతి విషమావస్థలో జిక్కితిని." అని నవీనబెనర్జీ అన్నాండు.

"అదేమి" అని కాంతిచంద్రుండనెను.

"నాకుమార్తె సుధ వివాహయోగ్యయైనది. (ఆమె సుందరవదనమండలము జ్ఞప్తికి వచ్చుటచే కాంతిచంద్రుండించుకనవ్వుకొనెను.) ఆమె కనురూపవరుని కనుగొనలేకున్నాను. నేనామెకు వివాహమొనర్చినయెడల ఇహలోకమునందు నాబాధ నివారణమగును. కాని అనురూపవరుండెందునులేండు." అని నవీనబెనర్జీ నిట్టూర్చినాండు.

"మహాశయా! మీరు నావయందు నన్ను కలిసికొనినచో మీతనయ వివాహవిషయమై ముచ్చటింతము." అనిచెప్పుచు నాతనికి నమస్కారముగావించి కాంతిచంద్రుండు వెడలిపోయినాండు. అతండు తనపడవలోనివారిని కొందరిని ఆబాలిక వర్తనమరయుటకై గ్రామములోనికిపంపెను. వారిలో ప్రతియొక్కనివల్ల ఆబాలికయొక్కసౌందర్యము, సుగుణస్తోత్రము విని చాలసంతసించినాండు.

మఱునటిదినము బ్రాహ్మణుండు అన్నమాటప్రకారము కాంతిచంద్రునివద్దకు వచ్చినాండు. కాంతిచంద్రుండాతనికి సాష్టాంగనమస్కారముగావించి యాతనిపుత్రికను దనకొసంగుమని ప్రార్థించెను. కలనైనదలంచని యీసంగతినివిని బ్రాహ్మణుడుక్కిరిబిక్కిరియయినాడు. కాంతిచంద్రుండు సద్బ్రాహ్మణకుమారుండు మాత్రమేకాండు; స్థితిపరుండుకూడ; కావునసే ఆబ్రాహ్మణుండేమియు జవాబుచెప్పలేకపోయినాండు. అతండెట్టకేలకు "నీవు నాపుత్రికను వివాహమాడ గోరుచున్నావా?" అని యడిగినాండు.

"మీరామెను నాకిచ్చుట కనుగ్రహించినచో" అని కాంతి అనెను.

"సుధ. ఆమెసంగతియేనా నీవు చెప్పునది" అని యాతండనెను. —"అవును."

"అయితే, అయితే నీవు మొదట ఆమెను చూడకుండ—"

ఆమెను చూడలేదని దొంగవేషమువేయుటకై కాంతిచంద్రుండర్థోక్తిలో నిట్లనెను: "ఓహో! అదియా? 'శుభదర్శనదినమున' చూచెదను."

"నాసుధ చాలమంచిబిడ్డ. గృహకృత్యములయందు చాలనేర్పుగలది. నీవు నిష్కపటముగా గైకొనుచున్న నాపుత్రిక నిన్నెన్న డసంతుష్టిపఱుపకుండునుగాక; ఇదియే నాదీవెన" యని సంభ్రమముతో నెలుగురాల్పడ నావృద్ధుండుపలికెను.

కాంతిచంద్రుండు కాలయాపనకోర్వనందున వివాహము మాఘమాసమున జరుపునట్లేర్పాటు చేయబడెను. నిర్ణీతసమయమునకు కాంతిచంద్రుండు పెండ్లికొఱకై యేనుగుపై నెక్కివచ్చినాండు. మేళతాళములతో నుత్సవము ప్రారంభమయినది.

శుభదర్శనోత్సవానుకూలముగా దంపతులిరువురు రక్తవర్ణవస్త్రముచే గప్పబడినారు. వివిధాభరణాలంకృతయై, లజ్జాభరమున మస్తకము వాల్చియున్న యాబాలిక, నదీతీరమునందగుపడిన బాలికవలె లేనట్లాతనికిఁదోచెను. వివాహము యథాశాస్త్రీయముగా ముగిసిన వెనుక ఆవివాహమంటపమునందున్న స్త్రీలలో నొకవృద్ధురాలీవలికే తెంచి పెండ్లికుమార్తె తలపైనున్న ముసుగుతీసివేయుమని కాంతిచంద్రునితోఁ జెప్పినది. అతఁడట్లుచేసి యాబాలిక కోమలవదనమండలము వైపుచూచి, తత్క్షణమే యసహ్యముతో వెనుకకుజరిగినాఁడు. నదీతీరమున తానుగాంచిన సహజసౌందర్యసుశోభితబాలికామణి కాదామె. జరిగిన ఈమోసమున కాతనిమనస్సున కలవరపాటుదయించినది. వివాహమంటపమునందలి శోభాయమానములగు దీపికలకాంతి వెలవెలబోవుచున్నట్లాతనికిఁదోచినది.

మొదట అతనికి మామగారిపైఁబట్టజాలనికోపమువచ్చినది. ముసలినక్క నాకొకపిల్లను జూపి వేఱొకపిల్లనుముడిపెట్టినాఁడని; కాని కొంతసేపటికి అవృద్ధుఁడెవ్వరినిచూపించలేదనియు నిదియంతయు స్వయంకృతాపరాధమనియు జ్ఞాపకమువచ్చినది. అతఁడు తనకలవరపాటెవ్వరికిని దెలియకుండ నెప్పటిస్థలమున నాసీనుఁడై యుత్సవమునందు పాల్గొన్నాడు.

అతఁడామెను కాదనిత్రోసివేయతగదు. తప్పక యామధురసుధ నాస్వాదించితీరవలెను. హాతాశుండగు నాతని కాస్త్రీలపరిహాసవచనములు రుచించకుండుటచే చిరచిరలాడ మొదలు పెట్టినాడు.

ముత్తయిదువుల పాటలతోడను, యువతీమణులపరిహాసములతోడను ఒకగంట గడచినది. ఒక కుందేలుపిల్ల దుముకుచువచ్చి వధువుయొక్క పాదములవద్ద కూర్చున్నది. దాని వెనుకనే కాంతిచంద్రునినయనానందతారకయగు బాలికయే తెంచి, ఆకుందేలును చేతగైకొని అత్యాదరముతో దానిని నిమురజొచ్చెను. "పిచ్చిపిల్ల, మూగపిల్ల" అని యామందిరమందలి యువతులందరు నామెను వెలికిఁబొమ్మని సంజ్ఞచేసిరి. ఆమెవారిని లక్ష్యపెట్టక, వధూవరుల యెదుట నిర్లక్ష్యముగా నాసీనయై, బాలికాజనోచితచాపల్యముతో వారివదనములవైపు చూడనారంభించెను. ఒక సేవకురాలరుదెంచి యామెను వెలికిఁగొనిపోవఁబ్రయత్నించెను. "ఆమె నచటనేయుండనిమ్ము." అని కాంతిచంద్రుఁడాదాసి నతిగాంభీర్యముతో నాజ్ఞాపించెను. "నీపేరేమి?" అని యాతఁడాదాసి వెడలిపోయినతరువాత నాబాలికను బ్రశ్నించెను. ఆమె వెనుకముందులకూగుటతప్ప జవాబీయలేదు.

కాంతి మరల ప్రశ్నించెను. "నీ రెండు బాతుపిల్లలు యెదిగినవా?" అని.

ఆబాలిక వెనుకటివలె నిర్లక్ష్యముగాఁ జూచుటతప్ప జవాబుచెప్పలేదు.

విఫలప్రయత్నుఁడగు కాంతిచంద్రుఁడు మరల ఆమె గాయపడిన బాతునుగురించి మృదువుగా ప్రశ్నించెను. జవాబులేదు; కాని యువతీమణుల హాసధ్వనులచే నామందిరము కంపించిపోయెను.



వియన్నాలో జరిగిన అంతర్జాతీయస్త్రీలమహాసభకు వెడలిన భారతస్త్రీప్రతినిధులు

*Courtesy of Women's Indian Association, Madras.*



ప్రథమ అఖిల ఆశియా స్త్రీల సభ ప్రతినిధురాండ్రు

*Courtesy of Women's Indian Association, Madras.*

ఆబాలిక మూగయనియు, బధిరయనియు, వన్యమృగములసహచరియనియు కాంతిచంద్రుఁడు తెలిసికొనెను. విధివశమున నామె "సుధా"యను పిలుపు వినవచ్చినసమయమున లేచిపోవుట తటస్థించినది. కాని యామెపే రదికాదు.

కాంతిచంద్రుని కనులయెదుటినుండి నల్లని తెరయెత్తివేయబడినట్లయినది. విపదంధకారమునుండి విడివడిన ట్లాతఁ డొకనిట్టూర్పువిడిచి భార్యవదనమువైపు తేరిచూచెను. అదియే యాతనికి నిజమైన శుభదర్శనసమయమయ్యెను. దీపకాంతిసాహాయ్యమున భార్యసుందరవదనపద్మమున నవీనబెనర్జీ దీవెన సఫలమగు సూచనలను కాంతిచంద్రుఁడు గాంచెను.

—రవీంద్రునకనువాదము.

## అనాథబాల

అంబటిపూడి నరసింహశర్మగారు

సీ. కంటిపూసలచేత గంటుబెట్టితివిగా తెలిముత్తెములలోని జిలుగువెలుగు
నిట్టూర్పుగాడ్పుల నీసడించితివిగా మొగలిరేకులలోని సొగసుమిసిమి
వెలిబెట్టితివిగదా తళుకుమేన్నిలుపక అలరుపానుపులోన నలరునుకము
చిన్నబుచ్చితివిగా కన్నులమూయక కలువకన్నెలమహోజ్జ్వలపుకలిమి
చివురు లవిసిపోయె చెదరెచుక్కలరాజు
పవడమువడదాకి పగిలిపోయె
పర్వతములుప్రీలె పైడిచుక్కలురాలె
నాథిగ్రుంగకుము అనాథబాల!

ఉ. నీచనురోక్తికామృతధునీరసవీచులనోలలాడగా
నోచనిదీప్రపంచము, గుణోజ్జ్వలరూపవిశేషదీప్తిచే
పూచినమల్లెపందిరినిబోలిన నీనవయౌవనప్రభా
రోచులు నీయభాగ్యమునగ్రుంకె యనాథరో! రూపుమాసెడిఁ.

సీ. పద్మరాగప్రభాపాటలమ్మొడగూర్చు రక్తవిద్రుమలసద్రక్తిమమ్ము
నీలంపురాతళ్కు గీలించువిరివిగ నీలాంబుదప్రభాజాలకమ్ము
హేమకట్టిచుపుమేల్లోములగడియించు పసుపువన్నియతీవమిసిమిదనము
అమృతధారాప్రవాహముల దేలించు నీసరసార్థమొలుకువచఃప్రవృత్తి
వెన్నెలలగాయుపూర్ణిమావిధునికాంతి
సతతమూరించునెనర నీచక్కదనము
అన్నియున్న వికాని యోయనద! నీదు
సొగసుసంపద కానసజ్యోత్స్నయయ్యె.

# అఖిలాసియామహిళామహాసభ

శ్రీమతి కోకాభానుమతిగారు

అఖిలాసియామహిళామహాసభ యాసియాఖండమందున్న దేశములకు పరస్పరసంఘీభావమేర్పడుటకు, తన్మూలమున ప్రపంచమంగు శాంతికల్గుటకును స్థాపింపబడినది. ఈమహాసభాస్థాపకులొనర్చిన యీకార్యము ప్రశంసనీయము. ప్రపంచమందలి గొప్పనగరములన్నియుజూచి, జెనీవానగరమందు పరస్పరజాతీయసమస్యల బాగుగవిమర్శించి, యాసియాతీరమందున్న పట్టణములందున్న నాయకురాండ్ర సందర్శించి, విశేషకృషిసల్పి వార్తాపత్రికలమూలమునే; తదితరరీతుల, ప్రయాణక్లేశమునకోర్చి, యీ మహాసభను జయప్రదముగ నిర్వహించిరి. ఈసభలాహోరునగరమందు 19-1-31 తేదీని ప్రారంభమైనది. 24-వ తేదీని ముగిసినది. ఈసభ జరుగుటకుముందాహ్వానపత్రికలు ముప్పదిభాషలలో ముద్రించి, యాసియాఖండమందున్న దేశములకంపిరి. అన్నిదేశములనుండి ప్రతినిధురాండ్రు ప్రయాణక్లేశమునకోర్చి, ధనవ్యయము లెక్కసేయక విచ్చేసిరి. జపాను, జావా, బర్మా, సింహళము, చీనా మొదలగు దేశములనుండి సతీమణులీసభకు విచ్చేసిరి. 17-1-31 తేదీవరకు పనులన్నియు క్రమముగజరిగెను. ప్రథమమున ఈసభపురమందిరమున జరుపుట కేర్పరచిరి. కాని యీభవనము చాలదనుభయముకలిగెను. వ్యవధికొంచెమగుటచే పెద్దడేరావేసి తగురీతిదర్బారువలె యలంకారముచేయ ప్రారంభించిరి. ఈసభాస్థాపకవర్గపు కార్యదర్శియగు శేఫీసతిగారు సకాలమునపని పూర్తిజేసిరి. ఈమె మహమ్మదీయకాంత. ఈమెసామర్థ్యము, కార్యనిర్వాహకశక్తి స్వతస్సిద్ధములు. 19-1-31 తేదీనాటికి డేరా యలంకారములతో, పచ్చనితోరణములతో, పూలకుండ్లతో వింతగొల్పునట్లుశృంగారించిరి. ఒకప్రక్క వేదికనమర్చిరి. ఈవేదికవెనుక ఎర్రనిఖద్దరుబట్టలతో కుట్టినస్వాగతము "భారతదేశము మీకొసగుస్వాగతము" **(Welcome from India)** అని కుట్టినబట్టవ్రేలాడగట్టిరి. వేదికపై యధ్యక్షురాలికిని, ప్రతినిధురాండ్రకును యాసనములమర్చబడినవి. మిగిలినప్రేక్షకులకు వేరువేరుగ ఆసనములు దిగువనమర్చిరి.

సభాప్రారంభమునకుముందు వివిధదేశపు ప్రతినిధురాండ్రకు స్వాగతమొసంగుటకు, లాహోరునగరమందలి యాహ్వానసంఘసభ్యురాండ్రుద్వారముచెంత వేచియుండిరి. ప్రతినిధురాండ్రు వచ్చినతోడనే వారికి స్వాగతమొసంగి వేదికపైకిగొంపోయిరి. ఈప్రతినిధురాండ్రలో మాండీరాణీగారు, బాండర్నాయకుసతిగారు, రాజవాడిరాణీగారు మొదలగువారుగలరు. కపూర్థలామహారాణిగారాహ్వానసంఘాధ్యక్షురాలు.

ఈమహాసభాధ్యక్షతకు శ్రీమతి సరోజినీదేవిగారు తగినవారనియు, పిమ్మట ప్రతిదేశపుప్రతినిధురాండ్రలో నాయకురాండ్ర కుపాధ్యక్షతనొసంగవలయుననియు, నూరుఅమ్మాదాసతీమణి సలహానిచ్చిరి. ఈమెగత జూన్ నెలలో డెమాస్కసు నగరమందుజరిగిన అరబిక్ ఓరియంటల్ స్త్రీసభాధ్యక్షురాలు. సరోజినీదేవిగారాంగ్లవిద్యాప్రవీణురాలు. ఆంగ్లకవిత్వమం దత్యంతపాండిత్యముకలవారు. **(Nightingale of India)** అను బిరుదముబడసిరి. పాశ్చాత్యదేశపర్యటనమొనర్చి హైందవస్త్రీసామర్థ్యమును ప్రపంచమునకు వెల్లడిజేసిరి. అపారమగుదేశసేవనొనర్చిన సతీమణి. ఈవిదుషీమణి ఆనాటికి కారాగారమందుండియున్నను ఈమెయే యగ్రాసనాధిపురాలుగ నెన్నుకొనబడెను. ఆసమయమందామెలేనందున సభజరిగిన యారుదినము లందును యార్గురు ఉపాధ్యక్షురాండ్రధ్యక్షతవహించిరి.

బండర్నాయకుసతిగారు 19 వ తేదీని, బర్మాప్రతినిధురాలు మికొంగుకన్యగారు 20 వ తేదీని, జపానుదేశీయురాలగు హోషిగారు 21 వ తేదీని, ఆఫ్గనిస్థానమునుండివచ్చిన కమలాఉద్దీన్ గారు 22 వ తేదీని, మదరాసు ప్రతినిధురాలగు డాక్టరు ముత్తులక్ష్మిరెడ్డిగారు 23 వ తేదీని, పెరిషియానుండివచ్చిన ఫాజీదారు సతిగారు 24 వ తేదీని యధ్యక్షతవహించుట కేర్పరచిరి.

వేదికపైనున్న నానాదేశపుస్త్రీలు తమదేశాచారముగలదుస్తులు దాల్చి జూచుటకెంతయు వింత గొల్పుచుండిరి. సింహళద్వీపమునుండి పదిమందిప్రతినిధురాండ్రు విచ్చేసిరి. వారిరాక, పూర్వము సీత లంక నుండి తిరిగివచ్చినవెనుక యెంతయానందముకల్గెనో యంతయానందముకల్గించెను. మిగులపచ్చగా సమర్పబడిన సిగలతో సింహళపువారొకదెస, నడినెత్తినమర్పబడి పూలతో నిండిన కొప్పులతో బర్మావారొకదెస, పెరిషియా ఆఫ్‌గన్ స్త్రీలొకదెస, హిందూదేశమందన్నిపరగణాలనుండివచ్చిన ప్రతినిధురాండ్రును వేదిక నలంకరించిరి.

సభాప్రారంభమున శ్రీమతి పి. కె. సేనుసతిగారు వేదశ్లోకమొకటిపఠించిరి. పిమ్మట కపూర్తలామహారాణిగారి కుమార్తె గంభీరస్వాగతోపన్యాసమును జదివిరి. రాజవీడురాణీగా రీసభయుత్పత్తినిగూర్చియు, యాశయములగూర్చియు, కార్యక్రమమునుగూర్చియు నివేదికచదివిరి. ఇందుప్రతిఖండపు ప్రత్యేకసహజస్థితిని గూర్చియు, పరస్పరజాతీయభేదములున్ననూ, ఆసియాఖండమందలి వివిధభాషాపరిజ్ఞానమునకున్న సంబంధమునుగూర్చియు, ఈమహాసభకువచ్చిన ధనసాహాయ్యమునుగూర్చియు, ఆసియాఖండమందంతయు ఈసభాస్థాపకులుసల్పిన ప్రచారమునుగూర్చియు ముచ్చటించిరి. ఈయు తమకార్యభారమును మెచ్చి స్త్రీసమాజములు లేనిచోట్ల ఈమహాసభ్యావ్యాప్తికై యిట్టి సమాజముల నేర్పరచుటకు పురుషులుపూనుకొనిరి. డాహటాకన్యగారు "బుద్ధుడీసభను దీవించుగాక" యనిరి.

షిరీన్ ఫవుజ్‌దారు సతిగారు, శాంతినికేతనమందు సంస్కృతమభ్యసించుచున్న జపానుయువతి, జావా నుండివచ్చిన యుపాధ్యాయురాలును యీమహాసభయందుప్రసంగించిరి. డాక్టరు ముత్తులక్ష్మిరెడ్డిగారు ద్రవిడమందును, యాంగ్లమందును గంభీరోపన్యాసములుగావించిరి. చీనానుండి మహాకవిల్యూయా, హాన్‌గారు యీమహాసభకు విచ్చేసిరి. ప్రపంచమునుండి సంగ్రామపిశాచమును పారదోలి శాంతినెలకొల్పుట కీమహాసభ యావశ్యకమని వీరిమతము. అంత్యమున రవీంద్రనాథటాగూరుగారి జాతీయగీతము చదివిరి. ఈసభకురాజాలని వారనేకులు తమ సానుభూతిని దెల్పుచులేఖలను, తంతెలనుబంపిరి. తిరువాన్కూరుమహారాణీగారు తమ సానుభూతినిదెల్పుచు తంతెనంపి రూ 500 లు విరాళమొసంగిరి. పండిత మదనమోహనమాళవ్యాగారీమహాసభ స్త్రీసమాజముల దేశమందెల్లయెడల వ్యాపింపజేసి, స్త్రీజనాభివృద్ధిగావించి ప్రపంచశాంతి నెలకొల్పగలదని లేఖనంపిరి. ఇంటరునేషనల్ లీగ్ ఆఫ్ విమెన్ ఫర్ పీస్ అండు ఫ్రీడంవారు (International League of Women for Peace and Freedom) జినీవానుండియు, ఈజిప్టునుండి జూయిష్ విమెన్స్ లీగ్ ఫర్ యీక్వల్ రైట్సు యిన్‌జరూసిలం (Jewish Women's League for Equal Rights in Jerusalem) వారును, జపానునుండి విమెన్సుకమిటీ ఫర్ యింటర్‌నేషనల్ రిలేషన్స్ (Women's Committee for International Relations) వారును, అరేబియాస్త్రీమహాసభాధ్యక్షురాలగు నూర్ అహమ్మదాగారును, సిరియానుండి నాసిల్, ఆబీద్ బియా బెరూత్ గారును, మన్సూర్ అవ్‌హారుగారును తమ సానుభూతినిదెల్పుచు లేఖలనంపిరి. ప్రొఫెసరు శేషాద్రి, రాధాకృష్ణన్‌గార్లు యీసభను శ్లాఘించిరి. పురపాలకసంఘమువారీసభకు మిక్కిలి తోడ్పడిరి. ఈసందర్భమున International Women's Committee on the Nationality of Married Women వారితరఫున ఆలిస్‌పాలుగారు వివాహాంతరమున అమెరికాలో స్త్రీలుతమజాతీయతమార్పుపొందకుండునట్లుఅమెరికామహాశాసనసభకుసలహానిమ్మని("League of Nations") లీగ్ ఆఫ్ నేషన్స్ వారినికోరుచు, తమకై కూడ పాటుపడవలసినదిగా అఖిలాసియామహిళామహాసభవారిని కోరిరి. అందులకీసభవారు తలయూపిరి. ఈమహాసభ ప్రారంభమునుండియు జయప్రదముగజరిగినది. తుదకు 24-2-31 తేదీని యీసభ ముగిసెను.

# గ్రీష్మ ఋతువు

**వైద్యవిద్వాన్ గాధిరాజు కోటంరాజుగారు**

సకలజనహృదయంగమంబై విమలదిగ్భాగవిరాజమానంబై కోకిలాళికులమనోహరకూజితసంకులంబై యలరారు వసంతదివసంబులు గతించినవి. గ్రీష్మ ఋతువు ప్రవేశించినది. జ్యేష్ఠఆషాఢమాసములు గ్రీష్మ ఋతువు. ఈఋతువుతో ఆదానకాలమంతమగును. శిశిరవసంతగ్రీష్మ ఋతువులుమూడును చేరియుండు ఉత్తరాయణకాలమారుమాసములును ఆదానకాలమనబడును. ఆదానకాలమనగా లాగివేయుట. వాతాతపంబు లీయారుమాసములందును క్రమక్రమముగ దేహులదేహంబులయందుండు బలంబును, భూమండలమందలి స్నేహంబును లాగివేయుచుండును. అందిది కడపటిదగుటచే ఆదానధరమిప్పుడు సంపూర్ణమై విరాజిల్లును. గ్రీష్మ ఋతువున ఋతుధర్మములువ్యత్యస్తములుకాక జరుగునేని ఇక్కాలమున సూర్యుడతితీక్ష్ణుండై తనకరంబులసాచి జగంబులయందలి జలంబుల నాపరింపుచుండును. నైరృతిదిశనుండి అసాఖ్యమగుగాలి వీచుచుండును. తీక్ష్ణమగు యెండయు, తాపమగుగాలియు చేరివ్యాపించియుండుటచే భూమియు, దిక్కులును తగులబడుచుండువట్లుండును. ఈస్థితియందు, జీవజాలమంతయు మంటమగ్గినట్లుండును. ఆకాశమున నల్లయగిశపూవువలె నీలమైయుండును. ఎండివేడిమికి తాళజాలక మహిషంబులును, గజంబులును, పందులును ఇట్టియానూపజంతువులన్నియు నిప్పులంబోలు సూర్యకిరణంబులచే క్షీణించితగ్గియుండు నదులయొక్కయు, తటాకములయొక్కయు జలంబులలంబడి కలచి వానిని దరులకెగబట్టుచుండును.

చాతకములు వర్షపుజాడలులేమి నిరాశచే విభ్రాంతములైయుండును. దుప్పులుమున్నగునవి దప్పికాగలేక జలంబులు వెదకికొనుచు దిక్కులవెంట బరువులెత్తుచుండును. తీగెలును, పొదలును, చెట్లును, ఆకులురాలియు యెండియుతగ్గిపోవుటచే నీడలనీయంజాలక శూన్యములుగ నగుపడుచుండును. భూమిపైపచ్చికయంతయు నెండిపోవును. పాంథులు వడతగిలి డస్సిపోవుచుందురు. కుటుంబీకులిండ్లకడ పగలుఎండకును, రాత్రి ఉక్కకును తాళజాలక ఆరాటమందుచుందురు. శిశువులు వడదెబ్బకు కినలికసిమసంగి యసువులు విడుచుచుందురు. కీటకాదిక్షుద్రజంతువులు యెండకుమాడి చచ్చుచుండును. ఇట్లుజగమంతయు భయానకంబుగ జూపట్టుచుండును. గడిచినఋతువు యెంతయు సుఖవంతముగను, ఆనందదాయకముగను చేసి వెంటనే ఇట్టికష్టమగుకాలమును కలుగజేసిన జగత్స్రష్టయుద్దేశమేమి? జగత్ప్రభువు పట్టికఠినచిత్తుడుకాడు. అతడు దయామయుడు. ప్రజలను, జీవరాసులను తండ్రిపుత్రులంబోలె అతివాత్సల్యంబునవీక్షించువాడు. అట్టికరుణాసాంద్రుడు జగత్తుమేలునకే ఇట్టినిదాఘంబును నిర్మించెను. వర్షాశరద్ధేమంతంబులయందు కాలస్వభావమునుబట్టి క్రమక్రమముగ జీవులదేహంబుల కఫధాతువుచేరుకొనును. ఇట్లు పుష్యమాసాంతమువరకు దేహులదేహంబులచేరుకొని ఘనీభవించియుండు శ్లేష్మము క్రమక్రమముగ కరిగిపోవలయును. అట్లుపోదేని కఫభయముచే, దేహములు జడములై అనేకరీతులబాధల నందవలసియుండును. అందుచే అట్టికఫము శిశిరఋతువున కరగుటకుప్రక్రమించి వసంతంబున పూర్తిగకరిగి గ్రీష్మంబున హరించిపోవును. గ్రీష్మంబున యిట్టి తీక్ష్ణంబులగు యెండలును, వేడియగుగాడ్పులును కలుగకపోయినయెడల అంతకుమునుపు దేహుల శరీరంబులపేరుకుని వసంతపుటెండలచేకరిగి శరీరములయందు వ్యాపించియుండు కఫధాతువు హరించిపోకుండును. అవి హరించిపోకుండిన కలుగుకఫసంబంధమైన వ్యాధులు వసంతఋతువర్ణనాసందర్భమున చెప్పబడినవి. అట్టివ్యాధులచే లోకులు బాధలనందకుండుటకే దయామయుడగు నాపరాత్పరు డీకఠినమగు నిదాఘమును నిర్మించెను. ఇట్టి నిదాఘమసమయంబున కాయుచు వీచుచుండు యుగ్రనియెండలకును, వెచ్చనిగాడ్పులకును ఓషధులును,

జలములును కాగి ఆరి నిస్సారములై మిక్కిలి తేలికలైనవగును. మనదేహంబులయందును, కాగి ఆరిపోయి జలసంబంధధాతువగు కఫము తగ్గిపోవుటచే నాడులును ఆశయములును శూన్యములైయుండును. ఇట్లుకఫము క్షీణించియుండుటచే శూన్యమైయుండు మనదేహమున రూక్షములుగను, లఘువులుగను, విశదములుగను నుండు ఓషధులను, జలములను అన్నపానములుగ నుపయోగించుకొనుచుండుటవలనను రూక్షలఘువిశదగుణయుక్తమును శూన్యప్రదేశమున చేరుస్వభావముకలిగినదియు నగువాతము చేరుకొనును. ఇట్లీఋతువున దేహుల దేహంబుల కఫము క్షీణమునందును, వాతము వృద్ధినొందును. ఇట్లు కలుగు వాతసంచయమువలనను, యెండలవలనను, గాడ్పులవలనను, దౌర్బల్యమువలనను మనదేహంబులకు బాధలుకలుగకుండునట్లు మన మీఋతువున ఆహారాచారవిహారముల నేర్పరచుకొని జాగ్రత్తగ మెలంగవలసియుండును.

ఈ ఋతువున తీయగను, చల్లగను, ద్రవముగను, స్నిగ్ధముగనుఉండు అన్నపానముల నుపయోగించవలయును. మల్లెపూవులవలె తెల్లగనుండు వరియన్నమును, జాంగలజంతువులమాంసరసములను, కాచినపాలను, పంచదారను భోజనమున నుపయోగించవలయును. నేయికలిపిన వేడిలేనియన్నమును మిక్కిలి చిక్కగనుండని మాంసరసములను భుజింపవలయును. క్రొత్తకుండయందు పనసచిగుళ్లను, అరటిచిగురుటాకులును వేసియుంచబడిన పంచసారపానకమును, రాగమును, ఖాడవమును, రసాలమును, మంథమును, పేయములుగ వాడవలయును. పచ్చకర్పూరమును పాటలపుష్పములువేసి సుగంధమై చల్లగనుండునీటిని త్రాగుటకు ఉపయోగించవలయును.

రాత్రులయందు కర్పూరనాడికలను భక్షించి పంచదారవేసిన గేదపాలను చంద్రకిరణములయందును, నక్షత్రకిరణములయందునునుంచి చల్లగజేసి త్రాగవలయును. వేడినివృద్ధిచేయు కారము, పులుసు, ఉప్పు, అనురుచులుగలవస్తువులను వేడిచేయు ఇతరవస్తువులను భుజింపరాదు. పగలుయెండవేళల చల్లనిగృహప్రదేశములయందును రాత్రులయందు చంద్రకిరణములచే చల్లనై యెత్తుగ మంచిగాలివీచుచునుండు డాబాలపైనను నిద్రింపవలయును. ఈ ఋతువున పగటినిద్రనిషిద్ధముకాదు. రాత్రులయందు యెత్తగుప్రదేశమున నిద్రింపకున్న భూమినుండి లేచువేడియావిరివలన ననారోగ్యముకలుగును. సాయంకాలము చల్లని సరస్సులయందును, మడుగులయందును, దిగుడుభావులయందును దిగి స్నానముచేసి గంధమునలదికొని కమలములు, కలువలు, మల్లెలుమున్నగు నీకాలపుపూవులముడిచి మనోహరములగు తోటలయందు విహరింపుచు, విసెనకర్రలతో విసరుకొనుచు వేడిమినుండి కాపాడుకొనవలయును. సన్ననివస్త్రముల ధరింపదగును. శ్రమను, వ్యాయామమును, సూర్యకిరణములను పూర్తిగవిడువవలయును. ఇట్లీఋతువున చల్లని ఆహారవిహారముల నుపయోగింపదగును. ఎక్కువ అవసరముకలిగిననే తప్ప వమనవిరేచనాదిశోధనముల నీఋతువున చేయరాదు. మద్యముల నీఋతువున సేవింపరాదు. ఏకారణముచేనైనను పుచ్చుకొనవలసివచ్చెనేని మిగులయెక్కువగ నీరుచేర్చిపుచ్చుకొనవలయును. అటుగానిచో సంజుమున్నగు వ్యాధులుకలుగును.

తరుచుగా గ్రీష్మఋతుమధ్యమున మృగశిరకార్తి ప్రవేశించును. మృగశిరకార్తి ప్రవేశించినంతనే కాలముచల్లబడి గ్రీష్మముతగ్గునని ఆంధ్రదేశవ్యాప్తమైన అభిప్రాయమైయున్నది. తఱచుగా అట్లుసంభవముగుటయుకలదు. ఒక్కొక్కప్పుడు మృగశిరకార్తి ప్రవేశించినను ఎండలు తీక్ష్ణముగ కాయుచుండును. కావున సందర్భముల నెరింగి గ్రీష్మఋతువుపద్ధతుల గమనించి ఆంధ్రులు యథోచితప్రవర్తనము నవలంబించి సుఖింపగోరుచున్నాను. ఋతుచర్యాపద్ధతులను ఆయుర్వేదశాస్త్రానుసారముగ నిర్వహించుచో మానవుని ఆరోగ్యము చెడుటకు అవకాశములు తక్కువగనుండును.

# బడికంపుట

కల్లూరి వెంకటసుబ్రహ్మణ్యదీక్షితులుగారు

'ఓం నమో'యనిమొదలిడి రోజులప్పు
డక్షరాభ్యాసమొనరించియర్భకునకు
'తండ్రీ! బడికేగరా'యను దల్లి కపట
వచనమపుడర్థవంతమై పరుషమయ్యె.
అక్కునంజేర్చి లాలించి చిక్కువాపి
మొగమునంగ్రాలు ముంగురుల్ మొనయు
పైటచెఱఁగొత్తి కరపల్లవమున నెత్తిదువ్వి
బాలచంద్రునిఁదూలించి ఫాలమందుఁ
జుక్కవెట్టి కుమారుని సోయగంబు
తెప్పవాల్పక మోరఁగా నొప్పులొలుకు
వాలుఁజూపులఁదిలకించి జాలిగురిసి
ప్రకృతిసంబంధబాంధవ్యపదవిబాసి
అరనిముసమట్టెనిలచె నాయమ్మ 'దిష్టి
తగిలెనో'యని లోలోన వగచెనేమొ?
'నాయనా! వేగబడికిఁబో; నాన్నగారు
కొట్టుదురు బాబు! లేకున్నఁ? గుఱ్ఱలరుగొ
పోవుచున్నారు వారితోఁ బోయిరార!
తాయిలము వెట్టెదనుర, నాతండ్రి!నీకు.'
అనుచు నేమేమొ నయముభయంబుగదుర
నాడుమాటలువినియు మాటాడవెఱచి
నటులనటియించు బాలకునడుఁగడుగునఁ
గడపినడిపించుకొని యొడల్ బడలికఁగొనఁ
జెక్కుటద్దంబులం జెఱుచెమటలొలయ
లాగుచొక్కాయి వెదకి యలంకరించి
చేయినిండఁగఁదీపిమిఠాయి వెట్టి
యీడుజోడైన జతగాండ్ర తోడుగూర్చి
పలకబలపంబునందిచ్చి పదపదమని
వీథిగుమ్మముదాక వెన్వెంటనేగి
మఱలఁబోనెంచిబిడ్డను మఱలిచూచె.
కదలనేలేదు నిల్చినపదవినుండి
అతఁడువచ్చిన ముఖమెత్తనె నలేదు.
తల్లిముఖమందుఁదోఁచుక్రోధానురాగ
చటులసమ్మిశ్రభావసూచకములైన
తీక్ష్ణసౌమ్యస్వభావదీధితులభేద
మరయునాతనివాల్జూపు మరలలేదు.
మారువలుకండు;-నట్టికుమారుఁగాంచి
చుఱుకు,చూపుల;మాటలఁ, గఱకుఁదనము
నచ్చువడఁదల్లి లోలోన నలుకఁజెంది;
'అడుఁగు కదలించుటబ్బురమయ్యెనొర!
అనవిదేమిర పోడు, పో, ననెడిమాట
రమ్మురమ్మను దోడికుఱ్ఱలనువిసివి
కసరుకొనెదేర?'యనియొక్క కసరుగసరె.
బాలుబాలారుణప్రభాప్రచురమైన
చిన్ని మోమంతనిముసానఁ జిన్నవోయె
చెన్నలరు నధరబింబంబుచెంత మొలక
లీనులేనవ్వు లెచటనో లీనమయ్యె
కలువరేకులఁబోలుకన్గొలఁకులందు
నింకుకొనిజాలుగానునుగండఫలక
ములనుదిగఁజారె నశ్రుధారలప్రవాహ
మామెహృదయంబుకరఁగి నీరై స్రవించె
కరుణరసమూర్తి అంత సాక్షాత్కరించె.

# నవనాగరిక నగరజీవనం

పాలపర్తి ఆంజనేయులు గారు

౧

అప్పి:—మామ్మగారూ! అబ్బాయిగారు ఊరికే గిలగిలకొట్టుకొని యేడుస్తున్నారండీ.

ముసలమ్మ:—(లోపలినుండి) ఆకలైందోమో వే!

అప్పి:—అమ్మగారు క్లబ్బుకువెళ్లకముందు పాలుపట్టమన్నారు; పట్టేను. పిప్పరమెంటుబిళ్లలు, బిస్కెటులు యేడిస్తేపెట్టమన్నారు; అవీపెట్టేను. మళ్లీయిప్పుడు పాలుకలిపిపట్టేను. ఒకగుక్కెడునాగి, మరి పీకనోట్లోపెట్టుకోలేదు.

ముసలమ్మ:—అయ్యో! అయ్యో! అంతగుక్కపట్టి యేడుస్తున్నాడేమో! నేనేంచేతునే...ఇల్లా తేవే...పిల్లవాడ్ని......క్రింద దింపవే—ఘుట్టుకోకే. (పిల్లవాడిని చేతిలోనికితీసికొని) ఏం! బాబూ! ఏం! నాయనా! ఎందుకూ! ఎందుకూ! (అని ఎంతసముదాయించినా పిల్లవాడు ఊరుకోలేదు) అయ్యో, చేతుల్లో నిలవడంలేదే! కడుపులోనొప్పో; ఏంకర్మమో! ......ఆమెదార్ని ఆమెవెళ్లింది. ఆయనదార్ని ఆయన వెళ్లేడు. ఇంట్లోముసలిముండను నేనేంచేసేది?

సీతమ్మ (పొరుగింటిఇల్లాలు):—అవ్వగారూ! పిల్లవాడు ఎందుకండీ అల్లాయేడుస్తున్నాడూ?

ముసలమ్మ:—ఎందుకో గుక్కతిరక్కుండా ఏడుస్తున్నాడు! ఎంతపట్టుకున్నా ఆగటంలేదు.

సీతమ్మ:—తల్లి లేదూ, ఇంట్లో?

అప్పి:—అమ్మగారు క్లబ్బుకు వెళ్లేరండీ.

సీతమ్మ:—(ముసలమ్మదగ్గరకువచ్చి) నా చేతికివ్వండి. (పొట్టపట్టిచూచి)......కడుపు ఉబ్బరము చేసినట్లున్నదండీ. కాపడంకాస్తే నొప్పితగ్గుతుంది.

ముసలమ్మ:—నీకడుపుచల్లంగా కాస్తచూడమ్మా. మాదంతా అగచాట్లమారికాపురంగా ఉంది.

సీతమ్మ:—గరిటెతో కొంచెమునిప్పు, ఆముదం తీసికరాండీ.........ఇదిగో, అప్పి! నీవువెళ్లి అమ్మగారిని పిలుచుకొనిరా.

ముసలమ్మ:—ఇదిగో, నిప్పు. ఆముదం ఎక్కడుందో, ఏమిటో?

సీతమ్మ:—మాఇంట్లోఉంది మాఅత్తగారిని అడగండి ఇస్తుంది.

ముసలమ్మ:—.........ఇదిగోనమ్మ ఆముదము.

సీతమ్మ:—[పిల్లవాడ్ని కాళ్లమీదపరుండబెట్టుకొని గట్టిగాపట్టుకొని ఆముదము చేతికిరాచుకొని, నిప్పుమీద చేయివెచ్చచేసి పిల్లవాడిపొట్టమీద కాచుచున్నది.]

ముసలమ్మ:—ఇదేంకాలం వచ్చిందమ్మ! పిల్లలుమేకలుఅని ఏమైనాశ్రద్ధఉన్నదా?

సీతమ్మ:—ఏదో, మీరుపెద్దలు కనిపెట్టేవారు ఉన్నారుగదా అని ఆమైనావెళ్లిందిగాని లేకపోతే విడిచిపెట్టిపోతుందా.

ముసలమ్మ:—ఏంపెద్దలో! ఏంపెంకెలో! నేనుపొయ్యిదగ్గర యేడవనా? పిల్లవాడ్నిచూడనా?

సీతమ్మ:—ఆమె ఈపాటికివస్తూండాలి.

ముసలమ్మ:—ఆఁ. వస్తుంది; రాకేం. కాదండి, పసిబిడ్డతల్లి ఈప్రకారంగా క్లబ్బులని మీటింగులని ఇల్లు, సంసారం పట్టకుండా తిరిగితే ఏలాగండి? మేము ఈలాగేపెంచేమా పిల్లల్ని.

సీతమ్మ:—కాలంఎప్పుడూ ఒక్కలాగా స్తిరంగాఉంటుందండీ, మామ్మగారూ! ఈరైళ్లు, టెలిగ్రాఫులు, బడులు, ఉద్యోగాలు అన్నీవచ్చాయామరీ!

ముసలమ్మ:—వచ్చాయి. వస్తే? ఆడదాన్ని గడపదాటి పొమ్మన్నారండీ ఎచ్చటనైనా! మారోజుల్లో మాకు కాలుగడపదాటటానికివీలుందా? పొరుగింటికి పేరంటానికి వెళ్లడానికి అసలుతీరిక అయ్యేదేకాదు. పోనీ, తీరిక చేసికొని ఏసంధ్యవేళో వెళ్లుదామన్న ఎక్కడ మగవాళ్లుచూచిపోతారో అని భయమే. దొడ్డిదారిని నెమ్మదిగా మాఅత్తగారితో చెప్పి మరీవెళ్లేవాళ్లము. ఇప్పుడుమగవాడి భయమంటూ ఒకటిఉంటేనా? ఇంతకూ దాన్నిఅనాల్సినపనేముందీ మావెధవదగ్గరసత్తా ఉంటే.

సీతమ్మ:—బయటచప్పుడైంది. బహుశః ఆమెవచ్చారనుకుంటా.

కమల:—ఏఁ...ఏఁ...సీతమ్మగారు! పిల్లవాడికి ఏం. ఏంనాయనా! బాబూ! (అంటూ గబగబవచ్చి పిల్లవాడినితీసికొని కనులవెంబడి నీరుకార్చడం మొదలుపెట్టింది.)

సీతమ్మ:—ఏంలేదండీ, భయపడనక్కరలేదు. కడుపుఉబ్బరంచేసింది. ఏడ్చేడు......మీరు ఎందుకు అంత అదుర్దాపడ్డారు.

కమల:—ఎరక్కపోయి వెళ్లానండీ. నేనువెళ్లేటప్పటికి బాగా కులాసాగానే ఉన్నాడు. ఇప్పుడే వద్దామనివెళ్లేను. ఒక అరగంటకూడాకాలేదు.

సీతమ్మ:—డాక్టరుగారికి కబురుపంపండి. ఆయనవీధైనఇస్తారు. సర్దుకుపోతుంది.

౨

[కమలాదేవి డిప్యూటీకలెక్టరుగారికూతురు. గారాబంగా పెరిగింది. పనిపాటలు ఎన్నడూ చేసియెరగదు. చిన్నప్పటినుంచి గొప్పఇంట్లో-నవుకర్లుచాకర్లుగల కొంపలో-పెరిగిందేమో అధారటీచెయ్యడమే ఎరుగుందిగాని, తాను మాటలు పడడం చూచియెరగదు, పడీయెరగదు. కోమలమైనశరీరం. అతిసుకుమారి. పట్టుమని నాలుగడుగులువడిస్తే ఒళ్లుకదిలి పులకరింపువస్తుందేమో అన్నట్టుగాఉంటుంది. చిన్నప్పటినుండి కాఫీలు, టీలు, వేపుడుకూరలు, పప్పుపచ్చళ్లు, మజ్జిగపులుసులు, మీగడపెరుగులతోను తినీతినట్టుగా భోంచేయడానికి అలవాటుపడ్డది. ఏసెకండుఫారమో, థర్డుఫారమో చదివింది.

రామారావు యంగువకీలు. ప్రాక్టీసుమొదలుపెట్టి రెండోసంవత్సరం. ఇంకాసంపాదనలో పడలేదు. పిత్రార్జితంలో చదువుకుపోగా మిగిలిన హాతకేమంతో కాలంగడుపుతున్నాడు. కాని మొత్తంమీదవ్యవహారం కొంచెంతటపటాయిస్తూన్నది. మొదటినుండి కొంచెము బ్రహ్మసమాజవాసనకలవాడగుటవల్ల సాంఘికవ్యవహారాల్లోలిబరల్ వ్యూస్ పట్టుబడ్డాయి. అందుచేత చేతులో రస్మితక్కువగాఉన్నా మామూలుమర్యాదలకు లోపంకలుగకుండానే పట్టుకొనివస్తున్నాడు.

డాక్టరుశర్మగారు "ఏమండోయి, కమలాదేవిగారూ!" అంటూ వాకిట్లోనుండే కేకవేస్తూ లోపలికి వచ్చేడు.]

కమల:—వచ్చారే. ఎట్లాగో. నయమే.

డాక్టరు:—మీరు కబురుచెయ్యడం, నేనురాకపోవడంకూడానా.

కమల:—పిల్లవాడికేను స్తీగాఉంది. అందుచేత అపసరంగా కబురుపంపేను.

డాక్టరు:—అఁ; నుస్తీ! ఏంనుస్తీ. నిన్నబాగానేఉన్నాడే. ఏదీ, చూడనివ్వండి..........

కమల:—నేను క్లబ్బుకువెళ్లేనూ, అప్పటికేంలేదు. దాసీపిల్ల ఎత్తుకొని ఆడిస్తూఉంది. ఒకపావుగంట, ఇరవైనిమిషాలుకూడాకాలేదు. ఇంతలో కేకబురు.

డాక్టరు:—ఏం, లేదండి. కాలిక్. కడుపుఉబ్బరంచేసి నొప్పిచేతఏడ్చేడు. మీఅత్తగారులేరూ ఇంట్లో.

కమల:—ఉన్నారు. మాప్రక్కను టీచరు నరసింహారావుగారి భార్య...పాపం ఆమెవచ్చికడుపు కొంచెం సహాయంచేశారు.

డాక్టరు:—గ్రైప్‌వాటరు వాడడంలేదూ? పచ్చిపాలకి అదివాడుతుండాలండి. నేను రెండుపొట్లాలు పంపుతాను. ఇప్పుడు ఒకటివెయ్యండి. దానితో ఒకటిరెండు విరేచనాలు అయితేసరే లేకపోతే రెండోది కూడవేసెయ్యండి......మీయింట్లో ఉందేమో కాల్‌మల్.

కమల:—ఆఁ. ఉంది.

డాక్టరు:—ఇంకేం? వేసెయ్యండి. డోసు తెలుసుకాదూ? బహుకొంచెంగాతగిలించండి... నేను వెళ్లుతున్నాను.

కమల:—రేపు ఉదయంకూడ ఒకసారి వచ్చిచూడాలి సుమండి.

డాక్టరు:—అవసరంలేదు. పోనీ, అల్లాగే (అనుచు గడపలుదిగుతున్నారు.)

రామా:—ఏమండి, డాక్టరుగారూ! ఇప్పుడు వచ్చేరు.

డాక్టరు:—ప్లీడర్లతోనైనా ఒకప్పుడు పనిలేకపోవచ్చునుగాని డాక్టర్లతో పనిలేకుండా ఉంటుందా.

రామా:—మీతో పనిలేకుండా ఉండాలనే వెయ్యిదేవుళ్లకు మొక్కుతాం.

డాక్టరు:—మీకుకూడా మొక్కుబళ్లున్నాయా, ఏమిటీ!

రామా:—ఇంతకూ, సంగతి యేమిటో చెప్పరేఁ. వెళ్లుదురుగాని, రండి.

డాక్టరు:—పిల్లవాడికి స్వస్తీ............

రామా:—కమలా, కమలా!

డాక్టరు:—ఏమిటి అంత గాభరాపడుతారు.

కమల:—కడుపు ఉబ్బరంచేసింది......

డాక్టరు:—నేనుచూచానండీ. తొందరయేంలేదు. మీయింట్లో కాల్‌మల్ ఉన్నదిటగాదూ.

రామా:—అవును. ఈమధ్య తెప్పించేను; ఎందుకైనా ఉంటేమంచిదిగదా అని.

డాక్టరు:—గో అన్; గివ్ ఇట్......గుడ్ నైట్.

రామా:—మెనీథాంక్స్. గుడ్ నైట్.

3

నర:—(మఱునాడుదయము) ఏలాఉంది? కన్ను తెరిచిచూస్తూన్నాడా?

సీత:—డాక్టరువచ్చేడు. మనస్పృహయేమిలేదు. ఏమో, యెట్లాఉంటుందో, పాపం ! ఇక్కడేం చెయ్యడానికి వీలులేదు. ఆసుపత్రికి తీసుకపదండని చెప్పేడు డాక్టరు. ఇప్పుడే తీసుకొనిపోతున్నారు.

నర:—అసలేమిటి జబ్బు?

సీత:—నేనురాత్రిమీతో చెప్పలే. రాత్రేమోపడుకొని నిద్రపోయినాడుగదా, అయినా రాత్రిపూట విరేచనాలయితే ఇబ్బందని రాత్రికాల్‌మల్ పెట్టలేదుట.

నర:—మంచిపనే.

సీత:—సరే వినండి. ప్రొద్దున్నే పెద్దామెగదా అని పాలల్లో కలిపిపోసిందట. పోసీపొయ్యటంతోనే; ఏంవుంది, పిల్లవాడు ఎర్రగకందిపోయి స్పృహతప్పిపోయినాడు.

నర:—డోసేను ఎక్కువవేసింది. దరిద్రపు కాల్ మెల్ నేను అందుకనే మనపిల్లలకు ఎప్పుడు వెయ్యవద్దని చెప్పటం. అదికుద్ధవిషం. ఈవైద్యాలతో సగంమందిపిల్లలు చస్తున్నారు.

సీత:—మరేంచేసేది. కాల్ మల్ అందరు ఇళ్లల్లోపిల్లలకు పెట్టుతుండేదే ఆయెను; పైగా డాక్టరుకూడా పెట్టమనిచెప్పెను. ఇంతకుకాలంకర్మం అట్లాతోసికొని రావల్సివచ్చింది. పాపం! ఆ అమ్మాయిమాత్రం యేంచేస్తుంది?

నర:—ఇప్పటి ఆడవాళ్లదంతా మిడిమిడిజ్ఞానంగా ఉంది. మాట్లాడితే డాక్టరుదగ్గరకు పరుగెత్తటం; మందులషాపుకు పరుగెత్తటం. ఏకో, ఆడాక్టరు ప్రిస్క్రిప్షన్ ఇవ్వడం. అయ్యో! ఇప్పుడు అదికూడా పోయి ది. డాక్టర్లపని చాలసులభం అయిపోయింది. మెటీర్యా మెడికా కూడపనిలేని పార్కు డేవిస్ కంపెని ప్రిస్క్రిప్షన్ క్యాటలాగు బాగాపారాయణం మొదలుపెట్టేరు. అన్నీ రెడీమేడ్ స్పెసిఫిక్సు. అవి మనవాళ్లు తెచ్చుకోవడం మింగడం. ఒక్కసారి డాక్టరు పేరుచెప్పితే తర్వాతవీళ్లుస్వంతంగా సీసాలు, సీసాలు తెచ్చుకోవడం, త్రాగడం. వైద్యం బహుసులభం అయిపోయింది.

సీత:—ప్రతీదానికి ఇంట్లో మగవాళ్లను వేధించుకుతింటే వాళ్లువిసుక్కుంటారు.

నర:—ఇదే మిడిమిడిజ్ఞానం అన్నది. మొగవాళ్లు విసుక్కుంటారని షాపుల్లోమందులు తెప్పించుకోని తినడమేనా? పేటెంటు మెడిసిన్సుగదా, ఫరవాలేదని ఒకదురభిప్రాయం. డాక్టర్లమూలకంగాను, మందుల అడ్వర్టయిజిమెంటు (ప్రకటనలు) లమూలకంగాను యెంతైనా ముప్పుకలుగుతున్నదే.

సీత:—ఏముసలమ్మవైద్యమో చేయకూడదా; ఈడబ్బుఖర్చెందుకూ అంటారు మీరు. గొప్పగొప్ప డాక్టర్లుఅంతా సర్టిఫికెట్లుఇచ్చినవి, వాడుతున్నవేగా, మనమువాడేవి.

నర:—ఇంగ్లీషుమందులవ్యాపారకీలకం అక్కడేఉంది. ఈమందులకంపెనిలక్రింద సొమ్ముతినేడాక్టర్లు పందలకొలది ప్రతిదేశంలోనుఉన్నారు. కంపెనీవాళ్లు ఏదోకొత్తమందో ఇంజెక్షనో తయారుచేసి వాళ్లకు పంపగానే వాళ్లు "నేను నారోగులమీద వాడిచూచినాను. చాల అమోఘంగాపనిచేసింది" అని నాలుగు వైపులనుండి ఏమీ సంబంధంలేనివాళ్లవలె సర్టిఫికెట్లమీదసర్టిఫికెట్లు వ్రాసిపంపుతారు. కంపెనీవాళ్లు వానిని తెల్లకాగితాలమీదా, పచ్చకాగితాలమీదా, ఊలిపిరికాగితాలమీదా చిన్నటైపులోను, పెద్దటైపులోను, బొమ్మలతోను చిత్రవిచిత్రంగాఅచ్చేసి ప్రపంచమంతా ముంచేస్తారు. ఇదీరహస్యం. ఈగోడవనీకెందుకుగాని, అసలుసంగతి ఏమిటంటే: ఇప్పటి ఆడవాళ్లకుఫాషన్లు ఎక్కువైనాయి. మాట్లాడితే అభిమానం, ఆభిజాత్యం పొడుచుకొస్తుంది. ఆత్మగౌరవాన్నిగూర్చి దురభిప్రాయంయేర్పడింది.

సీత:—మీకు ఆడవాళ్లంటేనే గిట్టదు.

నర:—సరే మంచిమాటేఅన్నావు. అల్లాఅయితే నిన్ను పెళ్లిచేసుకోకుండానే ఉండేవాడ్ని.

సీత:—మీరు చేసుకున్నారూ? మీవాళ్లుకట్టేరుగాని.

నర:—ఇందులో ఈప్రణయప్రహసనంకూడాయెందుకు కాని, అసలుసంగతి చెప్తావిను. దొడ్లోఉండే దొండాకు, గుంటకరకరాకు, జొక్కనాకుతోను ఇంట్లోఉండె శొంఠిమిరియాలు పిప్పళ్లతోను వైద్యమంతా నడిచేది పూర్వం. ఇదిముసలమ్మలవైద్యమని మీరు ఈసడిస్తారు. పడుచమ్మలవైద్యం యేలాపరిణమిస్తున్నదో కనిపిస్తూనే ఉన్నదిగా.

సీత:—ఎందుకీచెప్పిళ్లు. చెప్పేదేమో సరీగాచెప్పండి.

నర:—నీవు సరిగా కోపగించుకోకుండావిను. నేనువేళాకోళంలేకుండా మాట్లాడుతాను. ఎందువల్లనంటే: శిశుపోషణ దైవనిర్ణీతమైన మహాత్కార్యం. మిక్కిలిబాధ్యతతోకూడుకొన్నది. ఇందురెండుధర్మాలు

ఇమిడిఉన్నాయి. ఒకటి ఆత్మీయమైనది. రెండోది దేశీయమైనది. జననమరణప్రవాహరూపమైన ఈసృష్టి అంతాభగవంతుని లీలే. దీనిలో ప్రతిజీవికి, ప్రతివ్యక్తికి స్త్రీపురుషులకు విధినిర్ణీతమైన పాత్రలుఉన్నాయి. భగవదుద్దేశానుసారంగా వానిని నిర్వహించడమే ఆత్మీయమైన మొదటిధర్మం. ఈ సంసారచక్రం నడిపించడమే దేవుడికికులాసా. అందుకు స్త్రీపురుషులు ఉపకరణాలు. శిశువు భగవంతునిబిడ్డ. ఆశిశువుధారణ పోషణ మనకు విధించేడు. ఆవిషయంలో మనం తెలిసికాని తెలియకకాని యేంలోపంచేసినా అదిభగవంతుని యెడ అపచారమే. శిశువుయెడ కన్నమోహంచేతగాని, జాలిచేతగాని, ప్రేమచేతగాని పోషించడం పశుధర్మం. అట్లుగాక భగవన్నిర్ణీతపవిత్రధర్మమనిగ్రహించి తత్సంబంధమైన సమస్తకష్టాల్నీ ఓరిమితో భరించి నిర్వహించేయెడల సంసారం ఆధ్యాత్మికాభివృద్ధికి ప్రతిబంధకంగాక ఆత్మోత్తీర్ణతకు సాధనక్షేత్రమవుతుంది.

సీత:—మీరుచెప్పేది లోకవిడ్డూరంగాను, మెట్టవేదాంతంగాను ఉందిగాని సహజంగాలేదు.

నర:—నిజమే, సీత! ఎందుచేతనంటే? ఇప్పుడు నేచెప్పేది బహుజనాభిప్రాయానికి విరుద్ధంగానే ఉంటుంది. అందుచేత విడ్డూరంగాకూడ ఉండవచ్చు. మన ఇరుగుపొరుగువాళ్లను మనము చూస్తూనే ఉన్నాము. కళ్లుమూసికొని తిరగడంలేదు. ఎవళ్లో ముసలముతకతప్ప కనేవాళ్లు ఎవళ్లు పిల్లామేకా కావాలని కొట్టుకోవడంలేదు. ఇందుకు ఆర్థికస్థితిన్నీ, స్వేచ్ఛాప్రవృత్తిన్నీ, అనారోగ్యమున్నూ కారణాలుగా ఉన్నాయి. ఈరోజుల్లో యేంచదువుచదివినా సొంతపొట్టలే పూడనప్పుడు బిడ్డల నేమిపోషిస్తారు? రెండోది, బిడ్డలులేకుండా ఉంటే తమవిషయాలలోలత్వముకు అడ్డులేకుండా స్వేచ్ఛాజీవనం చేయవచ్చుననీ, చిలకగోరంకల్లాగ ఆడుతూపాడుతూ ఉండవచ్చునని ఒకరురభిప్రాయం. ఇది క్షుద్రమైనది. నిజంగా మానవత్వంసిద్ధించవలెనంటే స్వకీయమైనదో, పరకీయమైనదో బాధ్యతవహించి సంసారజీవనం (ప్రాపంచకజీవనం) జీవించవలసి ఉంటుందని, స్వేచ్ఛాజీవనం అసంభవమని ముమ్మందుచ్యోతకంకాదు. బిడ్డలున్నా లేకపోయినా సాంసారిక ఈతిబాధలు ఎవరికీతప్పవు. కనుక స్వేచ్ఛాచారులుగ ఉండాల్నికోరడం తెలివితక్కువ. మనవంతు మనంభరిస్తేనే ఋణవిముక్తి. మూడోది అనారోగ్యం. స్త్రీపురుషుల్లో ముప్పాతికమూడుపాళ్లు అనారోగ్యులై సంతానంబడయుటకు అనర్హులుగానే ఉన్నారు. అసలు అనారోగ్యంగా ఉండి కుటుంబసంబంధమైనట్టిగాని, దేశ (ప్రాపంచక) సంబంధమైనట్టిగాని బాధ్యతలువహించటానికి అశక్తుడుగాఉండి ఇతరులకు భారంగా ఉండడం నిజంగాపాపం. అట్టివాళ్లు ధర్మంతెలియక సంతానం పొందడం అంతకంటెపాపం. కాబట్టి అట్టివాళ్లు ఆరోగ్యంపొంది సంసారబాధ్యతలు వహించడానికి అర్హతను సంపాదించుకోవాలి. ఇంతకు జీవనతత్త్వం తెలియకపోవడంచేతనే ఏదిమంచో, ఏదిచెడ్డో తెలియడంలేదు. అదేమీ అంటే వేదాంతం, వేదాంతం అని హేళన. మనమెవరమో, మనగతియేమో తెలుసుకోటానికి సిగ్గు, బిడియం అయితే మనగతి అధోగతే అవుతుంది. కనుక భగవంతుడిచ్చిన బుద్ధినివినియోగించి యుక్తాయుక్తవిచక్షణతో కాలంగడపడం మానవలక్షణంగాని యథేచ్ఛజీవనం పనికిరాదు.

పిల్లవాడు:—నాన్నోయి! నాన్నోయి!.........

నర:—ఏమిరా అట్లాకేకలు వేస్తావు?

పిల్లవాడు:—వాళ్లపిల్లవాడు బదికాడుట.

నర:—పోనీ, బాబు! భగవంతుడిదయవల్ల బతికేడు.

పిల్లవాడు:—మందేం......కక్కించారుట.

నర:—ఇంతమంచిందే అది......వాడిమాట మీదనేగా ఈసొదంతావచ్చింది. ఇంతకుపర్యవసానం యేమిటంటే పిల్లల్ని జాగ్రతగా పెంచవలెననే జ్ఞానమేలేదు చాలమందికి. అందులో ముఖ్యంగా

భాగ్యవంతుల ఇళ్లల్లో చూస్తామనగదా, ఒకపాలడబ్బా, (గ్లాక్సో, లాక్టోజన్, మెలిన్సు, నెసిల్సు, అలెంబరీ......) వేడినీళ్లసీసా (థర్మాసుఫ్లాస్కు) కొమ్ముచెంబో ఫీడింగుబాటిలో పిల్లవాడిని ఎత్తుకొనేవుణ్ణి ముండమొఖాన పారేస్తారు. పిల్లవాడిని దానికిఇచ్చి పవలలతోనే, ఇష్టాగోష్ఠికబుర్లతోనో, శయనగృహము లనో కాలక్షేపం చేస్తుంటారు. ఈకుర్రది పిల్లవాడుయేడ్చినప్పుడల్లా ఆడబ్బాలోదింతా, ఈసీసాలోదింతా కలిపివాడిపొట్టలోపోసి, వాడినోటిలో ఒకపీకకుక్కి, దానిదార్ని అది పీగచ్చుకాయలో ఆడుకుంటూ ఉంటుంది. ఇదేగా ఇప్పుడుజరుగుచున్న శిశుపోషణలక్షణం.

సీత:—ఇంకా మనవాళ్లేనయమేమో! పిల్లలు కళ్లయెదుటనైనాఉంటారు. దొరసాన్లు యేంచేస్తున్నారు. ఊరూ, పాపూగారు, ఎక్కడనో ఆరువేలమైళ్లదూరాన వాళ్లనుపారేసి వీరు ఇక్కడ దొరలుదొరసాన్లమంటూ తిరుగుతున్నారు.

నర:—పులినిచూచి నక్కవాతపెట్టుకొన్నట్లున్నది. ఇదే మిడిమిడిజ్ఞానం అన్నది. వాళ్లపిల్లలు అక్కడగాలికిధూళికి పెరగడంలేదు. కన్నతల్లిదండ్రులకంటె ఎక్కువజాగ్రతతో పెంచేశిశురక్షణాలయాలు, శిశుసంరక్షకులు, దాయీలు (Governesses, Nurses) మొదలైన యేర్పాట్లెన్నో ఉన్నాయి.. వాళ్లందరు ఉత్తమసేవకు జీవితకైంకర్యంచేసినవాళ్లు. మానవసేవయొక్క మాధుర్యం హృదయగతం చేసికొన్నవాళ్లు. మనమొ సరిగా బోధపడని కుర్రకుండలికి ఒప్పచెప్పడంలేదు. అదిగాక మరొకసంగతికూడా ఉన్నది. ఆదేశంలోనే పుట్టికొంతకాలం పెరిగినవాళ్లకుగాని ఆదేశపుపౌరసత్వపుహక్కులుకలగవు. అందుచేత దొరసానులు స్వదేశమునకే వెళ్లి అచటనే ప్రసవిస్తారు.

## వియోగగానము

వడ్లమాని అప్పారావుగారు

ఏవిరిమూకలో వెదకి ఎవ్వరొసంగిరొ పూలదండ! నా
భావవియోగపత్రములపై కనుమోడ్చుసఖీవిలాప మి
చ్ఛావిధి నిద్రఁగోల్పె సుమసంతతి ఎల్లదళాలమూసి, ని
ద్రావిదితమ్ముదీని విరిదండధరించితినేను నెచ్చెలీ!
ఈనడిరేయిచీకటుల యీమృదుకంఠముపీడి మాటికీ
గానసుమమ్ముకాలు నిశికాంతకవుంగిలిలో పెనంగి నీ
మానసికాంతరాయములమాటుల తూలుసుషుప్తప్రేమగీ
తానవజీవకమ్రసుమదామముకై విరజల్లుదృక్కులఁ.
ఏనువిపంచితంతులను ఎక్కడివో ప్రణయార్ద్రగీతికా
ధ్యానపరంపరల్ తెలుప దాల్చునఖాగ్రపుటుంగరమ్ము నా
మానసవీథి వేసవులమంటలలో పడి కాలిపోయె, కా
దేని విపంచిమూగసుధలిన్ని విదాహపుటెండమావులే!
ఈమదినేడుపూచు విరులే యిక కానుక నీకుపొమ్ము; నే
నేమరి ఎన్నియోయుగములేడ్వ కపోలవిశేషమాధురీ
కౌముదులొక్కనాటినిశిక్రాగి అదేమొ అదృశ్యమాయె! నా
కీమసిరాత్రికోరకములే ఎదపూచు సుషుప్తిపూవులై!

# వీర

ఆంధ్ర శేషగిరి రావు గారు బి.ఏ.

విదిశాపురవిభుఁడు విశాలరాజు తనకూఁతురు వైశాలిని వరయోగ్యకాఁగా స్వయంవరముచాటించెను. దేశదేశములనుండి సుందరరాజకుమారు లెందఱో విచ్చేసిరి. అందు అవీక్షితుఁడను రాజకుమారుఁడు పరాక్రమించి పరరాజకుమారులనెల్ల పరాజితులనుజేసి వైశాలినిని బలిమినివరించెను. ఇతరరాజకుమారులు ఇది సహింపఁజాలకపోయిరి. వధువు లభ్యముకాలేదను చింతకుతోడు పరాజయదుఃఖము పీడింపగా వారందఱునేకమై అవీక్షితునిపై కత్తిదూసిరి. వియ్యపువేడుక కయ్యపువేడుకగామాఱెను. పెక్కుఱురాజకుమారులు తన్నుఒక్కమాఱు డీకొనిరి. అయినను అవీక్షితుఁడు డీలుపడలేదు. అందఱకును ఎదురొడ్డినిలచినాఁడు; పాలిపోవని మగటిమితో పోరుసల్పినాఁడు. అందుమీఁద ధర్మయుద్ధమున ఈబలియునిబట్టజాలమనినిశ్చయించి ఆరాజకుమారులు అధర్మయుద్ధమునకుగడంగిరి. పాడిమాలియుద్ధముచేయుచున్న పలువురు ఒకపక్షమున. ధర్మయుద్ధముననే తగిలియున్న ఏకైకవ్యక్తి మఱియొకపక్షమున. విజయము ఎవరిదగునో సులభముగనే గ్రహింపవచ్చును. అవీక్షితుఁడు పట్టుబడినాఁడు. వివాహమందిరప్రవేశమునకు బదులు కారాగారనివాసము; కంకణబంధమునకుబదులు కాలుసేతులకు అంటకట్లు.

అవీక్షితునిజనకుఁడు కరంధమమేదినీశ్వరుఁడు ధర్మపత్నియగు వీరమహాదేవితోడను, వీరశేఖరులగు సామంతరాజులతోడను కొలువైయుండగా ఈవార్తవినెను. ఒక్కనిమీఁద పలువురు. అదియు నధర్మయుద్ధమున. ఈవిషయము కరంధమునిహృదయమును కలగుండు వెట్టెను. ఆకలగుండుతో నాతఁడు ఇతికర్తవ్యతామూఢుఁడై కన్నుండిసగ్రుడ్డితనముతో సభను కలయఁజూచెను. 'పలువురు ఒక్కనినిట్లుచేయుటఘోరము' అని ఒకసామంతరాజు పలికెను. 'ఆధూర్తుల నొకపట్టున పోనీయరాదు' అని మఱియొకసామంతరాజువచియించెను. 'మనచతురంగబలమును రయమున సన్నద్ధంబు గావింపనియోగింపుఁడు' అని వేఱొకఁడనియెను. 'దీని కంతకునుమూలము విశాలరాజు. ఆతనిని ముందుతెగటార్పవలయును' అని మఱియొకసామంతప్రభువుగద్దించెను. ఆవేశమునకు దాసులముకాని ఆలోచనాధీరులమను కొనువారు కొందరు 'మనకుమారుఁడు తగవుదప్పి స్వయంవరమున బలదర్పితుఁడై కన్యను బలిమినిబట్టికొని యాగడముచేసిన వారేలసహింతురు?' అనిసణఁగిరి. కొద్దిమంది గద్దింపు, పలువుర సణుగుడు. కర్తవ్యనిర్ధారణమాత్రము జరుగలేదు.

కార్యము శీఘ్రనిశ్చయమును త్వరనిర్వహణమునుగోరుచున్నది. మహారాజును జడత ఆవహించినది. సామంతరాజులకు ఆలోచన తెగలేదు. మగని అర్ధాసనమునఁగూర్చుండియున్న వీరమహాదేవిఇదియంతయుఁజూచెను. సాంసారికవిషయముననేగాక రాజ్యాంగవిషయమునఁగూడ కరంధమునకర్ధాంగియని యనిపించుకొనవలసిన శుభావసరమువచ్చినదని ఆమె గ్రహించెను.

వీర వీరవంశప్రసూత. పేరునకుమాత్రమేగాక ప్రతిష్ఠకుగూడ వీర్యచంద్రుడగు వీర్యచంద్రుడనువాని పుత్రికయామె. వీర వీరపత్ని. కరయుగధమనమున శత్రువీరనిరాసనోగ్రబలమునుబొంది కరంధముడను పౌరుషనామమున వీరవిక్రమములు నెఱపిన వీరశేఖరుని అర్ధాంగియామె. వీర వీరమాత. పలువురు ఒక్కమొగిని తనపైకత్తిదూసినను భయము నొందక సాహసముతో వారినెదిరించిపోరినపోటుమానిసి అవీక్షితుని తల్లియామె. వీరవంశప్రసూతయు, వీరపత్నియు, వీరమాతయునగు వీరమహాదేవి మగనిజడత, సభికులవికలత చూచి తాళజాలకపోయెను. లేచినిలచెను. ఆమెలేచుటలోనైన కంకణక్వాణమునకు సభ ప్రబోధితమయ్యెను; చైతన్యవాయుప్రసారము ప్రారంభమయ్యెను. ముక్తకంఠముతో నామె అప్పుడిట్లుచెప్పినది:

"వీరులారా! శౌర్యగర్వితులగు పెక్కురాజకుమారులనోర్చి మత్కుమారుడు కన్యను బలిమినిగైకొనినాడు. వీరహృదయమునకు నోచిపుట్టనివారి కిదియాగడముగనేగన్పట్టును. క్షత్త్రియధర్మసూక్ష్మములెఱిగినవారు దీనిని నిరుపమశక్తిగా పరిగణించితీరెదరు. రాజకుమారుల నోర్చి స్వయంవరమున రాజకన్యను నాతనయుడు బలిమినిగ్రహించుట నీతివిరుద్ధముకాదు. అనంతరము తాను బందీకృతుడగుట అవమానకరమునుగాదు. ఏమందురా?

ఆ. అవనిపతులు బలియురందఱు నొక్కనిఁ
దన్నుఁబొదివికొనినఁదలఁక కదరి
పోటులాడి నాదుపుత్రుండుపడుట దాఁ
గీర్తికరముగాని కీడుగాదు.

—మార్కండేయపురాణము.

నామతమున

క. మది నీతిగణించక యు
న్మదచేతోకాద్రరససమగ్రతఁ గడుబె
ట్టిదుఁడై సింహముక్రియ రిపు
విదళనముంజేత నొప్పు వీరగుణమిలన్.

—మార్కండేయపురాణము.

ఇంతకును ఆతడొనర్చినకార్యము నీతిసమ్మతమాకాదాయను విషయమును విమర్శించుటకుగాని ఆతనిబంధనమునకై వంతనొందుటకుగాని ఇదిసమయముగాదు. ఇది మన శౌర్యమునకు ఒరపిడిరాయియైన అదును. లెండు. జాగుసేయకుడు. మరణనిశ్చితబుద్ధులు గండు. చతురంగబలములను సర్వముసంసిద్ధమొనర్పుడు. 'ఇదిపలువురతోడి విగ్రహము. అతిభరము' అనుభావమునొందకుడు. గొప్పశత్రువును నిర్జించినప్పుడే గొప్పపేరురాగలదు.

అల్పులగు మేదినీశ్వరులందొనర్చు
నల్పవిక్రమమున శూరుఁడైనవాని

కెవ్వనికిఁగల్గు పెంపు మహీశులార!
విమతబలవిక్రమార్థీశుఁ బెనపినట్లు.

కావున ఆశత్రుధాత్రీపతులపై ఎత్తివెళ్లుడు. వారిమస్తకములను మీనిశితహేతిఘాతములతో చూర్ణముచేయుడు. అవిగో మీరథములు విదిశాపురముఖములై మిమ్ముపిలుచుచున్నవి. ఈసమయమున స్వోత్కటశౌర్యధర్మమును పూనకయుంటిరేని మీపుట్టువు రాచపుట్టువుగానేరదు. ఇన్నాళ్లును ఇంతబ్రతుకుబ్రదికి ఇప్పు డిట్లు ఇంటబడియున్న నేమిలాభము? కావున లెండు. సమరసన్నద్ధులుగండు. యుద్ధమునగెలుతురా, వాంఛనీయమగు రాజకుమారబంధవిముక్తికితోడు నూతనరాజ్యలాభము. యుద్ధమునకూలిపోవుదురా, క్షత్రియోచితమగు ఆయుధమరణమునకుతోడు వీరస్వర్గప్రాప్తి. ఎటులయినను వరణీయమగులాభము".

రాణిపలికిన ఒక్కొక్కవాక్యము నొక్కొక్కవిద్యుల్కిరణమువలె సభలో ప్రసరించెను. అందుతో రాజు జడతజాఱెను; సభికుల వికలతవీడెను. సభయందంతటను ఉత్సాహశక్తి ఉద్దీపితమయ్యెను. ఉపన్యాసముముగించి వీరాదేవి ఆసీనఅగులోపల సభికులెల్లరు లేచిరి. వారు సర్వసిద్ధమగులోపల రాజు రథమెక్కెను. ప్రయాణభేరీనినాదముకట్టువడులోపలనే కరంధముని సైన్యము ఆలవిరాజ్యపుపొలిమేరదాటెను.

శక్తిస్వరూపిణిచే ప్రబోధితమై బయలుదేఱిన ఆసైన్యము సమరమున విజయమును బడసినదని వేఱచెప్పనక్కఱలేదు. చెప్పవలసినది వీర వీరజీవితమునుండి గ్రహింపవలసిన నీతిపాఠము. 'నేను అకుదానను. రాజ్యాంగవిషయములందు నేనేల వ్రేలుపెట్టవలయును?' అను అనుచితభావము ఆమెకుకలుగలేదు. ప్రేమచిలికి ప్రాణనాథునిలాలించుటమాత్రమేగాక అవసరమగుచో ఉత్సాహమురేపి అతనినిఉద్బోధించుటకూడ భార్యయగుదాని విధికృత్యమేయని ఆభారతరమణి నాడుప్రతిపాదించినది. మఱియొక ఆమెగావించిన వీరగుణనిర్వచనము సయితము గమనార్హమైనదే. నీతినిబాటింపక శత్రువులనునిర్జించుటయే వీరగుణమట. హైందవచక్రవర్తులు ఈపౌరాణికవీరరమణిమతమును పాటించియుండినచో భారతదేశచరిత్రను కుళ్లబెట్టిన హైందవపరాజయములెన్నియో పొసగకనేయుండియుండునేమో?

## నారీసత్యాగ్రహులు

శ్రీమతి నీలంరాజు సుబ్బాయమ్మ గారు

సత్యాగ్రహప్రభాసక్తిచే సర్వంబు
త్యజియించి రణభూమిఁదరిసినారు
గాంధీమహాత్ముని ఘనదృష్టిపథమున
వెలలేనిమణులయి వెలసినారు
మాతృదేశపుకీర్తి మహినివెల్లడిజేయ
వీరపుత్రిక లనుపించినారు
హైందవస్త్రీలు మహామ్మేరుసామ్యులం
చను యశం బెల్లెడలందినారు
పావనంబైన మీదునామంబు లెల్ల
వారినోళ్లను వచియింపవరలినారు
ధరణి మీజన్మలెంతసార్థకములయ్యె!
అమలగుణులార! భారతరమణులార!

# గ్రామపునర్నిర్మాణము: స్త్రీలబాధ్యత

శ్రీమతి రామరాజు మైత్రేయి గారు

పూర్వకాలమున మనహిందూదేశమున గ్రామము లత్యంతసౌభాగ్యస్థితియందుండెనని యనేకపురాణగాథలవలన మనకు విశదమగుచున్నది. ముఖ్యముగ హైందవచక్రవర్తులలో నగ్రగణ్యుండనదగు శ్రీ అశోకచక్రవర్తి చారిత్రమొకింత తిలకించినచో గ్రామముల యున్నతస్థితి తెల్లమగును. అప్పటి గ్రామసౌభాగ్యస్థితి రమణీయమగు తోటలతోను, నిర్మలమగు నీటిసౌకర్యములతోను, బాటల కిరువైపుల హాయిగొల్పు వృక్షములతోను, గ్రామమువం దైకమత్యావసరంబులగు సంస్థలతోను నిండియుండెడిది. విద్యానిలయంబులకు రాజాదరణయుండుటచేత విద్యావిషయమైకూడ నెట్టికొరంతయులేదని చెప్పవచ్చును. ఇట్టి సౌకర్యములు కలిగియుండిన మనగ్రామములు రానురాను యిప్పటికి వర్ణింపనలవిగాని హీనస్థితియందుండుట మనకందఱకు తెలసిన యంశమే. ప్రస్తుతము మన గ్రామములలోనుండు కొద్దిమంది ధనికులు, తమ యాస్తులన్నియు తెగనమ్మి హూణవిద్య నభ్యసించుటకై పట్టణములకు వచ్చిచేరినారు. కావున గ్రామములయందు కేవలము విద్యావిహీనులగువారే నిలచిపోయినారు. వారికి ప్రాథమికములగు ఆరోగ్యవిధులనుగూర్చి బొత్తుగ తెలియదు. వారు వారిపంటల పండించుకొనుట వాటిని వారికివలయుమట్టుకు నిలువయుంచుకొని, తక్కినవి యమ్ముట మొదలగుపనులయందే లీనమైయుంటున్నారు. మన పల్లెజనులలో పెక్కుమంది పేదలు. వీరు రెండవపూట తినుటకు నోచనివారు. వీరు పేదలు, విద్యలేనివారగుటచే ఊరిలోని కాలువలు, చెరువులు యివన్నియు అక్రమముగా పెట్టబడియుంటున్నవి. మన పేదలకు త్రాగుడు అలవాటులోనున్నది. వీరు చౌకయగు తాటికల్లో, కొబ్బరికల్లో, ఈతకల్లో త్రాగి శరీరమును చెడకొట్టుకొనుచున్నారు. దీనివలన వీరు నిలువయుంచుకొన్నడబ్బు పాడుచేసికొని ఆలుబిడ్డలను అష్టకష్టముల పాలుచేయుచున్నారు. వీరికి శిశువులను సరిగ పోషించుటకాని, శుచిగ ప్రసవములనుజరుపవలయుననుటకాని తెలియదు. దీనివలన శిశుమరణములును బాలింతల చావులును ప్రబలముగనున్నవి. మనజనులకు విద్యలేమిచే వారికేసంగతియు తెలపికొనుటయం దాసక్తిలేదు. దీనికి దోడు గ్రామస్థులుకూడా మనుష్యులా యున్నట్లు వారిజోక్య మెవ్వరును కలుగజేసికొనుటలేదు. కావున ఇన్నిదుర్గుణములుకలిగిన మనగ్రామములను పునరుద్ధరింపవలెను. ఈకాలపుగ్రామములందు అట్టిసౌకర్యములు లేకపోవుటయేకాక కించిత్తైక్యభావములులేక ఎట్లుపరిణమించుచున్నవో విచారణీయము. కనుకపూర్వపు టౌన్నత్యమును గ్రామముల కబ్బునట్లుచేయుప్రయత్నమునకే గ్రామపునర్నిర్మాణోద్యమమని పేరు.

మనహిందూదేశమున పట్టణములకన్న పల్లెటూళ్ళనేకరెట్లు యధికమనుసంగతి యెల్లరుయెరింగినదే. దీనినిబట్టి గ్రామములయందలి జనాభాగూడ ఎక్కువగనే యుండుననుటకు సందేహింపనవసరముండదు. పట్టణములలో నిక్కాలమున పురపారిశుద్ధ్యసంఘములుండుటవలన నవి యంత హీనస్థితియందులేవు. అయితే గ్రామస్థితిగతులు విచారించువారులేరు. ప్రభుత్వమువారి ఆదాయము గ్రామములనుండియే వచ్చునదైనను వీటి హైన్యస్థితిమాత్రము కొరతబడుచు నేయున్నది.

హిందూదేశమున గ్రామమే ముఖ్యాధారము. గ్రామసీమయే దేశభవననిర్మాణమునకు పునాదిరాయి. గ్రామస్థులకృషియే దేశమునకు గావలయు జీవనోపాధి యేర్పడుచున్నది. కనుక హిందూదేశమునకు ఎప్పటి యౌన్నత్యము గావలయునెడల గ్రామములు బాగుపడవలయును. అనగ గ్రామపునర్నిర్మాణము అవశ్యకర్తవ్యము.

గ్రామము మంచిస్థితిని వర్ణించుచు సుమతి శతకకర్త ఈపద్యము వ్రాసెను.

క. అప్పిచ్చువాడు వైద్యుడు
నెప్పుడు నెడ తెగక పారు నేరును ద్విజుడున్
జొప్పడిన యూరనుండుము
చొప్పడకున్న యటియూరు సొరకుము సుమతీ.

అనగ గ్రామములందు దప్పుపుట్టుటకు గాను సహకారపరపతిసంఘములు, వైద్యసహాయమునకు మారుగ యారోగ్యస్థితులు చక్కచేయు గ్రామపంచాయితీలు, ధర్మచికిత్సాలయములు, నీటి సౌకర్యములకొరకు ఏరులను భావులను మంచిస్థితియందుంచుట, ద్విజుడనగా బ్రాహ్మణుడు అనగ విద్యాసంపన్నుడు గాన, యట్టివారికి ఫలంబొసగు, విద్యానిలయము లేర్పరుచుట. ఇట్టిసంస్థలే గ్రామమునందు బాగుగ కొనసాగునో అట్టి గ్రామము నిర్మాణోద్యమమునకు ఫలమనబడును. కావున ఈసంస్థలన్నియు బాగుగకొనసాగునట్లు మనదేశమునందలి చదువుకొన్న స్త్రీపురుషులు తగినశ్రద్ధవహించవలెను.

## గ్రామపంచాయితీలు

మనదేశము పంచాయితీలకు పుట్టినిల్లు. ప్రతిగ్రామము యొకచిన్న ప్రజాస్వామ్యప్రభుత్వముకలదని నొకఆంగ్లేయుడు నుడివెను. గ్రామములో తగవులు, తగాదాలు, నేరములు, అన్నియు వెంటవెంటనే గ్రామములోనే యేరావిచెట్టుక్రిందో జువ్విచెట్టుక్రిందో పరిష్కరింపబడుచుండెడివి. వాటికి మారుండేదికాదు. మహమ్మదీయుల కాలములోకూడ ఈగ్రామపు కట్టుబాటు నిలచినది. రాజులెందరుమారినను గ్రామపంచాయితీల తీర్పునకు ఆటంకముండేదికాదు. ఒకశతాబ్దమునుండి యీబ్రిటిషుపాలనాపద్ధతిమూలమున కట్టుబాట్లు, సంఘనియమములు, పంచాయితీలు నశించినవి. పూర్వకాలపు ధర్మములన్నియు నడుగంటినవి. కరణములు, మున్సబులు ప్రభుత్వమునకు దాసానుదాసులై, పూర్వపుకట్టుబాటు ధర్మపాలనవిచ్ఛిన్నమైపోయి గ్రామములో ఎన్నికక్షలకైనను తగవులకైనను ఆకరమయ్యెను. గ్రామపంచాయితీల పునరుద్ధరణముచేయవలెనని అభిప్రాయముకలిగి డిసెంట్రలైజేషన్ కమిటీవారిచే విచారణచేయబడెను. ఆవిచారణసంఘములో దేశభక్త కొండా వేంకటప్పయ్యపంతులుగారు ఒకసభ్యుడుగానుండి అప్పుడుతయారైన అరిపోర్టునకు తానొక డిసెంటుమెంటు వ్రాసి, గ్రామపంచాయితీల సరియైన పునరుద్ధరణమునకు అభిప్రాయములు తెలిపెను. ఆతరువాత 1920-లో ఆమోదింపబడిన మద్రాసు గ్రామపంచాయితీల శాసనమునందు, ఏమి అధికారములు యివ్వబడెననగా:—1. గ్రామపారిశుద్ధ్యము; ఆరోగ్యము. 2. విద్య. 3. నీటిపారుదల *

**పారిశుద్ధ్యము:**—ఈవిషయములో గ్రామములో అడుగిడగానే యసహ్యాకరముగ వెళ్లుటకే రోత కలిగించుచుండును. శుచినియమములకు ప్రసిద్ధివహించిన మనదేశపు గ్రామములలో ఎంత అనారోగ్యము కు పనులైనను గానవచ్చుచున్నవి. మంచినీళ్ల చెరువులు, బావులు యెంత పాడుస్థితిలోనైనను యుంచబడియున్నవి. మంచిశౌచపద్ధతిని గ్రామవీధులు, జలాధారములుంచునట్లు చూడవలెను. గ్రామఆరోగ్యమునకై యందరికి అందుబాటులోఉండునట్లు ఏదోవిధముగ ధర్మచికిత్సాలయములుండవలెను. స్త్రీలు చిన్నచిన్న సంఘములుగాచేరి ప్రసవములు సుఖప్రదముగను, ఆరోగ్యవిధుల ననుసరించియు చేయుటకు ప్రయత్నించవలెను. ఈసంఘములు మునిసిపల్ వారి యాజమాన్యముక్రిందకాని గ్రామపంచాయితీల యాజమాన్యముక్రిందగాని అప్పుడప్పుడు శిశుప్రదర్శనములు జరుపుచుండవలెను.

* శ్రీ నరసింహదేవర సత్యనారాయణగారి ఉపన్యాసమునుండి.

విద్య:—గ్రామపాఠశాలలపై సూపర్‌విజను తాలూకాబోర్డు వారివద్దనుండి, గ్రామపంచాయితీలు గైకొనవలెను. గ్రామములో తల్లిదండ్రులకు ప్రబోధముగావించి వారిపిల్లలు సరిగా పాఠశాలకువచ్చునట్లు చేయవలెను. గ్రామములో పిల్లలసెన్సస్‌రిపోర్టుచూచి అందరును విద్యనభ్యసించునటుల చూడవలెను. ఉపాధ్యాయులు ఈపంచాయితీలలోను, సహకారసంఘములలోను పనిచేయుటకు అవకాశములు కల్పించుకొనవచ్చును. పెద్దవారికిగూడ విద్యాప్రబోధముచేయుటకు ప్రయత్నించవలెను. వారికి ఆంధ్రపత్రిక మొదలగు దైనికపత్రికలలో సంగతులు చెప్పవచ్చును. హరికథలమూలమున నేర్చుకొనునట్లు శ్రద్ధతీసికొనవలెను. మనజనులు వారి బీదస్థితి వదలినగాని చదువునందు శ్రద్ధపుచ్చుకొనరు. కావున వారి బీదతనము వదలు ఉపాయములు వెదుకవలెను.

నీటిపారుదల:—కాలువనీళ్లు పొలమునకు పంపుళ్లుచేయుట. పెద్దనదులలోని నీరు వృథాగా ఎక్కువగా సముద్రములో పడుచోట్ల మంచిమంచి ఆనకట్టలు కట్టుటకు ప్రభుత్వమువారిని కోరవలెను. నెల్లూరికి సుమారు 40 లేక 45 మైళ్లదూరమున సోమశిలయను కుగ్రామముకలదు. అక్కడ పెన్నానది రెండు కొండలమధ్య ప్రవహించుచున్నది. ఆయూరియందు మంచి డామ్ (dam) కట్టినయెడల యెన్నియో ఎకరములభూమి సాగుబడియగును. కావున అటువంటి చోట్లయందు ఏటినీరు వృథాగాపోకుండునట్లు చూడవలెను. రోడ్లురిపేరుచేయుట, వీథులయందు దీపములుపెట్టుట, వాగులు, గుంటలు పెద్దవియున్న వాటికి వారధులు, మెట్లు మొదలగునవి కట్టించుట ఇవియన్నియు గ్రామపంచాయితీలక్రింద జరుగవచ్చును.

## సహకార పరపతిసంఘములు

సహకారము, పరపతిసంఘములు, అప్పులిప్పించుట, రైతుపండించినసరుకు సరసమైనవెలలకు అమ్ముట మొదలైనపనులు వీటిద్వారా జరుగును. మరియు నేతగాండ్రసంఘములు స్థాపించి వాళ్లకప్పులిప్పించుట, నూలు సమకూర్చుట, వారిబట్టలమ్ముట, మొదలైన పనులుచేయుచుందురు. ఇంతేకాక సంతలకుపోయి వ్యవసాయమునుగూర్చి ఉపన్యాసము లిచ్చుచుందురు. మరియు వ్యవసాయప్రదర్శనపుడిపోలుపెట్టి మంచి విత్తనములు తెప్పించిఅమ్ముట, క్రొత్తజాతిధాన్యములు నాటుట, మంచియెరువులువేయుట మొదలగు పనులుచేసి గవర్నమెంటు వ్యవసాయపు యిలాకావారికంటె ఎక్కువ నమ్మకము కలిగించవలెను. మరియు సంవత్సరమునకు ముప్పదినలుపది గుడ్లనుపెట్టి 6 మొదలుకొని పదిఅణాలు ఖరీదుచేయు మనదేశపుకోళ్లకు బదులు యెక్కువ ఖరీదైనను సీమకోళ్లనుపెంచుటయే లాభకరము. సహకారపరపతిసంఘముల పునాదులు ప్రైమరీ సొసైటీలులేక గ్రామసంఘములు. ఇట్టిసంఘములు కొన్నికలసిన యొకయూనియన్ యగును. దీనికి ప్రైమరీ సంఘములను తనిఖీచేయుట, ప్రచారముచేయుట అనురెండు పనులుండును. ప్రైమరీసంఘములలో వ్యక్తులుందురు. అవ్యక్తులకొరకే సమస్తసంఘములును స్థాపింపబడియున్నవి. ఇట్టి ప్రతియూనియనుకు నొకసూపరవైజరుండును. ఇట్టి యూనియన్లు కొన్నికలసి ఒకజిల్లాఫెడరేషను అగును. వీరిజీతముకొఱకును ప్రచారముకొఱకును ప్రతిఫెడరేషను సూపర్వైజనుఫండు అని కొంతసొమ్ము నిలువయుంచుదురు. ఇదిగాక ఆంధ్రసహకారసమ్మేళనమొకటున్నది. దీనిపని ప్రచారము, విద్యనేర్పుట. ఈపనియంతయు గ్రామోపాధ్యాయులు పూనుకొనవచ్చునో కాదు. వారే గ్రామములకు దీపములవంటివారు. ఇటువంటిప్రచారములు జరుగుటకును, సంస్థలుబాగుగ కొనసాగుటకును ప్రజలకు విద్యముఖ్యావసరము. వారికి విద్యనేర్పుటకు తగినశ్రద్ధ పుచ్చుకొనవలెను.

## ఎడల్టు ఎడ్యుకేషను

ఎడల్టుఎడ్యుకేషను అనగా విద్యావయస్సుమీరిపోయినవారికి విద్య యెట్లు నేర్పవలెననునది. బొమ్మలఅట్టలు వాటిమీద వాక్యములు మొదలగుచార్టుల మూలముగ బోధింపవలెను. స్త్రీలు, ఉపాధ్యాయినిలుగనుండువారును, గ్రామపునర్నిర్మాణోద్యమసంఘమున మెంబరులుగనుండు వారును, గ్రామములవెంట తిరిగి స్త్రీజాతికి విద్యగఱపుటకు ప్రయత్నించవలెను. సాధారణముగ స్త్రీలకు పాటలమూలకముగ చెప్పిన విషయములే యెక్కువజ్ఞాపకములో నుండును గావున వారికి జాతీయగీతములు, కొన్నిసంగతులు పాటలు విధముగజేసి వారికి నేర్పవలెను. స్త్రీలకు గృహపరిశ్రమలయందు ఎక్కువ ప్రోత్సాహము కలుగజేయవలెను. ఇతరదేశములలో జరుగు విషయములను కథలరూపకముగ వారికినేర్పవలెను. ఇంకను మ్యాజికులాంతరుల మూలమున కలరా, ప్లేగు మొదలగు అంటురోగములు, వాటి పుట్టుక, వ్యాప్తి మొదలగుయంశములనుగూర్చి వారికి బోధచేయవలెను. ప్రసవములు, అవి యథాక్రమముగా జరుగుట, వాటిహాని, శిశువులు, వారివ్యాధులు, వారిపోషణమొదలగు విషయములతెలియజేయవలెను. పాశ్చాత్యదేశములలో స్త్రీలు వారుండుపద్ధతులు, వారి వారి దేశసేవమొదలగు విషయములను చెప్పవచ్చును. పురుషులకంటెను స్త్రీలకే, పూర్వాచారములన్న యెక్కువపట్టుదల కావున వారికి తగుమార్గమున బోధచేసి అస్పృశ్యతను తొలగించవలెను. త్రాగుడు తొలగునట్లు చిన్నిచిన్ని కథలను చెప్పవలెను. రామాయణము, భారతము మొదలగు పురాణములలోని కొన్నికొన్ని బొమ్మలనుచూపి వాటిమూలమున వారికి కొంతపురాణమును చెప్పవలెను. ఒక్కొక్కజాతీయనాయకుని దేశీయవీరుని మొదలగుమహాపురుషుల,స్త్రీలపటములుచూపి వారు చేసినపనులు సంస్థలు మొదలగునవి నేర్పవలెను. ఇట్లే క్రమక్రమముగ భారతదేశరాజ్యాంగతంత్రము దానికిని ఇంగ్లాండుకునుగల సంబంధము ఇండియాపరిపాలనము దానిశాఖలు, రాష్ట్రీయపరిపాలనము మొదలగు పాలనములు వాటిశాఖలు మొదలగు నంశములన్నియు, చిత్రములమూలమున పెద్దవాళ్లకర్థమై ఆసక్తిపుట్టువిధమున బోధపరుచవలెను. మనదేశములోని కర్షకుడు, వానిబీదస్థితి, అతనిని కాపాడవలసిన విధము, ఇతరదేశములలో వ్యవసాయమెట్లు చేయుదురో, వ్యవసాయములో క్రొత్తపద్ధతులు మనదేశముననెట్లు స్థాపించవలెనో ఉపన్యసించవలెను. సహకారపరపతిసంఘములు వాటియుద్దేశ్యములు తెలుపవలెను. మెల్ల మెల్లగ మనగ్రామస్థులకు చదువుయందు యాసక్తికలుగునట్లు చేయవలెను. దీనికొఱకు గ్రంథాలయములు స్థాపింపవలెను. పాశ్చాత్యదేశములలో కూలివారలైనను సాయంకాలము వారియిండ్లకు పోవునప్పుడు దైనికపత్రికలుకొని చదువుకొనుచుందురు. మనదేశీయులకు, నాటకములవలనను, బయస్కోపులవలనను, వీధిభాగవతములు, తోలుబొమ్మలాటలు మొదలగు వానిమూలమున గూడ విద్యగఱపవచ్చును. గ్రామములను పునరుద్ధరించుటకు, తగుమనుష్యులను వెదకి ప్రచారములు జరుపవలెను.

## గ్రంథాలయములు

ఈకాలమున జనసామాన్యమునకు విద్యగఱపుటయెట్లు అనుసమస్యయే బయలువెడలుచున్నది. పెక్కుమంది యొకరికితోచినట్లు వారునుడువుచున్నారు. ఈకాలమున చదువవచ్చినవారే జ్ఞానవంతులనియు తదితరులందరు మూఢులనియు సిద్ధాంతముగానున్నది. అందుకొరకు ఎలిమెంటరీవిద్య నిర్బంధము చేయుటకు తీవ్రముగ ప్రయత్నములు జరుగుచున్నవి. ఎలిమెంటరీవిద్య సర్వసామాన్యము చేయుటకు కొన్నియేండ్లయినను తప్పకపట్టును. ఇప్పటికాలపు పిల్లలకందఱకును ఇకముందువచ్చువారందరకును మనము చదువుచెప్పించినను పెక్కుమంది ప్రైమరీపాఠశాలతోనే దమచదువును చాలింతురు. కనుక వీరుతిరిగి వారిచదువంతయు మరచిపోకుండ భద్రపరచుటకు పాఠశాలలకంటె భిన్నమగుసంస్థ యెప్పుడును ఉండితీరవలెను. జనసామాన్యమును

జ్ఞానవంతులుగఁజేయుటకు మన పూర్వులేర్పరచిన సాధనవిధానము ఆదర్శప్రాయికముగనున్నది. పురుషులైననేమి, స్త్రీలైననేమి, చిన్నవారైననేమి, పెద్దవారైననేమి, చదువువచ్చినవారైనను, చదువనివారును, భాగ్యశాలురైననేమి, బీదలైననేమి, సమిష్టిజాతియందలి ప్రతివ్యక్తియందు నిమిడియున్న శక్తులన్నిటిని దోహదముచేసి అభివ్యక్తముచేయుటకు సర్వవిధములసమర్థమైనవి. పురాతనపు సంస్థలను మనము పరిశీలించినచో ఈయంశముబోధపడును. ప్రథమమున మనదేవాలయముల తీసికొందము. హిందూదేవాలయములు వివాహమునకు సాక్షి. సాధుజనులకు మఠము. పాంథులకు ధర్మశాల. విద్యార్థులకు విద్యాలయములు. సర్వజనులకు చిత్రకళాశాల. బీదలకుఅన్నసత్రములు. భక్తులకు దేవతాగృహములు. మనగ్రామోత్సవములు, జాతీయములగు పండుగలు, గ్రామచావడులు మొదలగు సంస్థలిట్టివియే. మనపురాణకాలక్షేపములు, హరికథలు, జంగంకథలు, బొబ్బిలిపాటలు మొదలగు సంస్థలన్నియు చదువువచ్చినవారికేగాక మనుష్యసామాన్యమున కెవ్వరికేని వినోదమునిచ్చుటకే గాక జ్ఞానదానముచేయుటయందు మిక్కిలి సమర్థములైయున్నవి. పూర్వకాలమునుండియు మనదేశమున వచ్చుచున్న ఉత్తమసంస్థల కాధారభూతములగు మూలసూత్రములను పాశ్చాత్యదేశములందును మనకు సమీపమునందున్న బరోడారాష్ట్రమందును వర్థిల్లు గ్రంథాలయముల నడుపువారవలంబించుచున్న కార్యవిధానమును సామరస్యముగా మనదేశపు స్థితిగతులకనుగునట్లు సమన్వయింపచేసి పరిణామము నొందిన యుత్కృష్టమగు సంస్థగావర్థిలుచున్నది. గ్రంథాలయమునకు ముఖ్యముగా స్వంతమైనదిగాని, అద్దెగాని ప్రత్యేకపుటిల్లుగాని గదిగాని యుండవలెను. స్వంతయిండ్లు లేనిచోట దేవాలయపు ఆవరణలోకాని గ్రామసత్రములోకాని వేరొకగదిని నొకదానిని సంపాదించవచ్చును. పిమ్మట కొన్నిగ్రంథములు, బీరువాలు, బల్లలు లేక చాపలు దీనియొక్క ముఖ్యపరికరములు. పుస్తకములసంఖ్యనుబట్టి గ్రంథాలయముయొక్క మేలిమినిచెప్పవీలులేదు. వీనికన్నిటికంటే గ్రంథాలయమునడుపు, కార్యనిర్వాహకుని సద్వర్తనము, ఓపిక, సేవాపరతంత్రత మొదలగునవియే గ్రంథాలయముయొక్క యుత్కృష్టతకు ప్రబలనిదర్శనములు. ఆధునికగ్రంథాలయముల విధ్యుక్తధర్మము, భిన్నరుచులుగల ప్రజలను, యన్యోన్యసహాయభూతులుగను, వారికనువగు సాధనముల నవలంబించి కృతకృత్యులచేయుటయే. మన గ్రామములోని ప్రజలలో కొద్దిమందికే యింగ్లీషుచదువు వచ్చును. అక్కడక్కడ ఆంధ్రమునందో సంస్కృతమునందో పాండిత్యమునందిన పండితులున్నారు. మన ఆధునికగ్రంథాలయములు వీరందరిని ఆకర్షించియు, వారికందరకు ఉపయుక్తముగానుండుటకును సమర్థమైయుండవలెను. అదియెట్లన మనపండితులకు ప్రాచీనవిద్యలువచ్చు. ఇప్పటివిద్యలురావు. అప్పుడప్పుడుగాని ప్రతిరోజుగాని యీపండితులు ఏనాటకమునుండియో, పురాణమునుండియో, యేభాగమైచదివి యర్థము చెప్పవచ్చును. అట్లే హూణవిద్యనభ్యసించినవారు వాయువిమానములనుగూర్చియు, జలాంతరములు మొదలగు విచిత్రములగురించియు ఇంగ్లీషుపత్రికలలోని ఇప్పటివిశేషములు మొదలగునవి గ్రంథాలయమునకు వచ్చువారికి చెప్పవచ్చును. ఈవిధమున జ్ఞానాభివృద్ధికలుగజేయవచ్చును. "ఒకప్పుడు ఆంధ్రదేశమందలి గ్రంథాలయముల నన్నిటినిగూర్చి విచారించగా 600 సంఘము లెక్కకువచ్చినవి. ఇప్పుడు చాలసంస్థలు అంతరించినవి. ఈసంఘములన్నిటిలోను పశ్చిమగోదావరిజిల్లాలో భీమవరంతాలూకా కుముదవల్లిగ్రామమందు **1897** సం॥ స్థాపింపబడి దినదినప్రవర్థమానముగా ప్రకాశించుచున్న వీరేశలింగగ్రంథాలయము సర్వవిధముల ప్రశంసార్హముగానున్నది. దీనికి స్వంతభవనమున్నది. వరపతిసంఘము యిందే నెలకొల్పబడియున్నది. ఈసంఘముయొక్క కార్యనిర్వాహకవర్గమువారు పరిపాలించుటకు కొందరు యుదారులు ధర్మఖండముల నేర్పర్చియున్నారు. వానినుండి వచ్చువడ్డీని ప్రతిసంవత్సరము బీదలకు వస్త్రదానముచేయుటకు, ఇతరజనోపకారములగు పనులుచేయుటకును నిర్ణయింపబడియున్నది. గుంటూరుజిల్లా వేటపాలెపు గ్రంథా

లయమువారు వ్యాయామక్రీడలజరిపి గెలుపొందినవారికి బహుమతులిచ్చుచున్నారు. కృష్ణాజిల్లా గుడివాడ తాలూకా అంగలూరుగ్రామమునందు వర్ధిల్లుచున్న బాలసరస్వతీగ్రంథాలయమందు ఆగ్రామసర్వస్వము ఫిల్లుబుక్కుగాయుంచబడియున్నది. అచ్చట స్త్రీలకు విజ్ఞానచంద్రికాపరీక్షలకును, పశ్చిమగోదావరిజిల్లా నర్సాపురం పరీక్షలకు తరిఫీదుచేయుదురు. బెజవాడ రామమోహనలైబ్రరీయందు బాలురకు ప్రత్యేకశాఖకలదు. రాజమహేంద్రవరం గౌతమీగ్రంథాలయమువారును, ఇంక ఇతరచోట్లను స్త్రీలకు వారియిండ్లవద్దకే వారు కోరెడుపుస్తకములను పంపుదురు. కొన్నిగ్రంథాలయములు కరపత్రములను ప్రకటించును. మరికొన్నిటియందు పరీక్షలుజరిపి బహుమానములిత్తురు. బాలసంఘములందు జాతీయోత్సవములు, గ్రామోత్సవములు జరుపబడును. ఇదియదియననేల నిర్దిష్టమగు మార్గములనవలంబించి వ్యక్తికిని సంఘమునకును అభివృద్ధికరములగు సత్కార్యాచరణమంతయు గ్రంథాలయములు జరుపవలసినపనియే. కొన్నిపనులు గ్రంథాలయపక్షమున నే జరుపవచ్చును. మరికొన్నికార్యములుజరుగుటకు కావలసినదోహదమును గ్రంథాలయమిచ్చును. ఆంధ్రదేశపు గ్రంథాలయములన్నింటియందు రీడింగురూములున్నవి. ఇవియన్నియు పబ్లికుసంస్థలే. అనగా ప్రజాసామాన్యమందరును రుసుము చెల్లించకనే, వారు వానియావరణమందున్నంతకాలము అందువలనకగ్గెడిలాభమును పొందవచ్చును. ఇండ్లకు పుస్తకములు పేర్లుతీసుకొనిపోవువారు చందాలనుగాని విరాళములనుగానిఇచ్చెదరు. నెలసరి ఆదాయములేనివారుతమచందాలను వార్షికముగాగాని అర్ధసంవత్సరమునకుగాని చెల్లింతురు. అచ్చటచ్చటపరిస్థితులనుబట్టి మార్పుజరుగవచ్చును. క్రొత్తగనేర్పడు గ్రంథాలయములుకూడ ఈమార్గములననుసరింపవచ్చును.

* గ్రంథాలయములయందు బాలశాఖలు ప్రత్యేకముంచవలెను. ఇందు పిల్లలకు ఆసక్తిగొలుపువిషయములను పాటలు ఆటలుమూలముగనే నేర్పవలెను. ఇట్టి బాలశాఖను జయప్రదముగ కొనసాగుటకు స్త్రీలనుపరిపాలకురాండ్రనుగా నేర్పరచుటమంచిది. పిల్లలకు స్త్రీలకడచనవుమెండు. స్త్రీలకు పిల్లలను లాలనచేయు నేర్పుకలదు. కావున గ్రంథాలయకార్యనిర్వాహకులకుచక్కని చేయూతనొసగవచ్చును. గ్రంథభాండాగారాధికారి శాంతస్వభావుడైయుండవలెను. ఎవరు ఏకాలమందు ఏగ్రంథముకావలయుననినను విసుగుకొనక ఇవ్వవలెను. కొద్దివారు, గొప్పవారుఅను భేదములేకుండా సరస్వతీదేవియనుగ్రహమునకు యందరు సమానులేయని భావింపవలెను. అతనికి యన్నివిషయములు తెలిసియుండవలెను. ప్రాచీనవిషయములనుండి నవీనవిషయములవఱకు యన్నింటియందు తగుపాండిత్యమలవడియుండవలెను. ఏయేవిషయములందు జ్ఞానముసంపాదించుటకు యేయేగ్రంథముల చదువవలెనో చెప్పజాలియుండవలెను. గ్రంథాలయమందలి ఏవిషయమును జూచుటకువచ్చువానికైన, లేక తమాషాజూచుటకు వచ్చువానికైన, గ్రంథపఠనాభిలాషను గలిగింపవలెను. భాషయందు ప్రచురింపబడుచున్న సద్గ్రంథములు ఎందెందు ప్రచురింపబడుచున్నవో తెలుసుకొని వానిని ఆర్జింప భాండాగారాధికారి ప్రయత్నించవలెను. గ్రంథాలయమునకు వచ్చుగ్రంథములనన్నింటిని జదువుటకు ప్రయత్నించవలెను. అధమము వానియందున్న విషయములనైన బాగుగాగ్రాహ్యముచేసికొని యుండవలెను. తాను జదివినవిషయములు ఇతరులకుచెప్పవలెను. సమర్థులగువారిచే అప్పుడప్పుడు వివిధవిషయములనుగూర్చి చర్చలు జరిపింపవచ్చును. ఇదిగాక, శక్తిసామర్థ్యములనుబట్టి స్త్రీశాఖ, క్రీడాశాఖమొదలగుశాఖలుకలుగజేసి, స్త్రీలను కూడ, గ్రామపునర్నిర్మాణోద్యమమునందు పాల్గొనుటకు వసతులను కలుగజేయవలెను. పాశ్చాత్యదేశములలో గ్రంథాలయోద్యమము యెట్లుజరుగునో కొంచెముచూతము.

* సూరి వేంకటనరసింహశాస్త్రిగారి వ్యాసమునుండి.

"The entire administration is carried on from this headquarter repositary. The repositary is in charge of the county librarian who is a man of powerful personality rich in resourcefulness and sound in professional equipment. Not only does he direct and control the work of the administrative staff at the head-quarters but also frequently tours through the country to do propaganda work, to enthuse the local librarians who are mostly honorary, to establish contact between the readers and the books by means of library talks, lantern lectures and other methods and above all to get first-hand knowledge of the requirements of the villagers. He uses every opportunity to advertise the county library service. Every branch or deposit station has the county library sign, which is a familiar mark of bright colour throughout the country side. No county-fair is allowed to pass without a library exhibition of some sort. The county map showing every branch library and deposit station is kept in view. One county librarian prepared a miniature farm-yard with toy cows, toy sheep and toy poultry etc. One end of a ribbon was attached to each toy animal while the other end was attached to a book about the animal." *

దీనినిబట్టిచూచిన ఆదేశములోని ప్రజలు యెక్కువ ఆసక్తితోను యుత్సాహముతోను వారిపనిని కొనసాగించుచున్నారు. మన ప్రజలకు పోమరితనముయెక్కువ. కావున మనదేశీయులు వారిపోమరితనమును పోగొట్టుకొని ఈయుద్యమము బాగుగనడచునట్లు ప్రయత్నించవలెను.

## సంచార గ్రంథాలయములు

సంచారగ్రంథాలయములనగా ప్రత్యేకముగా స్థిరమగు గ్రంథాలయములు స్థాపించుటకు తగినవీలులేని గ్రామములందును పట్టణభాగములందును జనసామాన్యమునకు ఉపయుక్తముగా నుండుటకై యితరస్థలముల నుండి పంపబడుపుస్తకసముదాయములు. ప్రతిచదువరియు గ్రంథాలయమువద్దకువెళ్లి గ్రంథమును తీసుకొనుటకు సావకాశముండదు. మనదేశపు స్థితిగతులనుబట్టి స్త్రీలు గ్రంథాలయములకురారు. పెక్కుమందికి సమీపమునకు గ్రంథమువచ్చినగాని చదువవలెనని కోర్కెపుట్టదు. వీరియందరి యుపయోగార్థము సంచారగ్రంథాలయపేటిక లేర్పరుపబడినవి. ఈపెట్టెలయందు సామాన్యజనులకు ఆసక్తికలిగించు పుస్తకసముదాయములను ఊరూరికిపంపవచ్చును. ఈపెట్టెలు బండ్లమీదకాని సేవకులమూలమునకాని పంపవచ్చును. ఈపెట్టెలతోకూడ, అందుండుపుస్తకముల పట్టికలు కరపత్రముల మూలముగ వెల్లడిచేయవచ్చును. ఒకయూరనుండువారు చదివిన తర్వాత ఇంకొకగ్రామమునకు వెళ్లుచుండును. ఈవిధముగనే మ్యాజికిలాంతరులను కూడ పంపవచ్చును. ఈగ్రంథాలయపేటికలమూలమున మనతాలూకాబోర్డువారు, మిక్కిలి సుకరముగా విద్యాభివృద్ధిచేయవచ్చును. దీనికి ఉపాధ్యాయులెంతయు సహాయముచేయుటకు సావకాశములుండును.

కావున మనపల్లెల యభివృద్ధికి, పునర్నిర్మాణమునకు స్త్రీపురుషులు ఇరువురు బాధ్యులే. స్త్రీలు కూడ తమకు చేతనైనంతసహాయము చేసి యీయుద్యమము జయప్రదముగ కొనసాగించవలెను. అట్లు చేయుటకు మన స్త్రీలలో పెక్కుమంది ఉపాధ్యాయినులుగను, వైద్యవిద్యయందును నిపుణులుకావలెను. పాశ్చాత్యదేశములకు ఉన్నతవిద్యలకై వెళ్లుస్త్రీలు అక్కడి గ్రామములు, వాటివిద్యాభివృద్ధి మొదలగునవి నేర్చికొనివచ్చిన మనమెంతయు ధన్యులము. ఈఉద్యమము బాగుగజరుగుటకు, కొందఱు స్త్రీపురుషులు మన గ్రామములోని మంచిచెడ్డల తెలిసికొని, మనగ్రామస్థులకు సహాయముచేయుటకు వారిముందు బాగుగతరిఫీదైన తర్వాత యుద్యమమున పాల్గొన్నయెడ జయప్రదముగ కొనసాగును.

ఈయుద్యమ మెంతయు జయప్రదముగ కొనసాగు గాక!

* Rural library service in the west. By S. R. Ranganathan.

# దానిమ్మ

డాక్టరు యస్. శేషగిరి రావుగారు యల్.ఐ.యమ్.

## PUNICA GRANATUM

### సంస్కృతనామములు

దీనికి సంస్కృతమున దాడిమఫల, కుచఫల, శుకాదన, దాడింబ, దాడిమ, కరక, పిండపుష్ప, పర్వరుహాట్, స్వాద్వమ్ల, పిండీర, ఫలాశాడవ, శూకవల్లభ, ముఖవల్లభ, రక్తపుష్ప, డాలిమ, దాడిమీసార, కుట్టిమ, రక్తబీజ, సుఫల, దంతబీజక, మధుబీజ, రోచన, మండిబీజ, కల్కఫల, వృత్తఫల, సునీల, నీలపత్ర అను నామములుగలవు.

### ఇతరభాషానామములు

దీనికి ఇంగ్లీషున పౌమిగ్రనేటు; ఫ్రెంచిభాషయందు గ్రెనాడియరుకల్టివ్; జర్మనుసందు గ్రెనాట్ బామ్, హిందీయందు అనార్, దారిమ్; పారశీకమున గుల్నారు, అరబిక్ భాషయందు రుమ్మన్, కాశ్మీరమున ధాన్, గుజరాతియందు దాడమ్, దాళమ్, మహారాష్ట్రమున, కొంకణదేశమున దాళింబ; తెనుగున దాడిమ, దానిమ్మ; తమిళమున మాదలై, మాదలైపళమ్; మళయాళమున మాతలమ్; సింహళదేశభాషయందు దెలుంగహ; బర్మాభాషయందు శాలిబిన్, తాళిబిన్; మలైయందు దాళిమ; వంగభాషయందు దాళిమ్, దారిమ్; ఉర్దూభాషయందు అనార్ అనియుపేళ్లు.

### పూలదానిమ్మ

దానిమ్మ చెట్లలో ప్రత్యేకము పూవులనుమాత్రమే పూయుజాతిగలదు. హిందీ, అరబిక్, పర్షియన్ భాషలయందు జల్నారు, గుల్నారు అనియు, తమిళభాషయందు పూమాదలై అనియు; కన్నడమున హూషీదాళింబ అనియు పూలదానిమ్మచెట్టుకుపేళ్లు ఒప్పియున్నవి.

### దానిమ్మరకములు

కాయలు కాయు దానిమ్మయందు ప్రాయికముగా తీపు, పులుపు అనురెండురకములుగలవు. ధన్వంతరినిఘంటువునందు ఈరెండురకములే చెప్పబడియున్నవి. కాని భావప్రకాశికయందు ఈతీపు, పులుపురకములు రెండునుగాక తీపుపులుపురుచులు మిశ్రితమైన రకము మఱియొకటి సూచింపబడినది.

### అన్వర్థసంజ్ఞానామములు

దాడిమకుగల నీలపత్రః, లోహితపుష్పకః, స్వాద్వమ్లః, రక్తబీజః, దంతబీజః, మణిబీజః, మధుబీజః, సుఫలః, కుచఫలః, వృత్తఫలః, వల్కఫలః, శుకవల్లభః అనుసంస్కృతనామములను బట్టి దానిరూపగుణమును పోల్చుకొనవచ్చును.

### దాడిమప్రవర్ధనము

హిందూదేశమునందెల్ల యెడలను సేద్యముచేయబడు ఫలవృక్షములలో దాడిమ యొకటి. పారశీకము, అఫ్ఘనిస్థానము, బెలూచిస్థానము, దక్షిణయిరోపాఖండము, బార్బరీ, జపానుదేశములందీ ఫలవృక్షములు అనాదినుండి వర్థిల్లుచున్నవి. ఈఫలములలో తియ్యని రసము, మిక్కిలి చిన్నగింజలుగల శ్రేష్ఠమైనరకము కాబూలుదేశమున ఫలించుచున్నది. హిందూదేశమున ఫలించు దాడిమఫలములు పారశీకదేశమునుండి దిగుమతినొందువానికి మిక్కిలి లొచ్చుగానున్నవి.

### ఉపయోగించు భాగములు

వైద్యోపయోగమునకు గైకొనబడు భాగములలో పూవులు, పండుయొక్కతొక్క, పండుయొక్కరసము, కాండముయొక్క ఎండినపట్ట, వేరు ముఖ్యములయియున్నవి.

### దానిమ్మపండు: దాని నిర్మాణము

దాడిమఫలము నారింజపండంత యుండును. సాధారణముగ నారింజపండుకంటె పెద్దదిగగూడనుండును. అయితే నారింజపండువలెగాక దీనిత్వక్కు గట్టిగనుండును. పండు చివర అయిదుమొదలు తొమ్మిదివఱకు విడికొనలు తేరి గిన్నెవంటి ఆకృతితోనుండును. పండుయొక్క తొక్క నరునిచర్మమువలెనుండి నునుపుగానుండును. వర్ణము ఎరుపుతో గూడిన గోధుమవర్ణము. పండుయొక్కలోపలిభాగము సన్ననిపొరలచే గదులుగదులుగా విభజింపబడియుండును. ఇట్టిగదులలో ఒక్కొక్కదానియందు పెక్కుగింజలుండును. ఈ గింజలు సాధారణముగ నాలుగుప్రక్కలుగలిగి దాదాపు అరంగుళము నిడివిపాటుగానుండును. అవి పెక్కు ప్రక్కలుకలిగియుండుటయుగలదు. గింజను గుంజు ఆవరించియుండును. ఆగుంజుకొంచెము ఎరుపువర్ణముగలిగి రసముగలిగియుండును. ఈగుంజునుండి లోనిగింజను చూడవచ్చును. పండుయొక్కపట్ట వంకరటొంకరగాను, ముక్కలుచేసినచో సొట్టపల్లముగాను, అంగుళమున ఇరువదియవవంతో పదియవవంతోయగు దళసరిగాను ఉండును. పైదోలు పసిమితోగలసిన గోధుమవర్ణమునుగాని ఒకమోస్తరు ఎరుపురంగునుగాని గలిగియుండును. లోదోలువర్ణము పసిమిగాగాని కొంచపాటి గోధుమవర్ణముగా గాని ఉండును. రుచికి అదివగరుగనుండును. ఎట్టివాసనయు లేకుండనుండుననియే చెప్పవచ్చును.

### దానిమ్మపట్ట

కాడయొక్కపట్ట మూడునాలుగు అంగుళముల నిడివిగల ముక్కలుగ వర్పడును. ఆపట్టయొక్క పైభాగము గరుకుగరుకుగాను పసిమికొంచముకలసిన ముదురు ఎరుపు వర్ణముగాను ఉండును. లోపలిభాగము మిక్కిలి నున్నగాను పసిమిమించగలసిన గోధుమ వర్ణముగాను ఉండును. రుచికి నిదియు దానిమ్మపండుతొక్కకువలె వగరుగానేయుండును. ఎట్టివాసనకూడనుండదు.

—మిగిలియున్నది.

## రంగసీమ

### సులోచనకన్య

డి. వి. కృష్ణయ్యా, సి. వి. లక్ష్మణరావుగార్లు

ఈమెయొక్క అసలునామధేయము మిస్. రూబీమేయర్సు. "జ్యూ" తెగకుచెందిన యువతి. ఈమె పూనాపట్టణములో 9-10-1907లో జననమొందెను. ఈమె మొదట కాన్వెంటుస్కూలులో విద్యాభ్యాసముచేసెను. పిమ్మట మూడుసంవత్సరములు టెలిఫోనుబాలికగా తనజీవితమునడిపెను. ఈసమయములోనే ఈపె హిందూదేశపుదుస్తులతో నొకఫోటో తీయించుకొనెను. ఈపెయొక్క ఛాయాచిత్రమును యప్పటి కోహినూరుఫిల్ముకో వారియొక్క డైరెక్టరగు భవానీగారుగాంచి తన కంపెనీలో నొక ముఖ్యనటకురాలుగా నియమించెను. ఆకంపెనీలో "వీరబాల" యను మొదటిఫిల్ములోనటించి గొప్పపేరుగాంచెను. ఆఫిల్ములో నీమెకు ఘనతవచ్చుటచే ఫిల్మురాజ్యములో నీమెయొక ప్రధాననటకురాలయ్యెను. "ఫిల్ముకో"లో చేరుటచే ఈపె తన టెలిఫోనువృత్తిమానివేసెను. అప్పటినుంచి నేటివఱకును ఫిల్ముపరిశ్రమలోనే మునిగియుండెను. ఈమె 25-10-1925 లో అనగా తన 18-వ యేటను ఫిల్ముసామ్రాజ్యములోచేరెను. 1925-సం॥ మొదలు 1930సం॥ లోపున "కోహినూరుఫిల్ముకో" వారికి 8 ఫిల్ములను, "ఓరియంటల్ ఫిల్ముకో" వారికి 1 ఫిల్మును, "ఇంపీరియల్ ఫిల్ముకో" వారికి 12 ఫిల్ములను నటించియిచ్చెను. ఈమెముఖ్యముగా రాజాశాండో, జాల్‌మర్చంటు, డి. ఆర్. బిల్లిమోరియా, మాష్టరువిఠల్ మొదలై నటులతో నటించును. ఈమె నటించినముఖ్యమైనఫిల్ములు "అనార్కాలీ" "మాధురి" "బొంబాయి బావురుపిల్లి" "హీరరంజ" "పంజాబుమైల్" "సినిమారాణి" "టైపిస్టుగర్లు" "విలేజిగర్లు" "సోర్డుటు సోర్డు" "సాక్రిఫైస్" "కిస్మ్యాఆఫ్ దికిస్మెట్టు". వీటిలో అతిచమత్కారముగా నటించెను. వీటివలననే యీపె నామధేయము హిమాచలము మొదలుకొని కన్యాకుమారివఱకు ఇండియాఅంతటిలోను వ్యాపించెను. భారతసినీమాలోకమున ఆమె నామము బహుళ ప్రచారముగలదియు, ఆమె ప్రతిష్ఠ సుస్థిరమైనదియు నయ్యెను.

ముఖము సంపూర్ణమైన చంద్రబింబమును ధిక్కరించును. సోగకన్నులు-తీరైన యవయవములు-ముద్దులొలుకు వదనము-సొగసైన నాసిక-పసుపువర్ణముగల శరీరచ్ఛాయ

గలిగి, అ5-అం 2లు పొడవుచే యొప్పుచున్నది. 1925 మొదలు 1930లోపుల ఇండియా సినీమానటకురాండ్రలో గొప్పపేరు సంపాదించెను. భావగర్భితములగు చూపులతోను-గంభీరమైన అభినయముతోను-తక్కిన నట్టువరాండ్రందరికన్న గొప్పగానటించును. కేవలము ఫిల్ముపరిశ్రమను హిందూదేశములో అగ్రస్థానమునకు దెచ్చుటకై కృషిసల్పుచున్నది. ఈమె బిల్లిమోరియాతో గలసినటించిన మేటిఫిల్ములగు "అనార్కాలి" "మాధురి" లండనునగరములోకూడ మిక్కిలి పొగడ్తగాంచెను. ప్రస్తుతము హిందూదేశమునందున్న సినీమానటకురాండ్రందరికన్న నీమెకే హెచ్చువేతన మిచ్చుచున్నారు. ఈమెయొక్క ప్రస్తుతపువయస్సు 23 వత్సరములు. ఈమెనటించిన ఆఖరు, నూతనఫిల్ములు "షాదరు యిండియా", "తాత్". ఈమెయొక్కనామధేయము ఫిల్ముసామ్రాజ్యములో వేగుచుక్కవోలె ప్రకాశించునుగాత! ఈమె చిరంజీవియగుగాక!

☞ పై మాసమున సుప్రసిద్ధసినీమానటి సీతాదేవి కన్య చరిత్ర సచిత్రముగ ప్రచురింతుము.

—సంపాదకుడు.

# పెండ్లికూఁతురు

సి. వి. పార్థసారథిగారు

చెల్వుని చెంతకుఁ జేడియల్ కొని తేర
  సిగ్గున వెనుకాడు చిట్టిపడక
చనువునిగ్గులఁ దేలు పాదాలఁజీరాడు
  మధుపర్కపుఁజెఱంగు మంజిమంచు
మురువుచిప్పిలుచుండు మోమునదిద్దిన
  కళ్యాణపుంబొట్టు కాంతిసోఁకఁగ
ధవునిపైపంతానఁ దలఁబ్రాలుపోసిన
  పాణిద్వయముమీఁది పసిమిమిసిమి
వేడ్కమీఱంగఁ బెండ్లిపీఁటపైని
సిగ్గుదొంతర తలవంచి చెలువుజూప
వరునిప్రక్కను గూర్చుండు వధువునకును
నిత్యసౌభాగ్యసంసిద్ధి నెగడుఁగాత!
సాప్తపదీనంపు సఖ్యమ్ము వేళను
  నడకువతోఁ గాడ నడుగుఁబెట్టి
కాడిసాత్యమెసలఁగ గార్హస్థ్యమునుబూని
  సహభాగినినటంచుఁ జనువుజూపి
అలయరుంధతికి మొక్కులుపెట్టితలనెత్తి
  వ్రతము దెల్పెడిరీతి వరునిజూచి

చెలులతో డ్పాటుతోఁ బెండ్లాటవేళలఁ
  ప్రణయమాధుర్యంబుఁ బంచిపెట్టి
ప్రేమపట్టాభిషేకంబు వేళలందుఁ
బోలుపుమీఱెడి యందంపుఁబొట్లమైన
యగ్నిసాక్షిగఁగొన్న యర్థాంగికెపుడు
ప్రియము సౌఖ్యంబుఁ గూర్చుతఁ బెండ్లికొడుకు.
వాదనంబులుమీఁదు వశవర్తినివియంచు
  గుడమునుదలనిడి కూర్మి దెలిపి
పాకశాస్త్రరహస్యపటిమ నేర్పితినంచు
  మత్రప్పపంబులొసంగి చూపి నేర్పు
గార్హస్థ్యమును బూనఁ గంకణంబిదియంచు
  భాండంబునందిసి పతికిఁజూపి
ధరియింపుఁడీనాథ! భార్యనంచునుదను
  జిటికెనవ్రేలు సూచింపనొసఁగి
ప్రేమవాహిని తలమున్కబెట్టుటకన
అలవసంతోత్సవంబున కరుగుసఖియ
యిష్టసిద్ధులుకల్గి రంజిల్లుచుండి
యింపుప్రియునకు నేనాఁడునింపుఁగాక.

# బాలవిజ్ఞానశాఖ

౧. పదము

## తొక్కుపల్కులు

శ్రీమతి యన్. వి. సరళాదేవిగారు

తీగచూడు—
ఏమితీగ?
సన్నతీగ—
ఏమిసన్న?
జాజిసన్న—
ఏమిజాజి?
వీరజాజి—
ఏమివీర?
రాజవీర—
ఏమిరాజు?
పులిరాజు—
ఏమిపులి?
పెద్దపులి—

ఏమిపెద్ద?
కులముపెద్ద—
ఏమికులము?
పల్లెకులము—
ఏమిపల్లె?
మాలపల్లె—
ఏమిమాల?
పూలమాల—
ఏమిపూలు?
మల్లెపూలు—
ఏమిమల్లె?
అంటుమల్లె—
ఏమిఅంటు?

తలఅంటు—
ఏమితల?
జడతల—
ఏమిజడ?
నారజడ—
ఏమినార?
పట్టునార—
ఏమిపట్టు?
కారుపట్టు—
ఏమికారు?
బస్ కారు—

౨. పాటలు

## పడుచుమాట వినకురా

శ్రీమతి వల్లమూరి పుష్పవతిగారు

చిన్ని చిన్ని వెన్నెలకట్ట
సీతాపెండ్లి చెయ్యంగా
రామునిపట్నము కట్టంగా
వెంకటదీపము మండంగా

ఏటికాటికిబోకురా
ఎన్నుముల్లుతొక్కకురా
పచ్చిబియ్యంతినకురా
పడుచుమాటవినకురా.

## రామచిలుక

శ్రీమతి శ్రీరాములు నాగభూషణంగారు

ఇల్లలికిముగ్గేసి
పొయిమీద పప్పేసి

బర్రింకచెట్టుమీద
బావగారున్నారు

రమ్మనిచెప్పవే
రామచిలుకా!

## కితకిత పాట

శ్రీమతి కొండాలి వేంకటసుబ్బమ్మగారు

ఇల్లలికి ముగ్గేటి పప్పేటి బువ్వేటి అత్తవారింటికి దోవేదంటే
ఆకేసి పీటేసి పాలోసి పెరుగోసి కిత కిత కిత కిత.

## వినోదము

శ్రీమతి ఇందుర్తి శకుంతలగారు

వస్సారమరమ్మ మెజ్జానికి?
వేస్సారమప్రప్పు వేడినమట్టుకు
పోస్సారమనెయ్యి పొర్లచేరలనిండ
పొట్లకాయలకూరమ
రస్తాళియరట్లకాయలపులుసమ
అట్లుమీాఱినబొబ్బట్లట్లు వేస్సారమ
భోట్లవర్చలతిమ్మంభొట్ల పెత్తనమమ
నాసోదరీమణులందరికి
పండుగమీాదపండుగ
బక్ష్యాలమీాదబక్ష్యాలు
పాపంవారికి స్వరంవెళ్లిరావడంలేక
వుక్కిరిమిక్కిరనుటకు కూడ
వీలులేకున్నది వస్సారమమ్మ.

## వానపాట

శ్రీమతి చేబోలు లక్ష్మీనరసమ్మగారు

(వానకురిసేటప్పుడు పిల్లలుచేతులు తలపైని పెట్టుకుని గిరగిరతిరుగుతూ ఇలాగపాడుతారు.)

వానలుకురవాలి మాదాసిదంపాలి పువ్వుల్లుపుయ్యాలి
వరిచేలుపండాలి మాయమ్మవండాలి దండల్లుగుచ్చాలి
మాకొట్లునిండాలి మాబొజ్జనిండాలి దేవుడికివెయ్యాలి
బుడుగో, బుడుగో. బుడుగో, బుడుగో. బుడుగో, బుడుగో.

## తారంగం

శ్రీమతి సాకలరత్నమాలగారు

తారంగం! తారంగం! వేణూనాదా! తారంగం! చిన్నికృష్ణా! తారంగం!
తాండవకృష్ణా! తారంగం! వెన్నలదొంగా! తారంగం! కృష్ణకృష్ణా! తారంగం!

3. వినోదకథలు

## చెవిటివాని ముచ్చట

"మోరిస్సు"

ఒకపట్టణములో వొకవర్తకునికి వొకస్నేహితుడు వుండెను. అతనికి చెవులు వినరావు. ఆవర్తకునికి శరీరము స్వస్థములేదనివిని ఆచెవిటివాడు వానిదేహస్థితి యేలాగువున్నదో విచారించివత్తామని బయలుదేరి వెళ్లుతూ తనస్నేహితునితో తాను మాట్లాడవలసిన సంగతినిగురించి దోవలో యోచనచేసెను. యేమంటే నేను అతణ్ణిచూచి దండముపెట్టిన తర్వాత వోయి నీశరీరస్థితి యీారోజున యేలాగుఉన్నదని మొదట అడుగుతున్నాను,

కాస్తతిన్నగావున్నదని అతడుచెప్పును. నేను సంతోషమంటాను. అటుతర్వాత నీవుయేమి పథ్యముచేస్తావని అడిగితే చప్పిడిపథ్యమని అతడు చెప్పును. అందువల్ల నీకు ఆరోగ్యమవుగాక అనిచెప్పి నీకు ఔషధమిచ్చేవైద్యుడు యెవడని అడుగుతాను. ఫలానావాడు వైద్యుడు అని అతడు చెప్పుతాడు. అతడు చేసేచికిత్సలు సఫలము కావడానకు అతనికి దేవుడు సహాయముచేయును గాక అని చెప్పుతానని యీప్రకారం యోచనచేసుకుని అతనియింటికి పోయి అతనికి దండముపెట్టి అతనిదగ్గిర కూర్చుండి ఓయిస్నేహితుడా నీవొంట్లో యేలాగున వున్నదని అడిగెను. అతను ముమ్మరమైనజ్వరముతో బహుశ్రమపడుతున్నానని చెప్పెను. అతడుచెప్పిన మాటలు యీచెవిటివాడు గ్రహించలేక ముందుగాతాను యోచనచేసుకున్న ప్రకారమే అతడు జబాబుచెప్పుతున్నాడనుకొని సంతోషం దేవుడు నిన్ను ఆలాగేవుంచుగాక అనిచెప్పెను. ఆవ్యక్తుడు మునుపే రోగముచేత చాలాచిరాకుగావుండెను. కనక యీమాట విని మరియింత చిరాకుపడెను. ఆచెవిటివాడు నీకు పథ్యమేమని అడిగెను. యేమోనేలమన్ను పొమ్మనిజవాబు చెప్పెను. అందువల్లనే నీకు చాలా ఆరోగ్యమవుగాక అనిచెప్పి ఓయి స్నేహితుడా నీకు ఔషధమిచ్చే వైద్యుడుయెవడని అడిగెను. ఆరోగి కోపముతో మండిపడి యముడేనాకు వైద్యుడు అని చెప్పెను. అతడు చేసేచికిత్సలకు దేవుడున్ను సహాయమవుగాక అని చెవిటివాడు ఉత్తరమిచ్చెను.

## లుబ్ధదంపతులు

శ్రీమతి సత్యవతీకన్యగారు

ఒకగ్రామములో నొకవృద్ధలుబ్ధబ్రాహ్మణుండుండెను. అతడొకనాటియుదయమున దనయింటియరుగుపై గూర్చుని జందెములువేయుచుండెను. అంతలో ఎక్కడనుండియో యింకొకబ్రాహ్మణుడరుదెంచి 'అయ్యా! పొరుగూరినుండివచ్చిన బ్రాహ్మణుడను. ఈపూట మీయింటభోజనము బెట్టవలయును' అని వినయపూర్వకముగ అడిగెను. అంతలుబ్ధుడు పిడుగుపడ్డట్టివిధమున నిశ్చేతనుడై కొంతవడికి ధైర్యము దెచ్చుకొని 'అయ్యా! ఈదినమున మాయింటియామెకు కొంచెముకడుపునొప్పిగానున్నందున వంటచేయుటకు వీలులేదు. కావున మఱియొకచోటికి వెళ్లుటమంచిది'అని చెప్పెను. అంత బ్రాహ్మణుండు 'అయ్యా! నిన్నటినుండి భోజనములేనందున ఆకలిబాధకుతాళజాలకున్నాను. నేనిక్కడనుండి ఒక్కయడుగైన వేయజాలను. కావున ఎట్లయిన నన్ననుగ్రహింపకతప్పదు' అని యరుగుపై జదికిలబడియెను. బ్రాహ్మణుడు వదలిపోవునట్లు కనబడకుండుటచే లుబ్ధుండొకయుపాయము మనస్సునం దాలోచించుకొని యాతనితో నిట్లనియె. 'అయ్యా! నీయవస్థజూచిన నాకుమిక్కిలి జాలికలుగుచున్నది. మాయింటిలోని యవస్థచెప్పుకొనుటకే వీలులేకున్నది. అయినను నీవింతగాగోరుచుంటివి. కావున నీకుతప్పక భోజనము బెట్టించెదను. నీవుకొంచెము సేపిచ్చటగూర్చుండుము' అనిచెప్పి లోనికేగి భార్యతో రహస్యముగనిట్లనియె. 'ప్రేయసీ! ఎవడోయొక వృద్ధబ్రాహ్మణుడువచ్చి మనయింట నీపూట భోజనము బెట్టించవలయునని ప్రార్థించ మొదలుపెట్టినాడు. నీకు కడుపునొప్పివచ్చినదనియు, నీదినమున వంటసేయజాలవనియు నేనెంతచెప్పినవినక పిశాచివలెవదలకున్నాడు. వానిని చల్లగాసాగనంపుట కిప్పుడొకయాలోచనజేసితిని. ఎవరో భోజనమునకువచ్చినారనియు, త్వరగా

వంటసేయుమనియు, నేను నీకుజెప్పుచుందును. కడుపునొప్పిగానున్నదనియు, నేనీదివసమున వంటసేయజాలననియు నీవుచెప్పుచుండుము. అందుపై నేను కొట్టినట్లు నటింతును. నీవేడ్చుచున్నట్లు నటింపవలయును. వాడు మనగంద్రగోళమంతయు జూచి వచ్చినదారినిపోగలడు' అనిచెప్పి వీధిలోని బ్రాహ్మణునకు వినబడునట్లు బిగ్గరగాభార్యతో నిట్లనియె......'ఇదిగో! మనయింటికెవరో యతిథులువచ్చినారు. నీవుత్వరగ మడిగట్టుకొని వంటసేయవలయును' అనిచెప్ప భార్య 'అయ్యో! మూడుదివసములనుండి కడుపునొప్పిచేబాధజెందుచు ఎట్లో సోలెడుబియ్యము ఉడకబెట్టుచున్నదానను. ఈరోజున అట్లుసేయుటకుకూడ వీలులేకున్నది. వారినింకొకచోటికి బొమ్మనిచెప్పుడు' అని వచింప లుబ్ధుడు మహాకోపమునటింపుచు 'ఔనే! ఏమిప్రేలుచుంటివి? వారినింకొకచోటికి బొమ్మనుచుంటివా? నామాటపై నీకింత యలక్ష్యమా?' అని వీపుపై రెండుచరపులు చరచెను. అంతభార్య నేలపైబడి 'దైవమా! నేనీబాధపడజాలకున్నాను. నాకుదిక్కెవ్వరును లేరు. నన్ను శీఘ్రముగ నీచెంతకుదీసుకొనిపొమ్ము'అని పెద్దపెట్టున రోదనమొనరింపసాగెను. అంత లుబ్ధుడు మరింతకోపము నటించుచు 'పాపాత్మురాలా! ఆబ్రాహ్మణునియవస్థ యించుకైన నాలోచింపకపోవుటయేగాక నామాటపై గొంచెమైన విశ్వాసముంచక నాగౌరవమంతయు దీసివేయుచున్నదానవు. నీకుదగిన ప్రాయశ్చిత్తమొనరింపకున్న బ్రాహ్మణుడనుకాను'అని పలుకుచు జుట్టుపట్టుకొనిగట్టిగా దౌడలునొక్కుచుండ వీధిలోని బ్రాహ్మడు వారిపోట్లాటయంతయుజూచి 'అయ్యో! నాకు భోజనమక్కఱలేదు. పాపమామెను బాధింపకవిడిచిపెట్టుడు. నేనింకొకచోటికి బోయెదను'అనిచెప్పి వీధిగుమ్మముదాటి కొంచెమావలకుబోవునంత లుబ్ధుడత్యంతసంతోషమున 'ప్రియురాలా! నేను తలంచినట్లుగా బ్రాహ్మణపిశాచము వదలిపోయెను... నేను నిజముగాకొట్టినట్లు కొట్టితినినుమా!' అనిపలుక భార్య 'నాథా! నేనునిజముగా ఏడ్చినట్లేయేడ్చితినినుమండీ!'యని యనుచున్నంత గుమ్మమునకావలనిలిచియున్న అతిథిబ్రాహ్మణుడామాటలనాలకించి వెనుకకుదిరిగివచ్చి 'నేను నిజముగపోయినట్లేపోతిని సుమండీ!' అని నవ్వుచుబలుక నాలుబ్ధదంపతు లిరువురు సిగ్గుపడి లోనదూరిరి. బ్రాహ్మణుడు తన దారినిబోయెను. కథకంచికివెళ్లెను. మనమింటికివచ్చితిమి.

## తెలివితక్కువవాండ్రకథ

శ్రీమతి యర్రపోతు కనకరత్నముగారు

అనగాఅనగా ఒకవూరు. ఆవూరిలో ఒక బ్రాహ్మణుడు, ఒకడాక్టరు, ఒకమద్దెల వాయించు బ్రాహ్మణుడు, ఒకమంత్రగాడు ముఖ్యస్నేహితులు. ఒకనాడు వీరు షికారునకు క్రొత్తయూరు వెళ్లవలయునని బుద్ధికలిగెను. వీరు చాలతెలివిగలవారు. అటులనే వీరు తాము పోవలయుననుకొనిన వూరికిబోయి యచ్చటి సత్రములో బసజేసిరి. వీరికి వంటజేసుకొనవలయునని బుద్ధికలిగెను. అందుచే డాక్టరుగారు కూరగాయలు తెచ్చుటకై బజారునకు బయలుదేరెను; బ్రాహ్మణుడు బాదమాకులకై బయలుదేరెను; మంత్రగాడు ఒకగ్లాసును బట్టుకొని పెరుగు తెచ్చుటకై బయలుదేరెను; సత్రమునందు మద్దెలవాయించు బ్రాహ్మణుడు అన్నమువండుచుండెను. డాక్టరుగారు బజారుదుకాణములవద్దకువచ్చి కాయకూరలను బరీక్షించి అరటికాయలు వాతము, చలువ, విరోచనబద్ధము జేయుననియు; దోసకాయలు చలువజేయుననియు వంకాయలు వేడిజేయుననియు; కాయకూరలను కొనకుండా సత్రమునకు బోయెను. బ్రాహ్మణుడు బాదమాకులకై బాదముచెట్టుయొద్దకువెళ్లి ఆచెట్టును యెక్కుచుండగా బల్లిపలికెను. వెంటనే తన బొడ్డులోనుండు పంచాంగమును జూసెను.

ఆపంచాంగమునందు కదలినయెడల చావు తటస్థించును అని వ్రాసియుండెను. వెంటనే అతడు కదలక యాచెట్టును కౌగలించుకొని యేడ్చుచుండెను. పెరుగు తెచ్చుటకై గ్లాసునుతీసుకొని దుకాణమునకుబోయిన మంత్రిగాడు పెరుగును గ్లాసునిండాకొని సత్రమునకు బయలుదేరివచ్చుచుండెను. త్రోవలో యతనికి ఒక ధర్మసందేహముగలిగెను. అదియే మన గ్లాసు పెరుగునకు అంటిపెట్టుకొనియున్నదా లేక పెరుగు గ్లాసునకు అంటిపెట్టుకొని యున్నదా యని. అందుచే మంత్రిగాడు గ్లాసును తల్లక్రిందులుజేసెను. గ్లాసులోని పెరుగు క్రింద పడిపోయెను. గ్లాసు పెరుగును అంటిపెట్టుకొనిలేదు అని తెలిసికొనెను. సత్రమునందు మద్దెలవాయించు బ్రాహ్మణుడు అన్నము వండుచుండెను. అన్నము పక్వమునకు వచ్చునపుడు కళపెళయని ధ్వనివచ్చుచుండెను. వెంటనే అతడు తనమద్దెలనుదెచ్చి వాయించుట మొదలిడెను. అన్నమువుడికి కళపెళయని ధ్వనిమాత్రము ఆగిపోయెను. మద్దెల వాయించువానికి అన్నపుకుండమీద గోపమువచ్చి కర్రతో ఒకదెబ్బవేసెను. అన్నము కుండ పగిలిపోయెను. డాక్టరుగారు, మంత్రిగాడు సత్రమునకు యేమియుదీసుకొనిరాకుండ వచ్చిరి. డాక్టరుగారు మద్దెలవానితో భోజనమునకు అన్నియువండితివాయనెను. మద్దెలవాడు జరిగిన సంగతిఅంతయుచెప్పెను. మంత్రిగాడు తానుచేసిన తెలివితక్కువపని అంతయుచెప్పెను. డాక్టరుగారు కూరగాయలను గురించి చలవ, పయిత్యము జెప్పెను. వీరుముగ్గురును బాదపు ఆకులకై బోయిన బ్రాహ్మణుని వెతుకుటకై సత్రమునుండి బయలుదేరిరి. బాదపుచెట్లు అన్నియు వెతికిరి. ఎచ్చటను బాదమాకులకుబోయిన బ్రాహ్మణుడు గనిపించలేదు. చిట్టచివరకు బ్రాహ్మడు ఒకబాదపుచెట్టును కౌగలించుకొని కదలకుండుటజూచి ఖిన్నులైరి. వెంటనే వీరు యతనియొద్దకు వెళ్లి తాను ఆవిధముగా చెట్టును అంటపెట్టుకొని యుండుటకు కారణమేమియనిరి. అప్పుడు చేదస్థపుబ్రాహ్మణుడు తాను కదలినయెడల బల్లిపలికియుండుటచే పంచాంగము ప్రకారం చనిపోవుదునని జెప్పెను. ఆతని తెలివితక్కువకు వీరునవ్వి అతనిని బలవంతముగా చెట్టుమీదనుండి క్రిందకులాగిరి. తెలివితక్కువయనగా నిదియే.

ర. బుద్ధిపరీక్ష

## యుక్తిలెక్క

[ఈయుక్తిలెక్కకు సమాధానము స్వతంత్రముగ నాలోచించి 9 సంవత్సరములకులోబడిన బాలబాలికలు జూను 7-వ తేదీలోపున లేఖాముఖమున-వారివయసుతో సహా-మాకు తెలుపవలెను. —సంపాదకుడు]

### శ్రీమతి నున్న సావిత్రీ దేవిగారు

30 అడుగులలోతుగల నూతిలో అడుగున ఒకకప్పఉన్నది. ఆకప్ప బయటికిరావలయునని ప్రయత్నముజేస్తూ రోజుకుమూడుఅడుగులు పైకిప్రాకుచు రెండుఅడుగులు క్రిందికి పడిపోవుచుండును. ఆకప్పబయటికి ఎన్నిరోజులలో రాగలుగును?

# నార్వే దేశపుస్త్రీలు

యూరపునందలి స్కాండినేవియాద్వీపకల్పములోని ఉత్తరపశ్చిమభాగములు నార్వే దేశము. ఈదేశముయొక్క వైశాల్యము 125000 చతురపుమైళ్లు. జనాభా 2,500,000. సముద్రతీరభూమియొక్క నిడివి 2000 మైళ్లు.

స్త్రీస్వాతంత్ర్యమంగీకరించిన దేశములలో యూరపుఖండమున నార్వే తొలుతటిది అని చెప్పవచ్చును. చిరకాలముగ నచ్చటి పార్లమెంటుకు—ఆదేశీయులు దానిని 'స్టోర్టింగు' అందురు—స్త్రీలు ఓటింగుహక్కును, ఎన్నికహక్కునుగలిగియున్నారు. పర్వతమయమైన దేశమగుట వ్యవసాయమునకు అనుకూలమైన మైదానము లాదేశమున చాలతక్కువ. ఆహారముకొఱకు విశేషముగ తమముల్లాడవలసియుండును గావున ఆదేశపుస్త్రీపురుషులు కష్టశీలురుగను, విశేషపరిశ్రమ కోర్వగలవారుగను ఉందురు. అడవులు విస్తారమగుట చేకి కలపవ్యాపారము విశేషము. నార్వేదేశపు ఖనిజసంపద పేర్కొనదగినది. వెండి, రాగి అచ్చటదొరుకు ఖనిజములలో ముఖ్యములు. కాడ్ చేపల వర్తకము మెండు. పాశ్చాత్యులు పరమప్రీతితో తిను సోలమన్ చేపలపరిశ్రమకూడ నాదేశమున విశేషముగగలదు. యూరపు ఖండమున చేపలపరిశ్రమకు పేరుమోసినదేశములలో నార్వే మొదట గణింపబడునది.

ఓటింగుహక్కు, ఎన్నికహక్కుపొందుటకు నార్వేదేశపుస్త్రీలు యూరపుఖండమున ఎట్లుమొదలిటివారో రాజ్యాంగసంబంధమైన ఉద్యోగములను పొందుటకుగూడ యూరపు ఖండమున వారే తొలుతటివారు. సాంఘికసాంసారికవిషయములందు ఆదేశపుస్త్రీలు పూర్వాచారములకే మొగ్గుదలచూపినను రాజ్యాంగవిషయములందు వారుపురుషులతోబాటు నవీనాశయములను గొనుటకు ఎప్పుడును వెనుకంజవైవరు. ఆదేశపుపార్లమెంటునందు పెక్కురు సభ్యురాండ్రుకలరు. ఆస్త్రీలు తమదేశాభివృద్ధికి పురుషులతో సమానబాధ్యత వహించి రాజ్యాంగకార్యనిర్వహణచాకచక్యమును ప్రదర్శించుచున్నారు. యూరపుఖండ స్త్రీలకు ఈవిషయమున ఈదేశపుస్త్రీలే పురోగాములనవచ్చును.

వివాహకాలమప్పటి ఆదేశపుస్త్రీ అలంకృతిచూడదగినది. వివాహమప్పుడు వధువు జుట్టుముడివేయరాదు. ఆమె శిరోజములు వీపుపై వ్రేలాడవలయును. 'కల్యాణకిరీటము' అను నొకవిధమైన విలువగలకుళ్ళాయి పెళ్లికుమార్తెధరించును. ఈకల్యాణకిరీటమును సాధారణముగ ఎరువుతెత్తురు. పెండ్లిఅయినపిమ్మట దానిని ఇచ్చివైతురు. ముత్యాలదండ, వెండినగలు, చేతులను కప్పిన బుటేదార్‌జేబురుమాలు ఇవి వివాహకాలమునాటిస్త్రీ ధరించునవి. నార్వేదేశపువివాహములందు ఫిడేలువాయిద్యము తప్పకయుండవలయును. ఆఫిడేలు వాయిద్యమువలన దుష్టగ్రహములు తొలగిపోవునని వారినమ్మకము. వివాహముకొఱకు చర్చికిపోవుట నీటిమీద ప్రయాణించిపోయిన శుభపరంపరలుగలుగునని ఆదేశమువారి గాథ



నార్వే దేశపు స్త్రీలు: పుస్తకపఠనము



నార్వేదేశపు స్త్రీలు: గృహపరిశ్రమ

నమ్మకము. ఆదేశమునగొఱ్ఱెలు మేకలుమొదలగుపశువులనుబెంచుపరిశ్రమ విస్తారము. ఈపశువులను పచ్చికపట్టులకు తోలుకొనిపోయి ఒక్కొక్కస్త్రీ ఒక్కొక్కతావున ఒంటరిగనుండి పోవును. పాలుపితుకుట, వెన్నచేయుట మొదలగు అన్నిపనులు ఆమెయేచేయును. అప్పుడప్పుడు పురుషులు గుఱ్ఱములపై వచ్చి ఆస్త్రీలకువలయుపదార్థములనిచ్చి ఇచ్చటినుండి వెన్న మొదలగుపదార్థములనుతీసికొనిపోవుచుందురు. పాడియుపచ్చికయుగలుగు నాలుగైదుమాసములును స్త్రీలిట్లు ఒంటరిగనే ధైర్యముతోనుందురు. ఇట్లు ఒంటరిగనుండుకాలమున ఆస్త్రీలలో అవివాహితలగువారికడకు వారివారిప్రియులు వచ్చుచుందురు. ఆదినములలోనే ఆయువయువతులు వివాహవిషయమున తుదినిశ్చయమునకు వత్తురు. పశువులతో వలసయుండవలసినకాలము ముగిసినతోడనే వారుయింటికివచ్చి వివాహప్రయత్నములుచేతురు. నార్వేదేశమునజరుగు పెక్కువివాహములు ఇక్కాలముననేజరుగును కావున ఈఋతువునకాదేశమున వివాహములఋతువు అని పేరు.

వివాహితలగు నాదేశపుస్త్రీలు ఒక తెల్లని టోపీనుధరింతురు. వారు దానిని 'స్కాట్'అని అందురు. అదిసాధారణముగ నారతోచేయబడియుండును. ఇటముద్రింపబడినపటమున ఊలుదారముతో పనిచేయుచున్న స్త్రీ ఇట్టి టోపీని ధరించియుండుట చూడనగును.

నార్వేదేశపు స్త్రీలు విద్యాప్రియులు. పాటలు అనినవారు చెవికోసుకొందురు. అందును తమదేశచరిత్రమునకు కీర్తినిదెచ్చిన వీరులజీవితమును గానముచేయుగీతములు వారికి మిక్కిలి గూర్చును. అవిపాడుచు వారు ఆహారనిద్రలనే విస్మరింతురనినవింతగాదు.

నార్వేదేశపుమాతలు తమబిడ్డలఎడ మిక్కిలి మక్కువగవర్తింతురు. తమబిడ్డలకు ఉన్నిబట్టలుసంపాదించి శీతలమునుండి వారిని కాపాడుటకు అచ్చటిమాతలు చేయనిత్యాగమును పడనికష్టమునులేదు. అచ్చటియిండ్లు సాధారణముగ కొండలపైనుండును. ఆకొండలు ఎత్తుగనేగాని విశాలముగనుండవు. అట్టిచోటకట్టబడిన నార్వేదేశీయుల ఇండ్లనుచూచి వీనిని ఇండ్లుఅనుటకంటె పక్షిగూండ్లుఅనుట బాగుగనుండునని ఒకకవి చెప్పియున్నాడు. అచ్చట కాలుజారినచో నికపాతాళమేగతి. కావున అట్టియిండ్లయందు కాపురముచేయు తల్లి తనపిల్లలుగంతులువైచి కాలుజార్చుకొనకుండుటకై వారినడుములకు పొడుగుపగ్గముగట్టి ఆపగ్గముయొక్క రెండవకొనను ఏరాతిబండకో ముడివేయును. దూడలవలె నిట్లుకట్టబడిన ఆబిడ్డలు ఇంటిముందు ఆడుచుండగాచూచిన వింతగనుండకమానదు.

నార్వేదేశమున చెరువులు, వాగులు, ఉప్పుటేరులు హెచ్చు. కావున నాదేశపుస్త్రీపురుషులు బయటికిపోవలసినచో తఱచు పడవలపైననే పోవలసియుండును. అచ్చటిస్త్రీలు పురుషులవలె నీటిలో ఈదుటయందును, చుక్కానిపట్టి పడవనునడుపుటయందును నేర్పరులై యుందురు.



ఆం ధ్ర మ హి ళా మ ణు ల కు మ న వి:—

శ్రీమతి సుసర్ల లక్ష్మీనరసమాంబగారిట్లు వ్రాయుచున్నారు:—

"ఈమధ్య వివాహవిమోచనచట్టమును విడాకులచట్టమును మన సోదరీమణులలో చాలమంది కావలెనని కోరుటయు మరికొందరు అంగీకరించుట మరికొందరు అనంగీకారమును తమయభిప్రాయములను ప్రకటించుచుండుటయు గృహలక్ష్మి పత్రికాచదువరులగు సోదరీమణులకు తెలిసియేయున్నది. పాశ్చాత్యస్త్రీలకుగల సంపూర్ణస్వాతంత్ర్యము మన హైందవస్త్రీలకు పనికిరాదనుట సువ్యక్తికి నిశ్చయమైయున్నది. కాని కొన్ని మనకుగల ఆపత్తులనివారణచేయుటకు కొన్ని అవసరములగు చట్టములను కావలెనని మనము కోరుకొనుటలో తప్పుగాదని తలచెదను. పరుడు, తాగుబోతు, వికలాంగుడు, కుష్టు, క్షయ, గుడ్డి, కుంటి మొదలగు రోగములచే పీడింపబడువాడు తటస్థమగునపుడు అతనియొనికన్యకలను వారితోనే కాపురము చేయవలసినదిగా ప్రోత్సాహమొసర్చి వారిని శిక్షించుటకున్న అట్టి వివాహమును రద్దుచేయవలసినదిగా న్యాయాధిపులయెదుట అభియోగము దెచ్చుకొని, తనవాదనను దృఢపర్చగలిగినయడల కోర్టువారిచే వివాహబంధనవిమోచనము కలిగించుకొనుటకు, ప్రయత్నించుట మంచిదియని తలచెదను. తలితండ్రుల మొగమాటము చేతగాని, అత్తమామల దౌర్జన్యము చేతగాని, మతమనేమిష చేతగాని అట్టి దీర్ఘరోగులతో కలిసినచో, వాళ్లకుగలుగబోవు సంతానము వంతను రోగములపాలుచేసి ఘోరమైనవిపత్తును వంశపరంపరా కల్పించుటకంటె వివాహవిమోచనమునకు దరఖాస్తుచేసుకుని న్యాయసభయందు న్యాయమును పొందుట శ్రేయస్కరమనతగును. 'బౌద్ధమతము: వివాహవిచ్ఛేదములు' అనే వ్యాసము మార్చి నెలసంచికయందు ప్రకటింపబడినది. బౌద్ధమతమునకును మనహిందూమతమునకును దగ్గరసంబంధముకలదు. పరుడు అప్రయోజకుడై పోషించుకోలేని దుస్థితిలోయున్నప్పుడును దీర్ఘరోగముచే తీసికొనుచున్నపుడును మతిభ్రష్టుడైనపుడును సోమరిపోతుఅయి పాపాటు రాముడుగానున్నప్పుడును వివాహానంతరము అంగవైకల్యుడైనను భార్య తనభర్తనుండి విడాకుమపొందవచ్చును. అది న్యాయస్థానమందే నిర్ణయింపబడవలెను. విడాకులు కోరువారు తామే తమదాంపత్యసంగతులు రుజువుపర్చుకోవలెను. ఈపద్ధతులు బౌద్ధమతసాంప్రదాయమైయున్నవి. మన హిందూస్త్రీలుకూడా సదరు బౌద్ధమతసాంప్రదాయమును గుర్తించి ఆప్రకారము శాసనము చేయుటకు ఏకగ్రీవముగా అంగీకారము దెలుపుట శ్రేయస్సగును. సంఘసంస్కారములో చక్కనిశాసనములు చేయుచున్న బరోడాసంస్థానమువారుగూడ, వివాహవిమోచన చట్టమును అమలులోకి దెచ్చినటుల వార్తాపత్రికలయందు చదివియున్నారము. ఆచట్టమును మనసారీమణులలో ఆంగ్లేయవిద్యాకౌశలముగలవారు తెప్పించిచదివి అందలి సారమునుగ్రహించి, అందోళనచేయవలసినదిగా

ప్రార్థింపబడుచున్నారు. ఇందునుగూర్చి నాలుగవఆంధ్రరాష్ట్రమహిళాసభయందు మచిలీపట్టణమందు వాదోపవాదములు ప్రబలముగ జరిగినట్లును, ఉభయవాదులయొక్క అభిప్రాయములు సమముగావచ్చినట్లును తెలియుచున్నది. శ్రీమతి కనుపర్తి వరలక్ష్మమ్మగారి సవరణప్రకారమైనను సభికురాండ్రందరు ఏకగ్రీవముగా రాబోవు గుంటూరు పంచమమహిళాసభయందు ప్యాసుచేసి విడాకులచట్టమునకు ప్రాణప్రతిష్ఠచేసి విదుషీమణులవందనములకై కొందురనియు ఇదిప్యాసు అయేవరకు తగినంతపట్టుదలతో పనిచేసి పరమాత్ముని విశ్వాసమునకు పాత్రురాండ్రుగ కావలయుననియు ప్రతినిధురాండ్రకు ప్రణమిల్లుచున్నాను."

## సువర్ణము:—

మేమాసపు 'వాసవి' పత్రికయందు శ్రీయుత కె.బి. స్వామిగారిట్లు వ్రాయుచున్నారు:—

"లోహములన్నిటిలోను సుప్రసిద్ధమగు సువర్ణము అగ్రస్థానమును వహించుచున్నది. చూపున కింపగు పసిడివర్ణముగలదై మెఱయుచున్నది. కంటి కింపగుటవలనను, అరుగుతరుగులు చాలతక్కువ యగుటవలనను, ఎట్టి ద్రావకములలోను కరగక పోవుటవలనను, అరుదుగా దొరకుటవలన నిది చాల విలువగలదైయున్నది. మనదేశమున ముఖ్యముగా నారీమణుల యాభరణములకై ఉపయోగింపబడుచున్నది. గొప్పగొప్ప సంస్థానములలోను ఆభరణముల మూలముగ చాల బంగారము నిలువయున్నది. సుమారు 825 కోట్ల రూపాయలు విలువగల బంగారము మనదేశమందు వర్తకమునకు పనికిరాక, నిలువయున్నటుల లార్డుకర్జను ప్రభువుగారు చాలకాలము క్రిందట నుడివిరి. బరోడా సంస్థానమందు బంగారముతో తయారుచేయబడిన రెండు గొప్ప ఫిరంగులు గలవు. అమెరికాయందు డాలరు సుమారు రు. 2-12-0; ఇంగ్లాండునందు సవరను సుమారు రు. 13-8-0. ఈనాణెములు మనము రూపాయలు వాడు విధమున వాడుకలో గలవు. బంగారము భూగర్భమందు కొన్నికొన్ని వెండి, సీసము, రాగియున్నగు లోహములతో (Phrites, chaleo-pyrites, galena, Sphalerite, Tellurides, etc.) కలసియుండును. భూగర్భమున 0.0000005% (of Earth's crustal rocks comprising about 75 Miles thick) యున్నటుల గొప్పగొప్ప భూతత్వశాస్త్రజ్ఞులు (Geologists) నుడివిరి. సాధారణముగా శుద్ధబంగారము చిన్నచిన్న పలుకులుగా కరతజము (Quartz) అను రాలలో దొరకును. ఆస్ట్రేలియా గనులలో 150 పౌ॥ బరువుగల బంగారపుముక్కలు (Nuggets) కూడ దొరకును. మరియు కొన్నినదుల యొక్క యిసుకలో పసిడి కలసియుండును. ఇటులసువర్ణము (సింగ్‌భూమ్‌జిల్లా) ఏరకోడు (ఏర్నాడు తాలూకా) నీలాంబరము నదులయొక్క యిసుకలో దొరకుచున్నది. ఈయిసుకను కడిగి బంగారమును వేరుచేసి జీవనోపాయమును గడపువారు మనదేశమున ఎందరో గలరు. సాధారణముగా బంగారముదొరకు రాళ్లలో సుమారు టన్నురాతిలో నాలుగుతులముల రొత్తుగల బంగారముండెనేని గనినుండి త్రవ్వుటలాభకరము. 1860 సం॥ మొదలు 1930 సం॥ వరకు ప్రపంచమంతటిలోను సుమారు 5000,0000,000 రూపాయల విలువగల బంగారము భూగర్భమునుండి తీయబడినది. 1492-వ సంవత్సరమున అమెరికాదేశము కనిపెట్టబడి నప్పటి నుండియు నేటివరకు ప్రపంచమున గనులనుండి త్రవ్వియెత్తబడిన బంగారు 32,000 టన్నులనియు, సదరు బంగారు 50 అడుగుల పొడుగు, 40 అడుగుల వెడల్పు, 30 అడుగులఎత్తు గదియందు పెట్టవచ్చుననియు (Frindley Shirros) ఫ్రిండిలెషిరాగారు చెప్పియున్నారు. 1927 సం॥ ప్రపంచమంతటిలోను 19,300,000 ఔన్సుల 82,000,000 పౌనుల-960,000,000 రూపాయలవిలువగల బంగారమునుతీసిరి. ఇందులో మనహిందూదేశమందు 2% అనగా 384, 270 ఔన్సుల (22,000,000 రూపాయలు) బంగారము గనులనుండితీసిరి. బంగారముదొరకు దేశములలో మనదేశము ఎనిమిదవ స్థానమును వహించుచున్నది. దక్షిణాఫ్రికా, అమెరికా,

కెనడా, మెక్సికో, రష్యా, రోడోషియా, ఆస్ట్రేలియా, ఇండియా, జపాను, గోల్డుకోష్టు, బెల్జియనుకాంగో, న్యూజిలాండు దేశములు వరుసగా ముఖ్యమైనవి. ప్రపంచములో దొరకు బంగార మంతటిలోను, 60% బ్రిటిషుసామ్రాజ్యమున దొరకుచున్నది. 1880 సం॥న సుమారు 9 కోట్ల రూపాయల విలువగల బంగారమును మనదేశమునకు దిగుమతిచేసిరి. ప్రపంచమునందలి గనులలోనెల్ల బంగారుగనులు లోతైనవి. దక్షిణాఫ్రికాలో బంగారుగనులు 7500 అడుగుల లోతు. మనదేశములో మైసూరు రాజధానియందు గల కోలారుగనులు 6000 అడుగులు లోతుగలవి. ఇండియాదేశమందు ముఖ్యమైన బంగారుగనులు మైసూరు రాజధానియందు గలవు. ఇచ్చట సుమారు 99% బంగారము తీయుచున్నారు. మిగత 1% బంగారము నిజాము రాజధానినుండియు, ధార్వార్, అనంతపురము, బర్మామున్నగు ప్రదేశములనుండి తీయబడుచున్నది. మనదేశమున ప్రతిసంవత్సరమునను సుమారు 22,000,000 రూపాయల విలువగల బంగారమును తీయుచున్నారు. కోలారుజిల్లాలో 1882 సం॥న ఈగనులను త్రవ్వుట మొదలుపెట్టిరి. ఈబంగారు గనులలో 18000 మంది పనివాండ్రు అన్ని రకముల పనులను చేయుచున్నారు. ఈగనులనుండి ప్రతిసంవత్సరమునను 650,000 టన్నుల రాతినిత్రవ్వి 1,60,4000 విలువగల బంగారమును దీయుచున్నారు. 1880 సం॥ మొదలు 1928 సం॥ వరకు మైసూరు గనులనుండి 70 కోట్ల రూపాయలు ఖర్చుపెట్టి 103 కోట్ల రూపాయల విలువగల బంగారమును కంపెనీవారు తీసిరి. ఇందులో సుమారు 5½ కోట్ల రూపాయలు మైసూరు మహారాజావారికి పన్నుగా (royalty) కంపెనీ వారు చెల్లించిరి. హైదరాబాదునందు హట్టియనుప్రదేశమందు (లింగసాగరుజిల్లా) 1920 సం॥ వరకును బంగారముతీసిరి. ప్రస్తుతము పని జరుగుటలేదు: 1914-1918 సం॥లలో నిచ్చట సుమారు 10 లక్షలవిలువగల బంగారమును ప్రతిసంవత్సరమును దీసిరి. అనంతపురముజిల్లాలో రామగిరి గనులనుండి సుమారు 13,7000 ఔన్సులు బంగారమును 1922 సం॥ వరకును త్రవ్విరి. తరువాత పనిమానిరి. గుత్తితాలూకాలో రామ పురము, వెంకటంపల్లి అను ప్రదేశములయందును బంగారము దొరకుననుటుల తెలియుచున్నది. ఇంత విలువగల సువర్ణమును తీసిరికాని భూగర్భమునందుండు హేమమును గణించుట మనదేశస్థులకు ఎందరికి తెలియును?"

## గద్వాలసంస్థానాధీశ్వరి:—

ఏప్రియలుమాసపు 'రెడ్డిరాణి' గద్వాలసంస్థానాధీశ్వరి నిట్లుప్రశంసించుచున్నది:—

"గద్వాలసంస్థానము నిజామురాజ్యములో నున్నది. ప్రభువులు రెడ్లు. పాకనాటిశాఖకు చెందినవారు. దీనికి విద్వద్గద్వాల సంస్థానమని ప్రసిద్ధిగలదు. చిరకాలమునుండి యీసంస్థానమున శ్రీచెన్నకేశవస్వామివారి యుత్సవముల సందర్భమున విద్వాంసులు అనేకులు చాల గొప్పగా సన్మానింపబడుచున్నారు. ఆంధ్రవాఙ్మయమున గద్వాల ప్రభువులకు మంచిస్థానముగలదు. గద్వాల సంస్థానమును మొన్నటివరకును శ్రీమంతు మహారాజా శ్రీసీతారామభూపాలరావు బలవంతు బహద్దరువారు పరిపాలించుచుండిరి; గాని వారాకస్మికముగా అకాల మరణము వాతబడుటవలన ప్రకృతము వారి పట్టపుదేవి శ్రీమంత మహారాణీ ఆదిలక్ష్మీదేవమ్మగారు సంస్థానమును జనరంజకముగా పరిపాలించుచున్నారు. మహారాణీ ఆదిలక్ష్మీదేవమ్మగారు అనేకసంస్థానాధీశులకు గూడ ఆదర్శభూతులగుటయేగాక కులమునకు వన్నెయు, వాసియు కలిగించుచు మంచి ప్రతిష్ఠనార్జించుచున్నారు. సంస్థానమున మొదటినుండియు జరుగుచుండిన దానధర్మములు పూర్వముకంటె చక్కగా జరుపబడుచుండుటయేగాక పాత్రాపాత్రవివేకముతో క్రొత్తవిగూడ అనేకములు చేయుచు శ్రీమహారాణీవారు శ్రీచెన్నకేశవస్వామి యనుగ్రహమును పొందగలుగుచున్నారు."




**యమదూతలు ప్రమాదపడిరి:—**

చచ్చి పైలోకమునకుబోయి తిరిగి భూలోకమునకు వచ్చిన శ్రీవృత్తాంతము పత్రికలలో బడుటచూచి బెంగుళూరులో సినోటాఫ్ రోడ్డునందునివసించుచున్న యమ్. వెంకటశేషయ్యగారిట్లు వ్రాయుచున్నారు:- "ఈ శ్రీవృత్తాంతము వినినతరువాత స్వకీయమైన విషయము నొకదానిని వివరించుటకు నేను కుతూహలపడుచున్నాను. 1922-వ సంవత్సరమున నాకుజబ్బుచేసినది. తీవ్రమైన మలేరియాజ్వరము. రెండుమాసములు తీసికొంటిని. ఒకనాటిరాత్రి నాస్థితివిషమించినది. నాటిసాయంకాలము వచ్చిచూచిపోయిన డాక్టరు ఏమియు మందీయలేదు. నాభార్యయు, బంధువులును అందుపై వ్యాకులచిత్తులైరి. మరలవచ్చి ఆరాత్రి ఒకసారి నన్ను చూడవలసినదనివారు డాక్టరును ప్రాధేయపూర్వకముగ ప్రార్థించిరి. ఇక తాను రావలసినయవసరములేదని డాక్టరు స్పష్టముగచెప్పివైచెను. నాస్థితిముదిరినది. నిస్సత్తువ, నీరసము హెచ్చినవి. మరణమాసన్నమగుచున్నదని నేనునిశ్చయించితిని. దేవునిగూర్చియు మోక్షమునుగూర్చియు తలపులుబాతినవి. ప్రశాంతమరణమునుగోరి నేను ఆగదియందు ఒంటరిగనుండ నభిలషించితిని. ఇక ఒకటిరెండుగంటలలో నేను మరణించుట నిశ్చయమని ఎల్లరుభావించిరి. నాసోదరుడు డాక్టరువద్దకు పరుగెత్తెను. నన్నుబ్రతికించుట కలలోనివార్తయనుకొని డాక్టరువచ్చుట కంగీకరింపలేదు. దిగాలుపడినాసోదరుడు ఇంటికివచ్చినాడు. అరుగుమీద కూర్చుని దుఃఖింపమొదలిడెను. ఇరుగుపొరుగువారుచేరిరి. మాతండ్రి ఊరిలోలేడు. ఒకవేళ నామరణమారాత్రియే సంభవమగునో దహనాదికార్యములెట్లునిర్వహించుటాయను మీమాంసలోవారుపడిరి. ఇంటియందలి స్త్రీలెల్లరు పూజాగృహమున చేరి ప్రార్థనవిలాపములమధ్య కలగుచుండిరి. ఈస్థితిలో నాకుస్మృతి తప్పిపోయినది. ఆమైమఱుపాటులో ఎంతకాలముంటినో నేనుచెప్పలేను. ఒకగంటవఱకు ఉంటిననిమావారు తరువాతచెప్పిరి. ఒళ్లుమఱచియున్న ఆసమయములో నాచుట్టును పెక్కువికారస్వరూపములను చూచితిని. ఆస్వరూపములు వానిలోనవి యేమియో గుసగుసలుప్రారంభించెను. అందుకొన్ని 'వానినీడ్చుడు'అనుచుండెను. కొన్ని అట్లు ఈడ్చుటకు సిద్ధపడుచుండెను. క్రొత్తలోకము, క్రొత్తఅనుభవము గలుగుటకు నేనాందపడితిని. నాభార్యనుగురించిగాని నాఇహలోకసంబంధములను గురించిగాని నేనుతలచనేలేదు. ఆస్వరూపములు నన్ను గొనిపోవుటకు ప్రయత్నపడుచున్నవి. వానికార్యమును నిరోధించుటకు నేనుఎట్టిప్రయత్నము చేసియెరుగను. ఇంతలో అచ్చటికి ఒకక్రొత్తవిగ్రహము తొందరగవచ్చెను. వారినడుమనునిలచెను. 'మీరు గొప్పప్రమాదముచేసితిరి. కావలసినది ఇతనుకాదు' అని ఆక్రొత్తవ్యక్తిపలికెను. రెప్పపాటులో ఆస్వరూపములన్నియు మటుమాయమైనవి. నేనొంటరిగ ఒకబంగనబయలున ఉండిపోయితిని. ఇంతలో నాప్రక్కనుగూర్చుండి మాయింట నాపేరు పేర్కొనుచు ఎవరోవిలపించుట నాకువినిపించినది. మంచినీళ్లకొరకు నేను కేకపెట్టితిని.

కాని అది పైకి రాకుండుటచే వారికి వినిపించలేదు. నాయందు కనిపించిన చలనమును చుట్టును చేరినవారు గమనించిరి. సంజ్ఞ చేయగా వారు నాకు మంచినీళ్లనిచ్చిరి. త్రాగి తేరుకొని లేచి బాలీసుకు జేరబడికూర్చుండి నారోగము యొక్క మరలుపాటునకు బ్రహ్మానందపడుచున్న మావారికి నా అనుభవమును చెప్పి వారి బ్రహ్మానందమును రెట్టించితిని. నే నీవిషయమును చెప్పుచుండగనే మా సేవకుడొకడు పరుగెత్తుకొనివచ్చి మా పశువుల సాలలోని ఒక వత్సరము వయసుగల గేదెదూడ మంచిబలములోనున్నది చూచుచుండగనే అమాంతముగ చచ్చి పడినదని చెప్పెను. రెండుమాసములుగ నన్ను పీడించుచుండిన జ్వరము అనాడు మఱితగలలేదు. మఱునాడును తగలలేదు. మఱితగలనే లేదు. మఱునాటియుదయమున రెండుమాసములు బల్లివలె మంచమును గఱచుకొని యుండినవిమ్మట తొలిసారి నేను లేచియింటియందు పచారుచేసితిని. నాడే ఆరోగ్యస్నానము చేసితిని. పాలును రొట్టెయు తింటిని. కొలదికాలములోనే తిరిగి పూర్ణారోగ్యమును పొందితిని."

### కోడలికి ముంతపొగ, వాతలు:—

బీరారులో చాందుపూరునందు గంగరాము అనువాడు తనభార్య, తల్లిసహాయమున తనకోడలి కాలు చేతులు ఒక స్తంభమునకు కట్టి బట్టలువిప్పి మిరెపకాయలు ముంతపొగవేసి కాలిన ఇనుపకడ్డీలతో చురకలు వేసెను. ఆబాల కేకలువిని చుట్టుపట్లవారువచ్చి విడిపించిరి. ఆమెకు 16,17 ఏండ్లుండుననియు ఆమె భర్త ఆమెకన్న ఏడేండ్లుచిన్నవాడనియు తెలియుచున్నది. ప్రస్తుతమామె పంచాయతీవారివశమందున్నది. గంగరామును సంఘమంతయు బహిష్కరించెను.

### చెట్టు ఎక్కి శీలము కాచుకొన్న యువతి:—

శ్రీమతి అహల్యాబాయి వడియాడు మునిసిపలు ఆసుపత్రిలో వైద్యురాలు. పూర్వము మునిసిపలు కవున్సిలరుగనుండిన హరిశంకరభట్టు అనువాడు తనశీలము చెఱుపదలచిన విధము ఆమె కోర్టులో నిట్లు చెప్పెను. "డిశంబరు 7-వ తారీఖు రాత్రి హరిశంకరు కారులో మాయింటికివచ్చి సమీపగ్రామమగు మారిడాలో ప్రసవ వేదనపడుచున్న ఒక పేదరాలికి వైద్యసాహాయ్యము చేయుటకు నన్ను రమ్మనెను. రాత్రిపూట బయటికిపోవుట సాధారణముగ అలవాటులేదంటిని. ఆపేదరాలిబాధ నివారించుటకు కనికారమూనుమని అతడనెను. జాలిపుట్టి నేను నాతమ్మునితోగూడిపోవుటకు సమ్మతించితిని. నేను కారు ఎక్కితిని. నాతమ్ముడు కారు ఎక్కుటకు వచ్చుచుండెను. అతడు రాకుండగనే హరిశంకరభట్టు కారును దారుణవేగమున పోనిచ్చెను. కారులో నేను, హరిశంకరుడు, అతని సేవకుడు మాత్రముంటిమి. రెప్పపాటులో కారు ఊరువదలి రెండుమైళ్లు వచ్చినది. కారు మారిడాదారిపట్టుటకుబదులు సాలియస్ దారిపట్టెను. నాకు అనుమానము తగిలెను. ఇంతలో కారుఆగెను. హరిశంకరుని సేవకుడుదిగి ఎటకేనియుబోయెను. కారు మరల పోవుచుండెను. సేవకుడేడి అని నేను ప్రశ్నింపగా జవాబు ఇచ్చుటకు బదులు అతడు అనుచితముగ ప్రవర్తింపనొడగెను. నేను కంటగించుకొనుచుంటిని. ఇంతలో ఒకచోట కారునాపి హరిశంకరుడు ఎందునిమిత్తమో కొంతదూరము వెనుకకుబోయెను. ఆతరుణమున నేను నెమ్మదిగ కారుదిగి సమీపముననున్న ఒకపెద్ద చెట్టుచాటునకుబోయి నెమ్మదిగ దానినెక్కి కొమ్మలసందున దాగితిని. కొంతసేపటికి అక్కడికి హరిశంకరుడు, అతని సేవకుడువచ్చిరి. నన్ను వెదకిరి. నేను కనిపించనందున వారు కారులో వెడలిపోయిరి. నే నారాత్రియంతయు ఆచెట్టుమీద ప్రాణములు గుప్పిట బట్టుకొని వేగించితిని. తెల్లవారగట్ల ఆదారిని ఒకబండిపోవుచుండెను. నేను అప్పుడు చెట్టుదిగి బండివద్దకు పరుగెత్తుకొని వెళ్లితిని. అట్టివేళ ఆప్రదేశమున ఆడుదానవగు నేను ఒంటరిగనుండుటకు అతడాశ్చర్యము సూచించెను. జరిగినసంగతి నేను వానికి జెప్పితిని."




### ఉష్ట్రపక్షి జీర్ణించుకొనజాలని వస్తువులునుగలవు:—

ఉష్ట్రపక్షి తిన్నదానినెల్ల ఎట్టివస్తువునైనను జీర్ణించుకొనగలదని ఇదివఱకు సాధారణముగ నమ్మబడుచున్నది. కాని లండనునగరమందలి జంతుప్రదర్శనశాలలో ఈనడుమ ఒకనిప్పుకోడి చనిపోయినది. బ్రతికి ఉండినరోజులలో అది ఏవస్తువుపడితే ఆవస్తువుమ్రింగివేయుచుండినది. ఆపక్షియొక్క జీర్ణశక్తిని పరీక్షింపగోరిన జంతుశాస్త్రవేత్త దాని కడుపుచీల్చిచూచెను. మ్రింగినవస్తువుల నన్నిటిని జీర్ణించుకొనగలదని నమ్మబడుచున్న పక్షిజాతికిచెందిన ఆనిప్పుకోడి కడుపులో క్రిందివస్తువులు కానవచ్చినవి: రెండు జేబురుమాళ్లు, మూడుచెయిజోళ్లు (Gloves), నాలుముక్కైపుడక, మూడు అడుగుల దళసరిదారముముక్క, ఒకపొడుగుపాటి పెన్సలు, సెల్యులాయిడ్ దువ్వెన్నముక్క, ఒకసైకిలుటైరువాల్వు, రెండు మూడంగుళములమేకులు, పెద్దగడియారమునకు కీయిచ్చేతాళముచెవి, కేతిజోళ్లబిగించేది, అయిదు అంగుళముల నిడివిగల కఱ్ఱముక్క, రోల్డుగోల్డు కంఠమాలశకలము, రెండుకాలరు బొత్తాములు, ఒకపెన్నీ, నాలుగు అరపెన్నీలు, రెండు ఫార్దింగులు, ఒకబెల్జియముదేశపు నాణెపుముక్క.

### ఒకేకాన్పున నలుగురు బిడ్డలు:—

పెనుగొండకు చేరువనున్న ఖానుమహామదుపల్లిఅను గ్రామమున ఒకస్త్రీ ప్రసవించినది. మఱియొక గంటకు మరల ప్రసవించినది. మఱిరెండుసారులు గంటకాలము వ్యత్యాసములో ప్రసవించినది. నాలుగుసారులును ఆడపిల్లలేపుట్టిరి. పుట్టిన వెంటనే బిడ్డలు చనిపోయిరి. తల్లి ఆరోగ్యముగనున్నది.

### నాలుగునెలల బిడ్డకు పండ్లువచ్చుట:—

చితల్దుర్గమండలమందు దేవనగరములో భైరప్పయను పోలీసువానిబిడ్డ-నాలుగునెలల పొత్తులపాప-పెద్దవారికివలె పండ్లు దంతములు గల్గియున్నది. చుట్టుప్రక్కలనుండి జనులువచ్చి ఈవింతను చూచుచున్నారు.

### ఒకకన్య పండ్రెండుగంటలకాలము ఈదుట:—

బొంబాయిలో బర్జోరుమాస్టరు, నోషిందలాలు అనుయువకులును; రతిదురవాలాయను పదునైదేండ్ల కన్యయు ఈతపందెమున పాల్గొనిరి. బర్జోరుమాస్టరు 25 గంటల 5 నిముసములు, నోషిందలాలు 19 గంటల 35 నిముసములు ఈదిరి. రతిదురవాలాకన్య 12 గంటలు ఈదెను. తలిదండ్రులు వారించుటచే అప్పుడామె ఇంకను ఓపికయుండినను నీటినుండి బయటకువచ్చినది.

# డైరి

## ఏప్రియలు

19:—సికిందరాబాదు పికెటింగుకేసు సందర్భమున శ్రీమతి కొమ్మూరి శేషమాంబగారికి ఎనిమిదిదినముల కఠినశిక్ష విధింపబడెను.

20:—రాజకీయసాంఘిక ఆర్థిక మోక్షమునిమిత్తము భారతస్త్రీలు చూపినధైర్యమును, కృతనిశ్చయమును లండను మహిళాసభవారు కొనియాడిరి.

21:—మదరాసుతిరువల్లిక్కేణి సముద్రతీరమున జరిగినస్వదేశిసభలో శ్రీమతి కృష్ణాబాయిగారుఉపన్యసించిరి.

:—బొంబాయి మార్వాడీ యువకసంఘమువారు శ్రీమతి కస్తూరిబాయిగారి అధ్యక్షతక్రింద సమావేశమై శ్రీమతి సరోజనిదేవిగారికి సన్మానపత్రము సమర్పించిరి. శ్రీమతి లీలావతీ మున్షీగారు దేవిగారిని ప్రశంసించిరి.

22:—ఏలూరు అన్నవస్త్రవైద్యవిద్యాదానసమాజమునకు తమ్మన పానకాలుగారిభార్య గంగమ్మ అనే సోమమ్మగారు రు 500 శాశ్వతనిధిగా నిచ్చిరి.

:—జాఫ్నావిద్యార్థుల కాంగ్రెసుకు శ్రీమతి కమలాదేవిచటోపాధ్యాయగారు అధ్యక్షతవహించిరి.

23:—శ్రీమతులు పెద్దాడ కామేశ్వరమ్మ, శివరాజు వెంకటసుబ్బమ్మ, బత్తుల కామాక్షమ్మగార్ల ప్రచారమువల్ల రాజమహేంద్రవరములో విదేశవస్త్రములదుకాణములవద్ద పికెటింగు ప్రారంభమయ్యెను.

24:—బొంబాయి హైకోర్టునందు ప్రాక్టీసుచేయుచున్న బారిస్టరు మితిభాయి ఆర్దషరుకన్య బొంబాయి లాకాలేజిప్రొఫెసరుగ నియమింపబడినది. ఇట్టిఉద్యోగము స్త్రీకొసగుటకు ఇదియే మొదటిపర్యాయము.

25:—కలకత్తాలో స్వదేశీవస్త్రప్రదర్శనమును శ్రీమతి నీలరత్నసర్కారుసతిగారు ప్రారంభించిరి.

26:—శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయమ్మగారు ధవళేశ్వరమున జాతీయపతాకోత్సవమును జరిపిరి.

:—శ్రీకనుపర్తి మార్కండేయశర్మగారిభార్య శ్రీమతి రామమ్మగారు రాత్రి 11 గంటలకు స్వర్గస్థులైరి.

27:—రాజమహేంద్రవరనగరకాంగ్రెసు సంఘమువారి సాంవత్సరసభలో దేశసేవలో మరణించిన బ్రహ్మజోస్యుల లక్ష్మీనరసమ్మగారి యాత్మకు శాంతినిగోరుచు తీర్మానముగావింపబడినది.

28:—గంజాముజిల్లాలో మందసా జమీందారివారసత్వమునుగూర్చి ప్రభుత్వమువారు చనిపోయిన రాజాగారి భార్యయగు రాణిగారిహక్కులను గుర్తించి దివానుగారి సహాయమున పరిపాలన చేసికొనుటకు అధికారమిచ్చిరి.

29:—

30:—నెల్లూరులో జిల్లాకాంగ్రెసుసంఘమువారి యాజమాన్యమున జరిగినసభలో శ్రీమతి ద్రోణంరాజు లక్ష్మీబాయమ్మగారుపన్యసించిరి.

:—పాట్నాలో శ్రీమతి చంద్రవతిదేవి అను కాంగ్రెసుప్రచారకురాలిగృహమును పోలీసువారు సోదాచేసి ఆమె వ్రాయుచున్న 'భగత్సింగు జీవితము' అను గ్రంథపుచిత్తుప్రతిని తీసికొనిపోయిరి. ఈగ్రంథము ముద్రణమునందున్నది. ముద్రింపబడిన ఫారములను కూడ పోలీసువారు తీసికొనిపోయిరి.

## మే

1:—అఖిలవంగరాష్ట్రమహిళాసభ కలకత్తానగరమున శ్రీమతి సరళాదేవి చౌదురాణిగారి అధ్యక్షతక్రింద ప్రారంభమయ్యెను.

2:—

3:—కేరళరాష్ట్రమహిళాసభ శ్రీమతి పద్మావతి ఆపరుగారి అధ్యక్షతను బడగరాలో జరిగెను.

:—చీరాలలో శ్రీమతి శ్రీకాకుళము శేషరత్నమ్మగారి అధ్యక్షతను శ్రీమతి కాళంగి శేషమాంబగారు తమ జయిలుఅనుభవములను గూర్చి ఉపన్యసించిరి.

4:—బొంబాయిలో రాష్ట్రీయస్త్రీ సేవాదళసంఘము శ్రీమతి సరోజనీదేవిగారి యధ్యక్షతను శ్రీమతి హంస మెహతాసతిగారి యధ్యక్షతను సమావేశమైనది.

:—రాజమండ్రి హితకారిణీసమాజమువారి యాదరణమున ఆనందాశ్రమములో ఒక వితంతువివాహము జరిగినది. వధువు వీరేశలింగము పంతులుగారి వితంతుశరణాలయములోని బాలిక శ్రీమతి రుక్మిణమ్మ. వరుడు కృష్ణాజిల్లా వేవేరుగ్రామవాస్తవ్యుడు శ్రీలింగాల బంగారయ్య.

5:—శ్రీమతి పెద్దాడ కామేశ్వరమ్మగారు సీతానగరము చతుష్పథమువద్ద పెద్దబహిరంగసభయందుపన్యసించిరి.

6:—దక్షిణకనరా మహిళాసభ మెంగుళూరులో శ్రీమతి కృష్ణాబాయి పంజేకర్ గారిచే ప్రారంభింపబడెను.

7:—

8:—బరంపురములో కల్లుదుకాణముల పికెటింగు శ్రీమతులు జయంతి సూరమ్మ, మంత్రాల సీతామహాలక్ష్మమ్మగార్లచే ప్రారంభింపబడెను.

9:—భారతమహిళాసంఘమువారును మదరాసు స్త్రీలసంఘమువారును ఇండియాపు మెనుకౌన్సిలువారును కలసి ఒక మెమోరాండమును వ్రాసిరి. దీనినిపుడు దేశమునందు ప్రాముఖ్యతగల స్త్రీలకందరికిని పంపుచున్నారు. ఈనెల 15-వ తేదీకి యీ మెమోరాండములు మరల వచ్చిచేరును. '12 మంది స్త్రీలను రౌండుటేబిలుసభకు ప్రతినిధులుగా నియమింపవలెను. అనగా క్రొత్తగా మరి 10 మందిని నియమింపవలెను. వయస్సువచ్చినవారికందరికిని (అడల్ట్సు) వోటింగు అధికారముండవలెను' అని వీరుకోరిరి. ఇదివరకు శ్రీమతి సుబ్బరాయనుసతి, బేగముషానవాజుఖానుగార్లిద్దరును వెళ్లియుండిరి. ఈసారి వీరిద్దరికితోడు శ్రీమతి ముత్తులక్ష్మిరెడ్డి, డాక్టరు బిసెంటు, మజారుద్దీను బేగముగార్లను మరి 7గురిని నియమింపవలెనని వీరుకోరిరి.

:—భీమవరము తాలూకామహిళాసభ భీమవరములో శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయమ్మగారి అధిపత్యమున జరిగినది.

10:—బళ్లారిలో విదేశవస్త్రముల అంగళ్లవద్ద డాక్టరు క. లక్ష్మమ్మగారు, సీతాబాయి, కర్ణం వెంకమ్మ, సుశీలబాయి, క. వెంకటలక్ష్మమ్మ, బి. కమలమ్మ, వి. రాధమ్మ, పి. సీతమ్మ; పి. సుమిత్రమ్మగార్లు పికెటింగు ప్రారంభించిరి.

:—ఏలూరులో ఆంధ్రరత్న యువకసమితివారి యాజమాన్యమున జరిగినసభకు శ్రీమతి గుమ్మిడిదల దుర్గాబాయమ్మగారు అధ్యక్షతవహించిరి.

11:—శ్రీమతి కోటమర్తి కనకలక్ష్మమ్మగారు పాలకొల్లు పికెటింగులో విశేషముగ పాటుబడుచున్నారు.

:—శ్రీమతి లక్ష్మిఅమ్మాళ్ గారి నాయకత్వముక్రింద తిరునల్వేలిలో కల్లుదుకాణము పికెటింగుసాగుచున్నది.

12:—కలకత్తాలో బంగాళా స్త్రీలు శ్రీమతి మోహినీదేవిగారి అధ్యక్షతక్రింద సమావేశమై పికెటింగు బోర్డు నేర్పఱచిరి.

:—రాజమహేంద్రవర స్త్రీసనాతనవిద్యాలయ తృతీయవార్షికోత్సవము జరిగినది.

13:—గాంధిమహాత్మునితో గూడ నాతని సతి శ్రీమతి కస్తూరిబాయిగారు పిల్లాకుచేరిరి.

14:—శ్రీయుత లగిశెట్టి లక్ష్మయ్యశ్రేష్ఠిగారిధర్మపత్ని శ్రీమతి సుబ్బమ్మగారు నంద్యాలలో శ్రీనగరేశ్వరస్వామివారికైంకర్యమునకు మూడువేలుఖరీదు చేయుభూమిని దానము చేసి విల్లువ్రాసి స్వర్గస్థురాలైనది.

15:—

16:—

17:—పెద్దాపురమున బహిరంగసభలో శ్రీమతి దుర్గాబాయమ్మగారును శ్రీమతి మద్దూరి అన్నపూర్ణయ్యపతిగారును ఉపన్యసించిరి.

18:—నిన్నను సిమ్లానుండి వయిసిరాయిలును బయలుదేరుటకుముందుగా శ్రీమతి కస్తూరిబాయిగాంధిగారు విల్లింగ్డనుప్రభ్వీగారితో సంభాషించిరి.

19:—

## పత్రికాపరిచయము

**నవశక్తి:—**

సర్వాంగసుందరమగు నూతనాంధ్రమాసపత్రిక. సంవత్సరచందా రు 4-8-0. తొలిసంచిక ఏప్రియలు మాసమున వెలువడినది. ఇందు శ్రీయుత యతిరాజం శ్రీనివాసులుగారు, శ్రీకృష్ణదేవరాయలు, వైద్యరాజ పి. ఆర్. కే. సుందరంగారు, హంపీదేవాలయము, మహానందిగోరక్షణశాల అను ఛాయాచిత్రములు ప్రచురింపబడినవి. 'నవశక్తి రాయలసీమ (దత్తమండలము) యందొకవిధమగు నవీనపథమును నిర్మింప ప్రయత్నపడగలదు. రాయలసీమయందలి కొంతవఱకు వెనుకబడియున్న సాంఘికసారస్వతమతఆర్థికవైద్యపౌరాణిక చరిత్రాత్మక పరిస్థితులగురించి కొంతసంస్కారమును ఆసించుచు నవశక్తిపాటుపడగలదు. ప్రపంచమార్గమును రాయలసీమ సోదరసోదరీమణులకు బోధగావించుచు అందలి సువిషయములను గమనింపజేయుటయే నవశక్తి ప్రధానాశయము' అని మున్నుడిలో చెప్పబడినది. శరీరవ్యాయామము, శాకపాకములు, ఆంధ్రభాష, నేత్రరోగములు మొదలగు ఈసంచికయందలి వ్యాసములు చదువదగియున్నవి. సంపాదకులు పి. ఆర్. కె. సుందరంగారు. చిరునామా నంద్యాల, కర్నూలు జిల్లా. తెలుగుదేశమున అందుముఖ్యముగ రాయలసీమయందు పత్రికలు విశేషముగ లేవు. ఈపత్రికాకిశోరమైనను చిరకాలము వర్ధిల్లి ఆలోటునుతీర్చుగాక యని కోరెదము.

## ప్రజోత్పత్తిసంచికలు

**ప్రారంభవిద్యసంవత్సరాదిసంచిక:—**

ఏలూరునందలి విద్యోపకరణ వర్తకులు అయిన వేంకటరామ్ అండ్ కోవారు ప్రచురించినది. వ్యవస్థాపకుడు ఈదర వేంకటరావు. సంపాదకుడు కొప్పర్తి నారాయణమూర్తి. ఆంధ్రవిద్యాధికులయు, విద్యాశాఖాధికారులయు చిత్రములతో సంచిక నిండారియున్నది. పద్యవ్యాసములలో శ్రీలక్ష్మీశారదలు వ్రాసిన 'ప్రార్థనపద్యములు', శ్రీరాజా వేంకటాద్రి అప్పారావుబహద్దరువారి 'ప్రేమ', కవికుమార శ్రీరాజా రామచంద్రఅప్పారావుబహద్దరు జమీందారుగారి 'పగలాడి' చదువదగియున్నవి. అమలగ్రంథకర్త్రి, మిస్ శారాజోన్సు, గిడుగు సత్యవతమ్మ, అయినాల అమృతవల్లి తాయారమ్మ మొదలగు ఆంధ్రవిదుషీమణులు ఈసంచికయందు వివిధవిషయములకు చెందిన వ్యాసములు వ్రాసియున్నారు. గద్యవ్యాసములలో బి. సుబ్రహ్మణ్యదత్తుగారి 'ఉచ్ఛ్వాసనిశ్వాసములు'; సం. రామారావుగారి 'ఆహారము : వైటమినులు'; తెన్నేటి వేంకటకామేశ్వరరావుగారి 'క్రమశిక్ష' జ్ఞానదాయకములుగనున్నవి. ఈసంచిక ఆంధ్రవిద్యాధికుల మన్ననకు పాత్రమగునుగాక యని కోరెదము.

# పాకకళ

## గులాబ్ జామ్

శ్రీమతి యు. సత్యబాలసుశీలా దేవిగారు

గులాబ్ జాము గౌరవముగల పెద్ద పిండివంటలలో నొకటి. ఇది చేయనేర్చుట ఆడువారికి ముఖ్యము గావున ఇచట వివరించుచున్నాను. ఒక శేరు చిక్కని బఱ్ఱెపాలు పాత్రలో నుంచి పొయ్యిమీద పెట్టి ఒక గిద్దెడు పాలుగా ఇగురునట్లు మరగ పెట్టవలెను. ఈ మరగ పెట్టుటలో పాలు మాడిపోకుండునట్లు మెలకువ వహింపవలెను. మరగ పెట్టబడిన పాలు చిక్కగా పెరుగువలెనుండును. అప్పుడు దానిని క్రిందకు దింపుకొని 15 తులముల మైదాపిండిపోసి బాగాపిసికి కొద్దిసోడాఉప్పుకలిపి ఒక ముద్దచేసి గిన్నెలో వేసి ఆగిన్నెనిండా నీళ్లుపోసి పెట్టవలెను. ఇట్లు మూడుగంటలు ఉండనీయవలెను. పిమ్మట అరవీసెడు పంచదారలో అరశేరు నీళ్లుపోసి మరుగునట్లు ఉడకపెట్టి తాకితే వ్రేలికి జిగురు అంటునట్లుగా పాకము రానిచ్చి దింపుకొనవలెను. పైన చెప్పిన పిండిముద్దను నీళ్లనుంచేసి పైకితీసి మరల బాగాపిసికి బాదముకాయలవలె ఉండలు చేయవలెను. కళాయిలో సవాశేరు నెయ్యిపోసి బాగా కాగనిచ్చి అందులో ఈ ఉండలు వేసి సన్నటిసెగను ఎర్రగా వేయించవలెను. నెయ్యిసరిగా కాగనిదే ఉండలు వేస్తేగాని మంట జాస్తీగా ఉండినకాని ఉండలు చితికిపోవును. కావున విశేషమైన జాగ్రతచూపవలెను. ఇట్లు జాగ్రత్తగ ఎరుపుడాలు వచ్చునట్లు విడిపోకుండునట్లు ఈ ఉండలను వేయించి, పైన వివరింపబడిన పాకములో నానవేయవలెను. మూడునాలుగు గంటలసేపు నాననిచ్చి భుజింపవలెను. మిగులరుచిగానుండును. బిడ్డలు మిక్కిలి ఆప్యాయముగ తిందురు.

## వంకాయ పాక విశేషములు

### టెంకాయ వంకాయ

'టెంకాయ వంకాయ' అనగా కొబ్బెరి వంకాయ కలగలుపుకూర. పచ్చికొబ్బెరను సన్నగ తురుమవలెను. పచ్చిమిరపకాయలను కొత్తిమరను సన్నగతరిగి తగుమైన ఉప్పునుకలిపి కొబ్బెరతురుములో చేర్చి చక్కగ కలపవలయును. లేతవంకాయలను నాలుగుపక్షములుగ తరిగి అందుపై కొబ్బెరతురుమును వంకాయలలో కూరవలయును. ఈ వంకాయలను మే మాసపు గృహలక్ష్మిలో చెప్పిన మసాలావంకాయ మాదిరిగా పక్వముచేసి వేడిగనుండగ భుజింపవలయును. పైకొబ్బెరతురుమునందు ఇష్టమున్నవారు కొద్దిగ నిమ్మపండురసమును పిడుచుకొనవచ్చును. రుచిగనుండును.

టెంకాయవంకాయ పచనమున మరియొకమాదిరిగలదు. ఎండుకొబ్బెరను సన్నగతురిమి అందు వేయించిన శెనగపిండిని వేయించిన జీడిపప్పును కొద్దిగ ఎండుమిరపకాయలపొడిని తగుమైన ఉప్పును మిళితముచేసి వంకాయలనుతరిగి యీపిండిని అందుకూరి పైమాదిరిగ పక్వముచేసి భుజించవలయును. ఇష్టముండినవారు పైసంబారద్రవ్యములలో ఇంగువనుకూడ చేర్చుకొనవచ్చును.

## నూనె వంకాయ

నల్లనువ్వులను చక్కగాచేసి పక్వముగ వేయించి అందు కావలసిన కారమును ఉప్పును వెల్లుల్లిపాయలను కలిపి చక్కగ పొడియగునట్లు రోటిలో కుమ్మవలయును. పిమ్మట వంకాయలను నాలుగుపక్షములుగ తరిగి కాయలలో పైనువ్వులపిండిని కూరి తిరుగబోతలో నువ్వులనూనెను జాస్తిగవేసి పక్వముగ పచనము చేయవలయును.

## గసగసాలవంకాయ

గసగసాలను పైమాదిరిగనే పక్వముగవేయించి అందుకావలసిన ఉప్పు కారమునుకలిపి వంకాలయందు కూరి తిరుగబోతలో పక్వముచేయవలయును. ఇష్టముండిన ఇందు వెల్లుల్లి కలుపుకొనవచ్చును.

## గరిమసాల వంకాయ

గరిమసాల యనగ లవంగపత్రి, లవంగపట్ట, మరాటిమొగ్గ, లవంగములు, ఏలకులు, జాజికాయ, జాపత్రి, సోపు (పెద్దజీలకఱ్ఱ) యీవస్తువులను సమభాగములుగ తీసికొని నేతితో పక్వముగ వేయించి చేసినపొడి ఈపొడిలో తగుపైనకారపుపొడి ఉప్పునుకలిపి పైనచెప్పిన వంకాయకూరవలెనే పచనము చేయవలెను.

## అల్లపు వంకాయ

లేత అల్లమును పచ్చికొబ్బరతురుమును ఉప్పుకారములను చేర్చి చక్కగనూరి వంకాయలలో కూరి సన్నటిమంటమీద పచనముచేయవలయును.

## ఉల్లి వంకాయ

నీరుల్లిగడ్డలను కావలసినమట్టుకు సన్నగతరిగి అందుకావలసిన ఉప్పు కారములనుచేర్చి వంకాయలందు కూరి తిరుగబోతయందుంచి పక్వముగ పచనముచేసి భుజించవలయును. పైమాదిరిగనే వెల్లుల్లిగడ్డలతో కూడ కూరను చేసుకొనవచ్చును. అయితే వెల్లుల్లిగడ్డలను ముందుగ చమురులో పక్వముగవేయించుకొని ఉప్పుకారములతో కలిపి వంకాయలలోకూరి పచనముచేయుట శ్రేష్టము.

## వ్యాసములు వ్రాయువారికి

గృహలక్ష్మికి వ్యాసములు వ్రాయువారు కొంచము మార్జనువదలి కాగితమునకు ఒకతట్టువనే సిరాతో విడివిడి అక్షరములతో వ్రాయవలెను. పెన్సిలుతో వ్రాయబడినవియు కాగితమునకు రెండుప్రక్కల వ్రాయబడినవియునగు వ్యాసములు చేకొనబడవు. వ్యాసములను గూర్చి ప్రత్యుత్తరములు కోరువారు రిప్లయికార్డువ్రాయవలెను. వ్యాసములు వాపసుకోరువారు తపాలాబిళ్లలు పంపవలెను. వ్రాయు ప్రతిలేఖయందును తమ చిరునామా పూర్తిగ నిచ్చుచుండవలయును.

—సంపాదకుడు.




నేడుగూడ సహగమనము నర్చుసాధ్వులు గలరు:—

> "ఎన్నికకురోమకూపంబు లెన్నిగలవు
> దివ్యవర్షంబులన్ని మోదించుసాధ్వి
> నాకభువనంబునం దాత్మనాథుగూడి
> వెలిపాకింతయులేక చిచ్చుబికనేని."

—కాశీఖండము.

'బొంబాయి సమాచార్' అను గుజరాతి దినపత్రికలో 23-4-31 తేదియందు జరిగిన ఒకానొక స్త్రీయొక్క సహగమనవర్ణన మిట్లుగలదు. శ్రీమతి అఖండ సౌభాగ్యవతి యశోదాభాయి 22 సంవత్సరములు వయస్సుగల సుమంగలి, 25 సంవత్సరముల వయస్సుగల ఠాకూరు భీమజీ ఆనందజీయును దంపతులుండిరి. భర్తకు విషజ్వరమువచ్చి కొద్దిరోజులలో చనిపోయెను. చనిపోవుటకు 4, 5 రోజులకుముందుగా భర్త బ్రతుకడనువిషయము తెలుసుకొన్నదై నాడుమొదలుకొని సంతుష్టయై నేనుకూడా మీతోకూడనే స్వర్గమునకు రాగలను అనిభర్తతో చెప్పుచుండెను. నాటినుండి ఉపవాసముచేయమొదలిడెను. ప్రాణనాథుని శయ్యయందున్న మలినవస్త్రములను తీసుకొని నదికిపోయి వానిని ఉతికి రామస్మరణచేయుచూ ఇంటికివచ్చెను. సాయంకాలము 5 గంటలకు భర్తకుజబ్బు ఎక్కువకాగా అతనికి యమునా జలము కొంచెము గొంతులో పోసి తానుకూడా కొంచెము త్రాగి లోపలికిపోయి పెండ్లి చీరెనుకట్టుకొని అలంకారమును ధరించి కలకలలాడుచుండెను. భర్త మరణసంశయావస్థలో ఆమె చేయుచున్న అలంకారధారణాదికము చూచి బంధువులు పరిపరివిధముల తలంచిరి. రాత్రి 9 గంటలకు భర్తను మంచముమీాదనుండి భూమిమీాదపరుండబెట్టగా ఈస్త్రీరత్నము దేహమునిండ నెయ్యి పూసుకొని కిరసనాయిలులో తడిపిన చీరెను బాగుగ బిగించి కట్టుకొన్నదై నేనుకూడామీావెంటనేవచ్చుచున్నాను, నిర్భయులరై బయలుదేరుడు అని కేకవేసి నిప్పు ముట్టించుకొనెను. అచట భర్త ప్రాణములుపోయెను. ఇచట మంటలవెలుగుచూచి చుట్టాలువచ్చిచూచునప్పటికి చాలమట్టుకు దేహమంతయు తగులబడిపోయెను. మొగము

నందు సింధూరమును తలవెండ్రుకలు మాత్రము తగులబడలేదు. అంతట డాక్టరు వగైరాలు వచ్చిరి. మీరెవ్వరు నన్ను తాకకుడు. మీరు రమ్మన్న చోటికి నేనేవచ్చెదను అని చెప్పి ఆయువతీరత్నమువచ్చి బయటకూర్చుండెను. మందు మాత్రము పుచ్చుకొనలేదు. అందరును ఎటుల చేసితివని యడుగగా స్త్రీలకేది యవశ్యాచరణీయమో అట్టి ధర్మము నేను చేసితిని అని సమాధాన మిచ్చెను. భర్తను శ్మశానమునకు తీసుకొని పోవుచుండగా నన్నుకూడా తీసుకొని తనభర్తతోడ దహనము చేయుడనియు ఇక అరగంటమాత్రము తాను జీవింతు ననియు యశోదాబాయి చెప్పెను. కాని ఆమాటలను దుఃఖోద్గారములుగా తలంచి లెక్క చేయక భర్తనుశ్మశానమునకుతీసుకొనిపోయిరి. పోలీసులువచ్చివిచారింపగా ఆమె తనకు అగ్ని వలన బాధఏమియు లేదనియు చల్లగానున్నదనియు స్వహస్తముతో వ్రాసి పోలీసువారి కిచ్చెను. శ్మశానమునందు భర్తశవమునకు రెండుపర్యాయములు నిప్పుపెట్టగా చల్లారిపోయె నట. ఇంతలో యశోదాబాయిగూడా మరణించెను. తద్వార్త శ్మశానమున దెలిసి యశోదాబాయి శవమునుగూడా ఆచితియందేబెట్టి అగ్నిని ముట్టింప రెండుగంటలలోపల రెండుశవములు భస్మావశేషములై పోయెను. అని శ్రీ కా. మా. శర్మగారు మే 19-వతేదీ నాటి ఆంధ్రపత్రికలో ప్రచురించినారు. వితంతు వివాహములు, వివాహవిచ్ఛేదములు మొదలగు సంస్కారములను రుచిచూచుచున్న నవీనయుగమునగూడ భారతస్త్రీలోకమున

> "పెండిలివాడు భూబృందారకులు గన్య నప్పగించిరొలేదొ యధిపుగూర్చి
> సహచారిణివిగమ్మ సకలకాలమునందు నిందుజందురుని చంద్రికయుంబోలెఁ
> దొలుకారు మెఱుగు విద్యుల్లతయునుబోలె ననుగమింపగబాడి యతివమగని
> విశ్వసనంబునదాక బతివిమానముపెంట గైసేసి కొలవాడ గదఁ ఖంగి
>
> > చితికికండరొకింత లేకఱమివేడ్క
> > జిచ్చుఱకబోవు వికచరాజీవనేత్ర
> > కశ్వమేధంబుఫలము తథ్యంబుగలుగు
> > బదనుపదమున కిది వేదభాషితంబు."

—కాశీఖండము.

అనినమ్మి ప్రాక్తనభారతరమణులవలె సహగమన మొనరించు సాధ్వులుండుటను బట్టి భారతస్త్రీల అలిలోకమైన పావిత్ర్యంబులు లోకాతీతకీర్తినందుచున్నవి. అప్పుడును, ఇప్పుడును, ఎప్పుడును భారతరమణి పవిత్రతకు ప్రథమోదాహరణము. ఇట్టి పరమపావన పతివ్రతలచరిత్రలచే ఈభరతధాత్రి ఎల్లకాలము విన్నాణమొందుచునేయుండును.

**స్నాతకసభకు ఆచార్యపదవి స్త్రీకీయబడినది:—**

అగస్టు ౨౦వ తేది లక్ష్మివారమున మదరాసు విశ్వవిద్యాలయ స్నాతకసభ జరుగును. అందు పట్టప్రదానముగావించుఆచార్యపదవి ఈవత్సరమొక స్త్రీకీయబడినది. మదరాసువిశ్వ

విద్యాలయము ఛాన్సలరగు గవర్నరు మదరాసు స్త్రీల క్రైస్తవకళాశాలాధ్యక్షురాలగు శ్రీమతి ఇ మాగ్డొగల్ కన్య నీపదవి స్వీకరింప ఆహ్వానించెను. ఆవిడుపె ఈఆహ్వానము నంగీకరించినది. స్త్రీల ఉద్యమాభివృద్ధినిగోరువారి కిదియొకశుభవర్తమానము. ఈవిదుషీమణి ఆచార్యకమున ఈవత్సరపు స్నాతకసభ విక్కవిరియుగాక!

ఢిల్లీమ్యునిసిపాలిటీ: స్త్రీలకు వోటింగుహక్కు:—

ఢిల్లీమునిసిపలుసభవారు స్త్రీలకువోటింగుహక్కును తమ మ్యునిసిపాలిటీయందొసంగుటకై తీర్మానించిరి. వోటునీయదగిన స్త్రీలయొక్క అర్హత లీక్రిందిరీతిగా నిర్ణయించిరి.

1. నవంబరు 1 తేదీనాటికి 21 సంవత్సరములవయస్సు ఉండవలెను. లేదా

2. రు 20 లు అద్దెరాబడిగల యిల్లునకు ఖామందు అయియుండవలెను. లేదా

3. నవంబరు 1 తేదీకి 6 నెలలుపూర్వము ఢిల్లీలో నివాసినియైయుండవలెను. లేదా

4. రాబడిపన్ను చెల్లించునట్టి యామెగా నుండవలెను. లేదా

5. ఎన్నికలకు ముందుగతించిన సంవత్సరములో రాబడిపన్ను చెల్లించునట్టివానికి ఆమె న్యాయసమ్మతమైన భార్యగా నుండవలెను. లేదా

6. మెట్రిక్యులేషను పరీక్షయందు తీర్ణురాలైన యువతిగానైన యుండవలెను.

గమనింపదగిన మఱియొక్క విషయము గలదు. మ్యునిసిపలు సభ్యత్వమునకు అభ్యర్థినులుగానుండుటకు పడుపుకత్తెలు అనర్హలని వారు తీర్మానించిరి. భారతదేశమునందలి పౌరజీవనము **(civic life)** శుచిప్రాపకముగ నుండవలయునని కోరుచో ఈతుదినియమ మెంతయు నవసరము.

అమెరికాలోనే ఇట్లుండినచో...?

నేడందిన **'World's Children'** అను పత్రిక ఇట్లు ప్రచురించుచున్నది. 'అమెరికా సంయుక్తరాష్ట్రముల అధ్యక్షమహాశయుడగు హూవరు ఈనడుమ వాషింగ్టన్‌పట్టణమున జరిగిన శిశువుల ఆరోగ్యవిషయికసభలో నుపన్యసించుచు యునైటెడ్‌స్టేట్సులోని శిశువుల ఆరోగ్యమునుగూర్చి క్రిందిలెక్కలను ప్రదర్శించెను. నేడు యునైటెడ్ స్టేట్సునందు 45,000,000 మందిశిశువులుగలరు. అందు 35,000,000 మంది తాజాస్థితిలోనున్నారు; 6,000,000 మంది తగినపోషణలేకయున్నారు; 1,000,000 మంది వాక్సంబంధమైనరోగములు కలిగియున్నారు; 1,000,000 మంది దుర్బలహృదయములతోడనో చెడినహృదయములతోడనో వెతనొందుచున్నారు; 675,000 మంది అల్లరివిషయమున హద్దుమీరి ప్రత్యేక సమస్యను ప్రదర్శించుచున్నారు; 450,000 మంది మందప్రజ్ఞతో క్రుగ్గుచున్నారు; 382,000 మంది క్షయరోగలక్షణములు కలిగియున్నారు; 342,000 మంది కర్ణసంబంధమైన రోగములు కలిగియున్నారు; 18,000 మంది పూర్తిగ చెవిటివాండ్రయి ఉన్నారు; 300,000 మంది

కుంటివాండ్రయి ఉన్నారు; 50,000 మంది నేత్రవ్యాధులు కలిగియున్నారు; 14,000 మంది పూర్తిగ గ్రుడ్డివాండ్రయి ఉన్నారు; 200,000 మంది అపరాధులుగనున్నారు. ఇట్లు నేటి మన శిశువులలో 10,000,000 మంది అనారోగ్యమును సూచించుచున్నారు. తగు వైద్య సాహాయ్యము గావింపబడుచో ఇందు నూటికి ఎనుబదిమందివఱకు ఆరోగ్యవద్దేహులు కాగలరు.” శాస్త్రపరిజ్ఞానము, వైద్యజ్ఞానము పారముముట్టిన అమెరికాదేశములో; ప్రజల అందుబాటున వైద్యులున్న అమెరికాదేశములో; శిశువుల సగటుమరణములు తక్కువగ నున్న అమెరికాదేశములో శిశువులస్థితి ఇట్టిదికాగా పేదరాసిపెద్దమ్మయగు భారతమాత శిశువులస్థితి ఎట్లున్నదో ఆలోచించుటకైన అవకాశమున్నదా? అమెరికాదేశమున తయారు చేయబడినవిధమున భారతదేశమునకూడ శిశువులనుగూర్చిన జనాభాగ్గై కొనబడుచో భారత శిశువుల శోచనీయస్థితి వెల్లడికాగలదు.

**స్థానిక సంఘములు: స్త్రీలు:—**

గత శాసనసభలో స్థానికసంఘములచట్టము సవరింపబడినప్పుడు అప్పటిశాసనసభా సభ్యురాలు ప్రతిస్థానికసంఘమునందును స్త్రీలకు ప్రత్యేకము రెండుస్థానములు కేటాయింపు చేయవలసినదని ప్రతిపాదించినది. ప్రభుత్వమువారును ప్రజాప్రతినిధులును ఆప్రతిపాదనమును విశాలహృదయముతో ఆమోదించిరి. ఇప్పుడు కొన్నికొన్ని మునిసిపాలిటీలయందును, తాలూకాజిల్లాబోర్డులయందును వెనుకబడియున్న ఇతర కులములవారికి చోటుచూపుటకు స్త్రీలసంఖ్య తగ్గించుటకు ప్రయత్నములు సాగుచున్నవని వినబడుచున్నది. ఈప్రయత్నము ఎంతమాత్రమును ప్రోత్సహింపదగినదికాదు. ప్రాథమికవిద్య, ప్రజారోగ్యము మున్నగు విషయములందు స్త్రీలఆలోచన స్థానికసంఘములకు మిక్కిలి అవసరము. కావున స్త్రీల సంఖ్యతగ్గించు ప్రయత్నములను స్థానికసంస్థలు సాగింపకుండుగాక! స్త్రీ ఉద్యమాభిమానులగు ప్రజానాయకులీవిషయమై వెంటనే మేలుకొని ఆందోళనసల్పి స్త్రీజనములకృతజ్ఞతకు పాత్రులగుదురు గాక!

**తిట్టనేర్చిన నోరు ఊరకుండదు:—**

మేయమ్మ తనదూషణాగ్రంథమును మరల విప్పినది. హిందువులబాల్యవివాహముల ఆచారము ఈసారి ఆమె దూషణబాణమునకుగుఱియైనది. తిట్టితిట్టి ఆమెయిచ్చిన సలహా యేమి? బాల్యవివాహములవలన కలిగిన సంతానమును అక్రమసంతానముగ నిర్ణయింపవల యునని. తనదేశమున భార్యాభర్తలు కాని స్త్రీపురుషులకు పుట్టిన అక్రమసంతానమును గూడ క్రమసంతానముగనే పరిగణించుటకు అభిప్రాయము ప్రబలుచుండగా హిందూదేశ మున వివాహబద్ధులైన దంపతుల క్రమసంతానము అక్రమసంతానముగ పరిగణింపవలయు నట. ఎట్టి విపరీతభాషలు? ఉన్నది గాజుయింట. అయినను ఇతరుల ఇంటిమీదరాళ్లు వేయుట తనవృత్తి. ఈగురివెందగింజ కూతలకు పాటియేమి?

**నంబూద్రి బ్రాహ్మణులు : బహుభార్యాస్వీకరణము:—**

మలబారునందలి యువకులు మహాత్ముని సత్యాగ్రహమునకు నూతనప్రయోగము నొకదానిని కనుగొన్నారు. వారు సత్యాగ్రహబాణమును మలబారులోని నంబూద్రి బ్రాహ్మణులయందున్న బహుభార్యాస్వీకరణముపై గురిపెట్టినారు. నంబూద్రి బ్రాహ్మణులయందు ఏబదియేండ్లకు పైబడినవారు నూతనముగ పుష్పవతులైన యువతులను తమ రెండవభార్యలుగనో మూడవభార్యలుగనో చేకొనుచుండుట పరిపాటి. నంబూద్రి బ్రాహ్మణ యువజనసంఘమువారు ఈ ఆచారముయొక్క దౌష్ట్యమును గుర్తించినారు. ఏప్రియలు మాసమున ఆల్వేసమీపమునగల ఒకానొక గ్రామమున పందొమ్మిది వత్సరముల పడుచును ఏబదిఏండ్లుదాటినవానికి మూడవభార్యగా వివాహముచేయుటకు నిశ్చయించిరి. ఈ సంగతి యువకసంఘమువారు తెలిసికొని ఆగ్రామమునకుబోయి వధువుయొక్క పెద్దలను సందర్శించి ఈయసమవివాహమును విరమింపవలసినదిగా విన్నవించుకొనిరి. సర్వమునిశ్చయమగుటచే వివాహము సాగితీరవలెనని ఆపెద్దలుచెప్పిరి. అందుమీద ఆయువకసంఘమువారు ఆగ్రామమున ఇంటింటికిబోయి ఈదురాచారమువలని నష్టములను విడమర్చిచెప్పి వధువు ఇంటిదగ్గరకువచ్చి వీధిలో బారలుతీరికూర్చుండిరి. ఈప్రదర్శనముచే వివాహమాగలేదు. కాని ప్రజలలోమంచిప్రబోధముజరిగినది. యువకసంఘమువారు ఇంతతోనిరుత్సాహపడరాదు. ఇట్టి యువకసంఘములెన్నో బయలుదేరి కేరళదేశపు పొలిమేరలనైనలేకుండ ఈదురాచారపిశాచమును వెడలనడతురు గాక!

**మధుర, టూటికారన్ మిల్లుపనికత్తెలకడగండ్లు:—**

మధుర, టూటికారన్ పట్టణమునందలి బట్టలమిల్లులలో పనిచేయుస్త్రీలకష్టములు సహింపరానివిగనున్నవి. హిందూదేశమున ఇతరప్రదేశములందలి బట్టలమిల్లులలో చేయుటయందలి కష్టముచే ప్రత్యేకము పురుషులకు ఏర్పరుపబడిన పనులనుగూడ నిచ్చట స్త్రీలే చేయుచున్నారు. ప్రసవదినసౌకర్యములనుగూర్చిన చట్టములేదుగావున అట్టి సౌకర్యములీయబడుటలేదని నెపమెంచుటకు వీలుచాలదు. అయినను బిన్నీకంపెనీ హ్యారీకంపెనీ తమంతతామే ఈవిషయమున ఏవో కొన్నిసౌకర్యములను కలిగించిరని తెలియుచున్నది. అయినను ప్రాయికముగా నీపట్టణములందు పెక్కుమిల్లులలో అట్టివారిని నెలలునిండుచుండగా పనినుండి తీసివేయుటయు ప్రసవానంతరము తిరిగిపెట్టుకొనుటయు మామూలైయున్నది. టూటికారన్‌నందు మధ్యాహ్నము కూలివాండ్రు తిండితినుటకు తగినతావులేదు. పనివాండ్రును పనికత్తెలును మిట్టమధ్యాహ్నమునందు మింటసూర్యుడు సహస్రకిరణములతో ప్రకాశించుచుండగా ఆసముద్రతీరపు టిసుకబయలునందు అపురుఅపురుమనుచు అన్నము తినుచుండగా చూచినచో ఎట్టివారికైన ఏడుపురాకమానదు. టూటికారన్‌లో పనిచేయు కాలమునందు ఒకసారియైనబయటికిపోయి చంటిబిడ్డకు పాలిచ్చివచ్చుటకు తల్లికివలనుపడదు.

మధురలో మిల్లునకెదురుగా ఒకచిన్నపాకగలదు. టూటికొరన్‌నందు అదియులేదు. టూటికొరన్ మిల్లుమేనేజరు అచ్చటిజంతుహింసానివారకసంఘమునకు అధ్యక్షుడు. అయినను పనికత్తెలను జంతువులుగానైన పరిగణించుటకు మనస్కరించకనో ఏమొ ఈమహనీయుడు వారిట్టి కష్టపరిస్థితులలో నుండ చూచి ఊరకొనుచున్నాడు. ఈవిషయము లన్నియు స్వయముగా చూచివచ్చి బి. శివరావుగారు పత్రికలకు వ్రాయుచున్నారు. భారత స్త్రీసంఘమువారు ఈవిషయమున కలుగచేసికొని పనికత్తెలబిడ్డలను పెక్కుగంటల కాలము పస్తుపడియుండుపాపమునుండి ఉద్ధరింతురుగాకయని కోరెదము.

**శ్రీమతి రామాదేవి నిర్బంధము:—**

శ్రీమతి రామదేవి అజ్మీరు నివాసినియగు కాంగ్రెసుప్రచారకురాలు. ఆమె గత మాసము 11-వ తేదీని బిజోలియా సంస్థానమున నిర్బంధింపబడినది. ఆమె నెటకుగొని పోయిరో తెలియరాదు. పురుషుల విషయమున నెట్లున్నను స్త్రీలవిషయమున ఇట్టినిర్బంధములు న్యాయాన్యాయములెఱింగనిసంస్థానాధీశ్వరులుచే యుచుండినచో దేశమున అలజడి పెచ్చు రేగగలదు.

**శ్రీ విల్లింగ్డను ప్రభ్వి కద్దరు బట్టలను కోరుట:—**

గత మాసము 18-వ తేదీని శ్రీకస్తూరిబాయి గాంధి శ్రీవిల్లింగ్డనుప్రభ్విని సందర్శించినపుడు ప్రభ్వి తనకు కద్దరుబట్టలు కొన్ని పంపమనికోరినదని తెలియుచున్నది. గాంధి మహాత్ముని కద్దరుబట్టలు శత్రుశిబిరప్రవేశమునందుచున్నవి. అఖండవిజయమున్న నిట్టిదియే గదా!

## గ్రంథపరిచయము

**పతివ్రతాశతకము:—**

ఇదియొక సంధానగ్రంథము. నన్నయభట్టు ఆదిపర్వము; ఎఱ్ఱాప్రెగడ అరణ్యపర్వము; తిక్కన అనుశాసనికపర్వము; ప్రౌఢకవిమల్లన రుక్మాంగదచరిత్ర; శ్రీనాధుని కాశీఖండము, శృంగారనైషధము; భాస్కరుని రామాయణము; మారన మార్కండేయపురాణము; నందిమల్లయ్య ఘంటసింగయ్యకృత వరాహపురాణము; గోపీనాధకవి శ్రీకృష్ణజన్మఖండము, రామాయణము; మాదయగారిమల్లన్న రాజశేఖర చరిత్రము; బమ్మెర పోతరాజు భాగవతము; ముక్కు తిమ్మన్న పారిజాతాపహరణములనుండి పతివ్రతాధర్మములను ప్రస్తావించు పద్యరత్నము లీగ్రంథమున నేర్చికూర్చబడినవి. టిప్పణిగలదు. గ్రంథసంధాత్రి శ్రీమతి చేబ్రోలు సరస్వతీదేవిగారు. గ్రంథమునుగూర్చి శ్రీచిలకమర్తి లక్ష్మీనరసింహముగారు సదభిప్రాయమునిచ్చియున్నారు. క్రౌను సైజున 40 పుటలు. వెల 0-4-0 అణాలు. వలయువారు చేబ్రోలు రాజగోపాలరావుగారు 6/443 కొత్తపేట, నూజవీడు, కృష్ణజిల్లా అనుచిరునామాకు వ్రాయునది.

**పాటలు:—**

శ్రీమతి చోడవరపు రంగనాయకమ్మగారి 'పాటలు' అను గ్రంథమున ఇది ద్వితీయభాగము. డెమ్మిసైజు 86 పుటలు. వెల తెలుపబడలేదు. దొరకుచోటు చోడవరపు వేంకటశేషగిరిరావు, మైదాన్ వ్య, కొత్తపేట, గుంటూరు. గ్రంథకర్త్రి ఛాయాచిత్రము, గ్రంథముద్రణభారము వహించిన గ్రంథకర్త్రి పినమామగారు శ్రీ

చోడవరపు దేవళరాజుగారి ఛాయాచిత్రము గ్రంథమున చేర్పబడినవి. మంగళహారతులు, హాస్యపుపాటలు, వేడుకపాటలు, బంతులాటపాటలు మొదలగువానితో నిండి గ్రంథము స్త్రీజనములకు ఉపయుక్తముగనున్నది.

### పల్నాటివీరులు:—

సతీరత్నములు, చరిత్రకథామంజరి, మానసోల్లాసినీకథలు మొదలగు పుస్తకములు రచియించినవారును, మాచవరము పాఠశాలప్రధానోపాధ్యాయులును అయిన శిష్ట్లా రాధాకృష్ణయ్యగారు రచియించిన గ్రంథమిది. గ్రంథకర్త ఛాయాచిత్రము ముద్రింపబడినది. దాచేపల్లి బోర్డుమిడిల్‌స్కూలు ప్రధానోపాధ్యాయులగు యస్. మల్లపరాజరావుగారు ఈగ్రంథమునకు తొలిపలుకువ్రాసినారు. బాదరాజు, నలగామరాజు, బ్రహ్మనాయుడు, బాలచంద్రుడు, అలరాజు, అనపోతుడు, కన్నమదాసు, లంకన్న, నాయకురాలు అనుతొమ్మిది పల్నాటివీరకథలుగలవు. పల్నాటిసీమకు సంబంధించిన ఈకథలు ప్రాథమికవిద్యార్థుల నిమిత్తము ప్రత్యేకించి సులభమగు శైలిలో వ్రాయబడినవి. ఈగ్రంథరచనమున కర్త 'పలునాటి వీరచరిత్రము', 'పల్నాటి యుద్ధము', 'ఆంధ్రులచరిత్ర' మొదలగు గ్రంథముల నాధారముచేసికొన్నాడు: సందర్భానుసారముగ 'పలునాటి వీరచరిత్ర'లోని ద్విపదలు ఇందుచేర్పబడినవి. క్రౌనుసైజున 68 పుటలు. వెల 0-6-6. గ్రంథకర్తవద్ద దొరుకును.

### బీడీపురాణము:—

చిన్నసైజు. పీచుకాగితములు. 52 పుటలు. వెల 0-2-0 అణాలు. గ్రంథకర్త వేది శ్రీరాములుగారు. బీడీ తనచరిత్ర తాను చెప్పుకొనుచున్నట్లు వ్రాయబడినది. దానివలని అపారనష్టములు ప్రదర్శింపబడినవి. కొంత హాస్యపోషణప్రయత్నముగలదు. ధూమపానదురభ్యాసమును నిందాస్తుతిలో నిర్గించు ప్రాచీనాంధ్ర చాటూక్తులు ఈగ్రంథమున జొప్పింపబడినవి. దొరుకుచోటు: యస్. ఆర్. వేది అండ్ కో. రాయదుర్గం పోష్టు, బళ్లారి జిల్లా.

### ఇటావాసమాధి:—

తూర్పుగోదావరిజిల్లా అంబాజీపేట పోష్టు మునిఖండమునందలి యువకసమితివారు ప్రచురించిన తొలికరపత్రము. అమలాపురమునందలి కోనసీమ ముద్రణాలయమున ముద్రితము. **Malleson** రచియించిన **Indian Mutiny** అను గ్రంథమునుండి ఇందలి ఇతివృత్తముచేకొనబడినది. దేశభక్తినుద్దీపింపజేయుఈభారత వీరులకథ చదివితీరవలయును. క్రౌనుసైజున 8 పుటలు. వలయువారు యువకసమితికార్యదర్శికి వ్రాయునది.

### వైదికసభ్యత:—

ఇది ప్రథమతరంగము. భారద్వాజగోత్రోద్భవుండును వైదికవిద్యార్థియునగు పాలడుగు శేషాచలార్యులు రచియించినది. డెమ్మీసైజున 112 పుటలు. వెల 0-8-0 అణాలు. గాంధిమహాత్ముని స్వాతంత్ర్యోద్యమము ప్రారంభమైననాటినుండియు భారతభూమిని పవిత్రీకరించుచున్న 'ఖద్దరు'ను తయారుచేయుట ప్రాచీన భారతభూమియందు ఎట్లు ఆర్యులకు నిత్యకృత్యమైయుండినదో, వడకుట ప్రాచీనార్యసుందరీమణులకెట్లు గృహధర్మమైయుండినదో, సుందరీమణులు సన్నని నూలువడకొని చక్కనిఅంచులతో మధురమగు అంతరంగికప్రేమతో గలిపి భర్తలకొఱకు వస్త్రములు నేయుచుండిరో ఈగ్రంథమున వేదవాక్యప్రమాణములతో నిరూపింపబడినది. ఈగ్రంథమునకు పీఠికవ్రాయుచు స్వరాజ్యపత్రికాసంపాదకులగు దుగ్గిరాల రాఘవచంద్రయ్యచౌదరిగారు "ప్రాచీనార్యగృహజీవితమును రాజకీయజీవితమును జిత్రించి మనకు తలయెదుటబెట్టి 'ఖద్దరు' యొక్కపవిత్రతను వెల్లడించుచున్న ఈగ్రంథము 'వైదికసభ్యత' యను చక్కని నామమున కింతయు దగియున్నది. వేదములు మూలబడియున్న యీకాలములో శ్రమపడి వేదములుగోలించి చక్కనివస్తువు

ఆంధ్రవాచకప్రపంచమున కొసంగిన ఈకర్త వంద్యుడు" అని వ్రాసినవాక్యము లెంతయు సత్యములు. వేదకాలములో రాట్నముపైన నూలువడకుట, నేయుట హిందూగృహధర్మమనియు, నేటికాలములోని వివిధములగు చక్కనిదుస్తులు, శాలువలు ఆకాలములో నెంతచక్కగా నిర్మాణముచేయబడినదియు సప్రమాణముగా నిరూపించు ఈగ్రంథము ఎల్లరు చదువదగినది. దొరుకుచోటు: ఆదర్శగ్రంథమండలి, ఎలమర్రు, కృష్ణాజిల్లా.

**కమలా వాచకములు:—**

బాలికాపాఠశాలలకు ప్రత్యేకముగ వ్రాయబడిన వాచకపుస్తకములు. శారీరశాస్త్రము, ఆరోగ్యశాస్త్రము గృహనిర్వాహకత్వము మొదలగు గ్రంథములకర్తలగు సత్తిరాజు కామేశ్వరరావు పంతులు బి.యే; యల్.టి. రిటైర్డు డిప్యూటి ఇనస్పెక్టరు ఆఫ్ స్కూల్సుగారిచే నీవాచకములు రచియింపబడినవి. ఒకటి, రెండు, మూడు, నాలుగు, అయిదు వాచకములు విమర్శనార్థము మాకార్యాలయమునకు బంపబడినవి. వాచకములన్నియు క్రౌనుసైజున గ్లేజుకాగితములమీద పలురుబొమ్మలతో ముద్రితములు. మొదటి వాచకము 56 పుటలు. వెల 0-2-6; రెండవవాచకము 48 పుటలు. వెల 0-3-0; మూడవవాచకము 72 పుటలు. వెల 0-4-0; నాల్గవవాచకము 88 పుటలు. వెల 0-5-0; అయిదవవాచకములు 116 పుటలు. వెల 0-6-0; రాజమండ్రి సెకండరీబాలికాపాఠశాలలో పనిచేసి కీర్తిగాంచిన ఆంధ్రవిదుషీమణి శ్రీమతి దర్భా కనకమ్మ ఎం. ఏ, గారీవాచకములకు తొలిపలుకు వ్రాసియున్నారు. నీతిదాయకములును స్త్రీలనుగురించి వ్రాయబడినవియు కథలును, దేశమున మహోపకారిణులును విశేషవిద్యావతులునగు స్త్రీరత్నముల జీవితచరిత్రములును, ఆంధ్రకవయిత్రుల వృత్తాంతములును, పురాణప్రసిద్ధిగాంచిన సీత, దమయంతి, సావిత్రి, గాంధారి మున్నగుమహాపతివ్రతల మహిమాతిశయములును; స్త్రీలింటివద్ద తీరికసమయములందు చేసికొనదగిన చిత్రలేఖనము, కుట్టుపని, పూసలపని మొదలగు చేతిపనుల విధానములును; గృహనిర్వహణవిషయమై నేర్చుకొనదగిన యాదాయవ్యయములు, బిడ్డలకు విద్యాబుద్ధులుగఱపుట మున్నగుసంగతులును; నిత్యము తాము సిద్ధపఱచవలసిన యాహారపానీయాదుల పారిశుద్ధ్యమును గూర్చిన యారోగ్యమార్గపద్ధతులును, అంటురోగములంగూర్చి జాగ్రతపడవలసిన రీతులును; బొమ్మల నోము, సంక్రాంతి మొదలగు స్త్రీలకే పనికివచ్చుపండుగపబ్బములంగూర్చిన వర్ణనములును, దేశమందలి విదేశమందలి స్త్రీలయాచారములు వ్యవహారములు తెలియజేయువినోదకరములగు విషయములును, ప్రస్తావించునవియై యిందలి పాఠములు బాలికలకు మిక్కిలి ఉపయుక్తముగనున్నవి. విద్యాశాఖాధికారుల మన్ననలకు పాత్రమగుగాక! దొరుకుచోటు: కమలానికేతనము, రాజోలు, తూర్పుగోదావరి జిల్లా.

**ప్రపంచ వినోదకథలు:—**

కర్త బి. టి. నరసింహాచార్యులుగారు. క్రౌనుసైజున 270 పుటలు. వెల రు 1-0-0. ప్రచురణకర్త: ప్రొప్రయిటరు, వాసన్ పుస్తకశాల, 244 టంకశాలవీధి, మదరాస్. 'క్రొత్తపండుగ బహుమతి'; 'జోశ్యపు పిచ్చి'; 'పండువంటి సంసారాన్ని పాడుచేసుకున్నావే'; 'సంసారం సాగరం దుఃఖమ్', 'పేరాశయే పెను భూతమగుట'; 'అన్యాయార్జితం విత్తం సహమూలం వినశ్యతి'; 'కుక్కకాటికి చెప్పుదెబ్బ'; 'అవధాని అనుమానమే అంతానికికారణము'; 'మోహనాంగిమోసం'; 'పెంకిపెళ్లాం గడుసుమొగుడు'; 'పెనిమిటిని వొదిలిన పేరమ్మ' అను శీర్షికలుగల పదునొకండుకథ లీగ్రంథమునగలవు. 'ప్రపంచములో సహజముగా జరుగుచుండు విషయముల నాధారపఱచి తద్వారా చక్కనినీతులను బోధించుటకై రసభావభరితమగు నాడుకభాషాశైలితో నీగ్రంథము వ్రాయబడియుండుటచేత నిందలి కథాంశములు కన్నులగప్పినట్లు గోచరించుచున్నవి' అని సంపాదకులు తొలిపలుకులో వివరించిరి. ఇందలి కొన్నివర్ణనములు విచిత్రముగనున్నవి. కొన్ని చక్కనిక్రొత్తసామెతలు వాడబడినవి.